Shakespeare, William, 1564-1616

పుళిందాసుశీలము లేక ఒథెల్లో

Madras, 1909

Record no. 274

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

Bibliographic Record Target

Shakespeare, William,1564-1616.
ఫుళిందాసుశీలము లేక ఒథెల్లో / ఆంగ్లేయ కవి William Shakespeare యొక్క నాటకము చి. శ్రీనివాసరావుచే ఆంధ్రీకరింపఁబడినది.- Madras : చి. శ్రీనివాసరావు, 1909.
14, (2), 108 p. ;21 cm.
Record no. 274

Shakespeare, William,1564-1616.
Puḷindāsuśīlamu lēka Othellō / Āṃglēya kavi William Shakespeare yokka nāṭakamu Ci. Śrīnivāsarāvucē Āṃdhrīkarimpam̐baḍinadi.- Madras : Ci. Śrīnivāsarāvu, 1909.
14, (2), 108 p. ;21 cm.
Record no. 274

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB Date filming began:

పులిందా సుశీలము

# PULINDA SUSILAM

OR

# OTHELLO

2.4.4.5.23 8/2
893
ర-106



C. SRINIVASA ROW.

Copy-right.] 1909 [*Price* **12** *As.*

# పుళిందాసుశీలము.



విషాదము.



ఆంగ్లేయ కవిశేఖరుండగు షేక్స్పియరుయొక్క అత్యుత్తమ నాటకంబగు

## ఒథెల్లో.

---

చి. శ్రీనివాసరావుచే ఆంధ్రీకరింపఁబడి ప్రచురింపఁబడెను.

---



PRINTED AT THE PROGRESSIVE PRESS,
MADRAS.

---

కాపీ రైటు.] 1909. [వెల 0-12-0.

822
SHA-D

# విలియం షేక్స్పియరుయొక్క జీవితము.

---

విలియంషేక్స్పియరు యొక్క పూర్వీకులను గూర్చి స్పష్టముగ తెలిసి కొనుటకు ఆధారములు లేవు. ఈతని యొక్క వంశము ఇంగ్లాండులోని వార్విక్షైరు యొక్క కృషీవలుల దని మాత్రము మనకు తెలియును. ఇతని తండ్రి జానుషేక్స్పియరు, పూర్వార్జితమగు కొంచెము భూమికి దగ్గర నుండు ఆవనునదీ తీరమునను న్న స్ట్రాటుఫోర్డు నందు, నివాసమేర్పరచుకొని తోళ్లు, ఉన్ని, మాంసము, ధాన్యము మొదలైన వాని వ్యాపారముచేసికొను చుండెడి వాడు. ఈతని యొక్క తల్లి విద్యావంతురాలు కాదుకాని, భర్తకంటె మార్దవగుణంబులు కలిగి యుండి స్ట్రాటుఫోర్డునందు ఆమె మెట్టినింటికి, పరుషహృదయండై లౌకికవ్యవహారము లందు మునిగి తేలుచుండు భర్తయొసంగఁ జాలని ధీరదయారసంబులను కొని తెచ్చి నటుల నామె సుమారువి నాటకంబులు చదివిన వానికి తేటపడఁగలదు.

మన దేశమున, సంస్కృత నాటకరచనంబున నఖండవిఖ్యాతి గాంచిన కాళిదాసు జీవించిన కాలమునకు సుమారు **1100** సంవత్సరములకు పిమ్మట నీషేక్స్పియరు కవి వరుండు క్రీ. శ **1564** సం॥ ఏప్రిలు మాసములో స్ట్రాటుపోర్డుగ్రామ మందు జనన మొందెను. ఇతడు ఏడవ యేట నాయూరిలో కృషీవలుల పుత్రుల కుచితంబుగ విద్య గఱపఁబడు శాలకుపంపఁ బడెను. ఇచ్చట నా కాలములో ముఖ్యముగ లాటినుభాష నేర్పఁబడు చుండెను. ఇంగ్లీషు విద్యార్థులు పాఠశాల యందు కూర్చొని నేర్చుగొను విద్య స్వల్పము. చిన్నతనమందు బడిలో అల్లరి చేయుటయు, చదువు కట్టిపెట్టి పాటి పోవుటయు మొదలగు చిన్నతనపు చేష్టలతో కాలము గడుపుట ప్రసిద్ధము. ఆటలయందును, పాటలయందును, పెద్దవాండ్రను చూచి యట్లు నడుచుకొనుటయందును లభించు ప్రపంచవ్యవహార సంబంధమగు విశాలవిద్యయే చిన్నపిల్లలకు లభించును. కావున కేవలము అధ్యాపకుడు బోధించు పుస్తుక సంబంధ మగు విద్య మనస్సునందు వారికి నాటుచుండదు. షేక్స్పియరును అదేవిధముగ విద్య నప్పుడు గఱచి యుండును. కాని సృష్టిచిత్రములయొక్క పరిశీలనాశక్తియు, ప్రాపంచిక అనుభవజ్ఞానమును చిన్నతనము నుండియు నతని మనసున ముద్రితంబై యుండ వచ్చును.

ఇతడు పాఠశాల నెప్పుడు వదలి పెట్టినదియు, యౌవనమందే వృత్తి నవలంబించినదియు స్పష్టముగ తెలియదు. తండ్రియొక్క కుటుంబ మెక్కువగుచు, రాబడి

తక్కువగుచు వచ్చినందువలన నితడు కేవలము ఉద్యోగములేక తిరుగ నియ్యఁబడి నటుల తోఁచదు. ఇతడు కొన్ని దినములు కటికవానికి సహాయకుడుగ నుండి నటులను, ప్లీడరు గుమస్తాగ నుండి నటులను, వైద్యుని వద్ద నౌకరుగ నుండి నటులను, పల్లెటూరి అధ్యాపకుడుగ నుండి నటులను, తండ్రికి సహాయ భూతుడుగ నుండి నటులను చెప్పఁబడు నను శ్రుతముగ వచ్చు కథ లెంత వరకు విశ్వాస నీయములో తెలియదు. ఇతడు, సామాన్యముగ జవ్వను లకు దురదృష్టము వలనలభించెడు సాహవాసమును చేసి, అభిజనుల కా కాలములో నుండుచు వచ్చిన యుద్యాన వనంబులలోని లేళ్లు మొదలైన వాని నపహరించు దుష్ప్రవర్తనమున మెలఁగి నటుల నొక చరిత్రకారుడు చెప్పుచున్నాడు. స్ట్రాట్ఫోర్డు దగ్గర సర్ తామస్‌లూసే యొక్క యుద్యానవనమందు లేళ్ల నపహరించి నందుకు ఆ అభిజనునిచే దోషారోపణ చేయఁబడి శిక్షింపఁబడెను. ఇత డందు కా యభిజనునిపై నాగ్రహము నొంది యతనిపై నొక ప్రహసన కావ్యమును వ్రాసెను. ఇందు వలన నతనిపై నింకను ఎక్కువ కఠిన చర్యల నా యభిజనుడు జరిపించెను. ఈ బాధ పడలేక అతడు తన కుటుంబమును విడిచి లండనుబోయి యొక్కడును నివసించెను.

ఇతడు చిన్నతనము నుండియు తన గ్రామమున కప్పుడప్పుడు వచ్చి ప్రదర్శించు వారి నాటకములను చూచు చుండెడివాడు. ఇతడు లండను వచ్చిన తరువాత నక్కడి నాటకులతో పరిచయము చేసికొని యందు తన యభిరుచిని చూపించుచు క్రమక్రమముగ తద్వ్యాపారమున నభివృద్ధికి వచ్చెను. 1585, 1592 సం॥ల మధ్య నితడు తన నాటక జీవితము నారంభించెను. 1592 సం॥ నకు నాటక రచనయందును పాత్రప్రదర్శనము నందును కొంత ప్రసిద్ధిని సంపాదించెను.

1593—1597 సం॥ ముల మధ్య సౌతాంప్టను ప్రభువు, లీసెస్టరు, డెర్బీ, చాంబర్లెయిన్ ప్రభువుల యొక్క పోషణక్రింద షేక్స్పియరు యొక్క నాటక కంపెనీ గణ్యతకెక్కిన తక్కిన కంపెనీల నెల్ల మించి యుండెను. 1592 సం॥ మునకు పూర్వము ఇతని కంపెనీ లండను పట్టణముయొక్క బాహ్యాంతర సీమ నీశాన్యమూల నున్న 'ది థియేటర్' అను నాటక శాల యందుండెను. 1592 సం॥ మున ఈ నాటక కంపెనీ థేమ్సు నదికి దక్షిణ తీరమున నున్న 'రోజు థియేటర్' అను శాలకు మార్చఁబడెను. 1599 సం॥ ములో ఆతావుననే 'దిగ్లోబు థియేటర్' అను చోటికని మార్చఁబడెను. సెలవు దినములలో ఎలిజెబెతు రాణియొక్క భవనములలో ననేక స్థలముల యందు వీరి నాటకములు ప్రదర్శింపఁ బడుచు వచ్చెను. 'ఇన్సుఆఫ్ కోర్టు' కూడనాకాలములో నాటకప్రదర్శనలవలన కాలక్షేపమును పొందుచుండెడిది,



ఇతడు రాజువేషములను అత్యుత్తమముగ కాకపోయినను ఎక్కువ సమర్థతతో నిర్వహించుచుండెడువాడు. ఏటులైనను, షేక్స్పియరు వేషములు వేయుట కంటె నాటకములను వ్రాయుటయందే యెక్కువఖ్యాతిని సంపాదించెను. సంవత్సరమునకు రెండు మూడు మంచి నాటకములను తయారుచేసి ఇతడు కంపెనీ కిచ్చుచుండెడివాడు. రాణి సముఖమున చాంబర్లెయిన్ సేవకులచే ప్రదర్శింపఁబడిన 28 నాటకములలో 20 నాటకములు షేక్స్పియరుచే వ్రాయబడినవే.

ఆకాలములలో మంచి వేషధారియొక్క రాబడి చాల యుండెడిది. ఆకాలము
లో నాటకుల పోషకులుగ నుండుట గొప్పతనముగ నెంచఁబడుట
1597–1611 వలన సౌతాంప్టను ప్రభువు మొదలైనవారిచే ధనసహాయము చేయఁబడుచు నీ కవి వేషధారి చాలభాగ్యవంతుడయ్యెను. ఇతడు 1596 సం॥ములో నిల్లువదలిపెట్టిన తరువాత ప్రథమపర్యాయము మరల నింటికేగెను. స్వగ్రామములో బీదస్థితిలోనున్న తనకుటుంబమును తనదగ్గరనున్న ధనముతో మంచిస్థితిలో ప్రవేశపెట్టెను. తండ్రియగు జాన్ షేక్స్పియరు, కొడుకు సంపాదించిన ధనముతో గొప్పవాడై సజ్జనులలో పరిగణింపఁబడుటకు దరఖాస్తు చేసికొనెను. 1597 సం॥ లో నీ కవి స్ట్రాట్ఫోర్డులోకెల్ల పెద్దగృహమగు న్యూప్లేసును కొనెను. స్ట్రాట్ఫోర్డులోను లండనులోకూడ నిప్పుడితడు ఆస్తికలవాడయ్యెను.

జేమ్సు I సింహాసనాసీనుడైన తరువాత, షేక్స్పియరుయొక్క కంపెనీని తన పోషణక్రిందకు తీసికొని 'రాజుయొక్క నాటకులు' అను పేరును వారిని ధరింపనిచ్చెను ఈక్రొత్త రాజుయొక్క పరిపాలన కాలములో సుమారు 10 సం॥ ల వరకు షేక్స్పియరు లండను నాటకరంగముతో సంబంధమును కలిగియుండెను. 1604 సం॥ము పిమ్మట ఇతడు అరుదుగ వేషములను వేయుచుండెడువాడు. కాని ఈకాలములో నతని గొప్పనాటకములు వ్రాయబడియుండెను. ఇతడు చాలధనాధికుడగుటచే స్ట్రాట్ఫోర్డులోతనయొక్క వ్యవహారముల నెక్కువగ చూచుకొన వలసిన వాడయ్యెను. ఇతని యొక్క తండ్రి 1601 సం॥ మున చనిపోయెను. 1607 లో వేషధారియై యితనితోకూడ లండనులోనున్న ఎడ్మండు షేక్స్పియరు పరలోక గతుండయ్యెను. ఆ సంవత్సరమే కుమార్తెయగు సుశానా, జాన్ హాలు అను నొక వైద్యుని పెండ్లియాడెను. 1608 లో తల్లి లోకాంతరగతురాలయ్యెను.

షేక్స్పియరుయొక్క జీవితముయొక్క కడపటిభాగము 1611 సం॥ నుండి నారంభమయ్యెను. ఆ సంవత్సరములో నితనికి గ్లోబు థియేటరులోనున్న భాగము

నితడమ్మివేసెను. అప్పుడే ఇతడు లండను పట్టణమును విడచిపెట్టి స్ట్రాట్ఫోర్డునకు
విశ్రాంతికై పోయెను. అప్పుడప్పుడు ఇతడు లండనువచ్చి తన
1611–1616 'పూర్వమిత్రులను చూచుచుండెడివాడు కాని నాటకరంగముతో
సంబంధమును పూర్తిగవిడచిపెట్టెను. 16[illegible]8 సం॥ములో నితడు
బ్లాక్‌ఫ్రయర్సు థియేటరువద్ద నొకగొప్ప భవనమునుకొనెను గాని యతడు తత్క్షణమే
దాని నద్దెకిచ్చివేసెను. తరువాత కొలది కాలమునకు గ్లోబు థియేటరు హెన్రీ VIII
నాటకము నాడుచుండగ నగ్ని దగ్ధమై పోయెను. కాని తిరుగ నది 1614 సం॥ లో
కట్టబడెను. షేక్స్పియరు మాత్ర మే సంబంధమును మరలపెట్టుకొనలేదు. 1613 సం॥
ము నుండి షేక్స్పియరు స్ట్రాట్ఫోర్డునే తన స్థిరనివాసమును చేసికొనెను. 1616సం॥
ఫిబ్రేవరిలో నితని రెండవ కుమార్తె ఆమె కంటె నాలుగేండ్లు చిన్న వయసు గల
వరుని పెండ్లియాడెను. ఆ సం॥ ము మార్చి నెలలో షేక్స్పియరు జబ్బుపడి తన మర
ణశాసనమును వ్రాసెను. అతని ఆస్తిలో చాల భాగము పెద్దకుమార్తె కియ్యబడెను.
భార్యయు, రెండవకుమార్తెయు, సోదరియు, ఆమె పిల్లలును, స్ట్రాట్ఫోర్డులోని
పేదవాండ్రును, అతని నాటకస్నేహితులును ఉచితరీతిని సత్కరింపబడిరి. ఏప్రిలు
23 వ తారీఖున నితడు స్వర్గస్థుడయ్యెను. ఇతడు పాతి పెట్టబడిన స్మశానమునకు
సంబంధించిన చర్చియొక్క గోడమీద నొకస్మారకచిహ్న మునుంచబడెను.
అందులో చాలభాగము కవి యొక్కయూర్ధ్వకాయము యొక్కరూపము. అతని
యొక్క రూపము యొక్కసరియైన ప్రదర్శనము మన కిప్పుడు లభించిన దదియే. 1670
సం॥ లో షేక్స్పియరు యొక్క కడపటి సంతానము చనిపోయెను.

---

## షేక్స్పియరు కాలమునకు పూర్వము ఇంగ్లీషు నాటకరీతి.

ఇంగ్లాండులో మొట్టమొదట బైబిలులో నుండి తీయబడిన మతసంబంధమైన
కథలు, ఇంకను భక్తులు మహాత్ములు మొదలైనవారిగూర్చి అనుశ్రుతముగ వచ్చిన కథలు,
మహాత్మ్యములను పేరున నాటకములు ప్రదర్శింపబడుచు వచ్చెను. ఇవి సామాన్యముగ
విద్యాగంధములేని జనులకు మతసంబంధమైన విషయములను బోధించుటకుగాను మతా
చార్యులచే ప్రదర్శింపబడుచువచ్చెను. క్రమక్రమముగ నిందు చూపింపబడు పౌరా
ణికపాత్రలు తొలగింపబడి స్వభావసిద్ధమైన పాత్రలు ప్రయోగింపబడుచుం మొరా
లిటీసు! అనగా 'నీతికథలు' నాటకములలో వాడుకకు వచ్చెను. ఇట్లు ఆమానుష
మైన పాత్రలును తత్సంబంధమైన సామగ్రులును నాటకరంగమునుండి లేచిపోయిన
తరువాత నాటకులకును విషయము విశాలమగుట వలన నెక్కువ రంజకముగ ప్రద
ర్శింప ననుకూల మయ్యెను. ప్రేక్షకులకును వానియందు ప్రేమయతిశయిల్లెను.



హెన్రీ VIII కాలములో నతని యాడంబరమునకును, ప్రమోదాసక్తికిని
ఇంకొక విధమైన నాటకరక్తి బయలు దేరవలసి వచ్చెను. ఆకాలములో జనులు
పనులులేక కాలక్షేపము చేయువారలై యుండుట వలన, సంతోషమున పుద్దుల
ప్రొద్దు పుచ్చుట కనేక యావశ్యకము లుండుచువచ్చెను. భోజనకాలమందును, భోజనా
నంతరమును కాలక్షేపమునకు ప్రహసనములు జరుగుచువచ్చెను. ఈప్రహసనములు
కేవలము 'నీతికథలు' కాకపోయినను, యేదియో యొక నీతిని కడపటను బోధించునవిగా
నుండుటవలన నివికూడ యీ నీతికథానాటకముల నుండియే యుద్భవించి యుండవ
చ్చును. ఇట్లుప్రహసనములనాడు నాటకులను రాజుగారు పోషించుచుండుటచే తక్కి
నసామంతులందఱును ప్రత్యేకముగ తమపోషణక్రింద నాటకబృందముల నుంచుకొను
చువచ్చిరి. ఇట్లు కేవలము నాటకవృత్తి నవలంబించిన తెగలవారు కొందఱు సంఘము
నందు ఏర్పడిరి.

హెన్రీ VIII రాజ్యమైన తరువాత ఎలిజబెతు రాణి కాలములో విద్యావ్యా
పక మెక్కువయయ్యెను. లాటిన్ నాటకములు విస్తారముగ చదువబడుచువచ్చెను. ప్రా
చీనకాలపు నాటకముల నాడుట విద్యాధిక్యతకు సూచనయయ్యెను. అట్లు మొదట
లాటిను నాటకములును, తరువాత వాని భాషాంతరీకరణములును ప్రదర్శింపబడుట
ఆరంభమయ్యెను. గ్రీకు నాటకులయొక్క నియములు ఇంగ్లీషు నాటకులకు నిర్బంధము
లయ్యెను. సర్వకళాశాలలయందును విద్యాలయములందును ప్రాచీన గ్రీకురోమను
నాటకపద్ధతిని రచింపబడు నాటకములు ప్రబలంబయ్యె. ఇట్లు ఈ మూడునాటక
శయ్యలును షేక్స్పియరు నాటకములు బయలుదేరునప్పటికి నాటకరంగమున తమ
యొక్క లక్షణములను ప్రతిపాదించుచుండెను.

---

## షేక్స్పియరు కాలములో నాటకాలయముయొక్కస్థితి.

షేక్స్పియరుయొక్క నాటకము లిప్పుడు ప్రపంచమునం దనేకులచే, ప్రదర్శన
మున చూడబడక పోయినను, చదువబడుచున్నవి. ఈ నాటకములు కేవలము ప్రదర్శ
నమున కనుకూలముగ నుండునటుల వ్రాయబడినవి. కావున నాకాలముయొక్క నాట
కాలయముయొక్క స్థితిచదువరులకు కొంత తెలిసి యుండుట అగత్యము.

షేక్స్పియరు యొక్క జన్మకాలము నాటికి బహుశః నాటకాలయంబు
లెచ్చటను నిర్మింపబడి యుండలేదు. నాటకము లప్పటికింకను ప్రజారంజకమై
నటులగానిపించవు. ఎలిజబెతు రాణి సింహాసనారూఢయగు నప్పటికి, ఆమెయొక్క
అధికారమును ధిక్కారముచేయుటకు ప్రోత్సాహపెట్టబడు రాజద్రోహపు నాటకము

లాడబడకుండుటకు నాటకప్రదర్శనము లాపివేయుటకుకూడ మంత్రిసభవా రాలోచించిరి. దేశము శాంతమైన పిదప కూడ ఈ నాటకవృత్తివారు లైసెన్సు లేనిదే యాడకూడ దని అప్పు డప్పుడు చట్టములచే నిరోధింపబడు చుండెడివారు. కొందఱు అభిజనులు మాత్రము, తమయొక్క స్వంత నాటకపు కంపెనీలను లైసెన్సులను పుచ్చుకొని యాడించు కొను చుండెడివారు. ఎలిజబెత్తు యొక్క సంతోషకాలక్షేపాసక్తియు నీ నాటకప్రదర్శన మునకు హెచ్చరిక కలుగ చేయుచుండెను. ఆమెయొక్కసభికులు అమెకు సంతోషకాలక్షేపమునకు కలుగఁజేయ ఒకరితో నొకరు పోటీగా నొండొరుల మించఁ జూచు చుండిరి. ఇందువలన సంఘమునందును ఈ అభిలాష యెక్కువగుచు వచ్చెను. ఇంగ్లీషు సంఘములో నెన్నడును వివిధ తరగతుల వారు నంత కలసి మెలసి యుండలేదు. ఆ కాలములో ఇంగ్లీషు జనులు విశేషముగ గృహములకు వెలుపల కాలక్షేపము చేయుచుండిరి. ఈకాలమువలె గృహాంతరవర్తిత్వము అప్పటి జనుల లక్షణముకాదు. లండనియరులు ఆహారగృహముల యందును ఉపహారగృహముల యందును తమ భోజనాహారపానీయములను తీసికొను చుండెడివారు. అభిజనులయొక్క గృహము లందఱకు నాతిథ్యమొసంగుటకు తెరచి యుంచఁ బడెడివి. అభిజనులు చాలమంది యనుచరులను కలిగి యుండెడివారు. వారియొక్క కలహములందువారందఱును కార్యభారము వహించు చుండెడివారు. ఏదైన విచిత్రమైన వర్తమానమును తెచ్చినవాడును, హాస్యప్రసంగములచే నవ్వింప సామర్థ్యము కలవాడును, ఎవ్వడైన ప్రతిచోటను ఆతిథ్యమియ్యఁబడెడివాడు. ఎలిజబెతురాణి కాలములో ఇంగ్లీషువారి సాహసకృత్యము లనేకములు చేయఁబడినను, ఆ కాలములో సోమరులుగ నుండి అజస్రమును సుద్దులప్రొద్దులు పుచ్చుచుండెడివారును, విశ్రాంతికలవారును ఎటులైన కాలక్షేపము చేయవేడుకల పై నాసక్తికలవారును, ఉండినంది మందిలండనులోనే కాలముననులేరు. కావున నాయుగమునందలి ఆచ్చటి సాంఘికస్థితి అనేకవిధముల నాటక ప్రేక్షణాపేక్ష కనుకూలముగ నుండెను. అందుచేత నాటకకంపెనీలవారు, తమ ప్రభుపోషకులపై నాధారపడి యుండుటకంటె జనసామాన్యముపై నాధారపడియుండుట యెక్కువ లాభకరముగ నుండి నటుల కనిపెట్టిరి. అట్లువారు ప్రజల దిక్కున కభిముఖులై బహిరంగ ప్రదర్శనముల నియ్యఁ దొడంగిరి. అయినను వారు లండనునగర పరిపాలన సంఘమునుండి మాత్రము కొన్నియాటంకముల ననుభవించిరి.

1568 సం॥ లో ప్లేగుపుట్టి లండనులో 20, 000 మంది జనము వరకు నాశనముచేసెను. ఇందువలన పరిపాలన సంఘమువారు, అంటువ్యాధి వ్యాపించుటకు నాటకము లొక కారణమని వాని నాపించివేసిరి. మునిసిపల్ పరిపాలన సంఘము, సంఘసంస్కారలక్షణములు కలిగి యుండుటవలన, వారి నాటకములు భోజన గృహములకును, మద్యగృహములకును అంటియున్న స్థలములం దాడఁబడుటవలన దొంగతనమునకును, దుర్నయములకును దారిచూపునని యయిష్టముగ నుండుచు వచ్చిరి. నాటకములకు వ్యర్థముగ ధనము దుర్వ్యయము చేయఁబడు చున్నదనికూడ, వారి మితవ్యయబుద్ధికి అసహ్యముగ నుండెను. తమ దగ్గరనున్న నౌకరుల కీయాకర్షణ పనిపాటలయందు నిర్లక్ష్యము కలుగుచున్నదని కూడ వారు తలంచిరి. ఈ నాటకులయొక్క నగరసంకీర్తన రాధారీకి భంగము కలుగుటకూడ వారు చూచిరి. ఇంతకుపైన ప్లేగుకూడ జనించినందు వలన నాటకములను సాధ్యమైనంత వరకు కట్టించివేయ వారు ప్రయత్నించిరి. ఇన్ని ఇబ్బందుల మధ్య నాటకదర్శనాపేక్ష జనులలో వృద్ధియే యయ్యెను. లండను మ్యూనిసిపల్ సంఘమునకు వ్యతిరేకముగ, దర్బారువారును, ప్రివీకౌన్సిలు వారును ప్రోత్సాహము చేసిరి. షేక్స్పియరు చదువు మానివేయునప్పటికి లండనులో 12 స్థలము లందు నాటక కంపెనీలు నిరంతరమును ఆడుచుండెను. భోజనగలహములకు సంబంధించిన దొడ్లలో సాధారణముగ నాటకశాలలు స్థిరముగగాని, తాత్కాలికముగగాని కట్టియుంచఁబడుచుండెను. ఈ యుద్యమమును కొంత యదుపులో నుంచుటకు 1571 సం॥ లో పార్లమెంటు, వేషధారులు, యభిజనుల లైసెన్సు లేకయుండిన యెడల, దొంగలుగను, ద్రిమ్మరులుగను ఎంచఁబడవలయునని చట్టమును చేసిరి. 1572 సం॥ లో థియేటరు అనుమాట ప్రస్తుత అర్థములో నుపయోగింపఁబడెను. 1575 సం॥ లో మ్యూనిసిపల్ సంఘముతో నొక రాజీ జరిగి వారమునకు 50 మరణములకు తక్కు యున్నపుడు, లైసెన్సు పుచ్చుకొని, సగములాభము పేదలకు దానధర్మముచేయు పద్ధతిని నాటకులు నాటకమాడుటకు సెలవు పుచ్చుకొనిరి. పట్టణమధ్య నాడుటకు మ్యూనిసిపల్ వారు చేసిన నిర్బంధములవలన 1576 సం॥ లో మ్యూనిసిపల్ హద్దులకు వెలుపల పొలములలో రెండు థియేటరులు నిర్మింపఁబడెను. పట్టణమునకు ఈశాన్య దిక్కున నిర్మింపఁబడిన ఈ రెండు శాలలును 'ది థియేటరు' అని యొకటియు, దికర్టెను, అని యొకటియు పిలువబడెను. ఇంకను ప్రతిబంధకములు వచ్చుచునేయుండెను. 1579 సం॥ ములో నాటకరంగముయొక్క దుర్బోధనుగూర్చి పెద్ద పత్రికాయుద్ధము జరిగెను. మ్యూనిసిపల్ సంఘమువారు చాల యాటంకములను కలుగ చేయుచుండిరి. ప్రివీకౌన్సిలు వారును అప్పుడప్పుడు కఠినచర్యల నుపయోగించవలసి వచ్చెను. పైచెప్పిన రెండు కంపెనీలవారును, రాణిగారిని సంతోషపెట్టుటకు తాము పరిశ్రమ చేయవలసియున్నదను కారణమున స్వాతంత్రమును సంపాదించుకొనిరి. షేక్స్పియరు ఇతర కంకెనీలు కొన్నిటితో

సంబంధమును కలిగి యున్నను ముఖ్యముగా 'దిథియేటరు' అను దానితో సంబంధము కలిగి యుండెను. దీనికి లీస్టరు ప్రభువు దగ్గర నుండి యొకరి తరువాత నొకరుగ, మొదటి జేమ్సురాజువరకును పోషకులుగ నుండిరి. ఈ కంపెనీయొక్క ఖ్యాతి తక్కిన యన్నటికంటెను ఎక్కువగ నుండెను. షేక్స్పియరు కాక, రిచర్డు బర్బేజి యను నొక గొప్ప విషాద వేషధారియు నందుండెను. బర్బేజి యొక్క తండ్రియే "ది థియేటరు' శాలను కట్టించెను. 1598 సం॥ లో బర్బేజి దానినూడ పెరికి, యాసామానులతో థేమ్సు నదికి దక్షిణతీరమున ప్రసిద్ధి కెక్కిన గ్లోబుథియేటరును కట్టించెను. లండను పట్టణము దక్షిణమున థేమ్సు నదియొక్క హద్దు కలది గనుక నది మ్యూనిసిపల్ హద్దులకు వెలుపల నుండెను. కాని యప్పుడు పడవలే యొక చోట నుండియొక చోటకు పోవుటకు యానములు కావున పడవ మీదనే యందఱును నాటకముల నక్కడకు చూడఁ బోయెడివారు. అదివరకే 1592 సం॥ ములోను, 1596 సం॥ లోను, వరుసగ 'రోజు' అనియు, 'స్వాను' అనియు రెండు శాల లచ్చట కట్టఁబడి లాభమును పొందు చుండెను. దీనిని చూచి యే బర్బేజి గ్లోబు థియేటరు నచ్చట కట్టించెను. ఇంకను 'కర్టెను' యు, 'ఫార్చూను' కూడ నచ్చటికే వచ్చి ప్రవేశించెను. భోజన గృహము యొక్క దొడ్డి యాకారముగ నది చుట్టు కట్టఁబడెను. గ్యాలరీలు మూడంతస్థులుగ నొకదానిపైన నొకటిగ కట్టంబడను. ఈ గ్యాలరీలు గడ్డి కప్పులను కలిగి యుండెను. తక్కినగృహమంతయు కప్పులేకుండ నుంచఁబడెను. నేల భాగమున నొక ప్రక్కను, కొయ్యలపై నెత్తుగ నాటక రంగ మమర్పఁబడి యుండెను. దాని వెనుక వేషధారుల యొక్క గది యుండెను. అంతయు కఱ్ఱతోడను మట్టి తోడను కట్టఁబడి యుండెను. ఇందు వలననే 1613 సం॥ లో అది అగ్నిదగ్ధమై పోయెను. వెలుపలకు సుమారుగ 50 అడుగుల చతురమును ఉండవచ్చును. గ్లోబు థియేటరు యొక్క జెండామీది చిత్రము భూగోళమును అట్లాసు అనుపౌరాణిక మనుష్యుడు మోయుచున్నటుల లిఖింపఁబడెను.

---

## నాటకసామానులు.

కొందఱు, ఎలిజెబెతు రాణి కాలములో నాటకసామానులేమియు లేవని చెప్పుదురు. సీను జరుగుచున్న స్థలమునుగూర్చి తెలిసికొనుటకు ఒక బల్లమీద నా స్థలమును వ్రాసి ప్రేక్షకులకు చూపింతురు. కాని రాణియొక్క నాటకాధికారి కొన్ని దుస్తులను, కరాళములను, ఇంక నితరసామానులను ఉంచి విద్యార్థులకును, ఇతరులకును అద్దెకిచ్చు చుండెడివాడు. ఈ సామానులనే చివరకు వెలయిచ్చి



బర్బేజికొనెను. షేక్స్పియరుకు సంబంధించిన కడపటి కాలములో సీనుల సామానులలో విస్తారముగ నుపయోగించి నటుల తెలియవచ్చుచున్నది. నాటక రంగమునకు వెనుక వైపున యెత్తుగ చిన్న ద్వారములుండెడివి. అచ్చటినుండి గృహోపరి భాగమునం దున్నటులగాని, కోటగోడలమీద నున్నటులగాని ప్రదర్శించుట కనుకూలముగ నుండెడిది. విషాద మేదైన ప్రదర్శింపఁబడినపుడు నాటకరంగము నల్ల గుడ్డలతో కప్పఁబడెడిది.

---

## ప్రదర్శనము.

ప్రదర్శన మేదైన జరగునపుడు పట్టణములో ముందు నోటీసులు పంచిపెట్టఁబడెడివి. అది జరుగుచున్న కాలములో జెండాయొక్కటి శాలకుపైన కట్టఁబడును. బ్యాండుమూడుసారులు మ్రోగింపఁబడిన తోడనే పదర్శనము ప్రారంభమగును. అప్పుడు ప్రస్తావ నేమైననున్న యెడల చెప్పఁబడును. సూత్రధారుడు నల్ల అత్తరుషు దుస్తులు ధరించుట యొక నియమము. స్త్రీ వేషములు పిల్లవాండ్రచే వేయఁబడుచు వచ్చెను. రెస్టోరేషన్ తరువాత వరకు నాటకరంగమున స్త్రీలు వేషములను వేయనియ్యఁబడలేదు. అంకములమధ్య బ్యాండువాయింపబడుచుండెను. హాస్యగాడు హాస్యముల చేయుచుండును. ప్రేక్షకులు, ఫలహారములు చేయుటయందు కాని, పేకాడుటయందుకాని, చుట్టకాల్చుటయందుకాని వ్యవస్థులైయుందురు.

షేక్స్పియరు మొట్టమొదట లండను వచ్చునప్పటికి, అంకముల మధ్య హాస్యగాడు నాటక రంగమున నిలిచి ప్రేక్షకులతోగాని, స్వగతంబునఁగాని చమత్కార సంభాషణలవలన హాస్యములు చేయుచుండుట ఆచారముగ నుండెను. కాని నాటకోద్యమ మభివృద్ధియైన కొలదిని యాయసభ్యలక్షణము రూపుమాసెను. నాటకానంతరము వేషధారులలో నొక డుపప్రస్తావనను పఠించుటయు వాడుక కలదు. చివరకు నాటకు లందఱును కలిసి రాజునకు నాని, కంపెనీ యొక్క పోషకునకుగాని మంగళవాక్యములను పాడుచుండెడి వారు.'

ప్రదర్శనములు, మొదటిలో, ఆదివారము నాడే యొసంగఁబడనియ్యఁబడు చుండెను. అదియు సాయంకాల ప్రార్థనైన తరువాతనే యియ్యఁబడ నిచ్చుచుండెడి వారు. కాని తరువాత మొదటి నిర్బంధము తీసివేయఁబడెను. ఆదివార నాటకములు ప్యూరిటనులకు అసహ్యముగ నుండెడివి. వారు వానిని 'సైతాను కైంకర్యముల'ని పిలుచుచుండెడి వారు. శుక్రవార శనివార ప్రదర్శనములనుకూడ నిరోధించుటకు చేయఁ

బడిన చట్టముల యొక్క ప్రయత్నములు విఫలము లయ్యెను. అటుపిమ్మట ప్రదర్శనములు గినదినము జరుగు చుండినను, చర్చిలలో ఆరాధన పిమ్మటనే ప్రారంభింపబడుచు వచ్చెను. సాయంకాలము మూడుగంటలవేళ ప్రారంభకాలము మామూలయ్యెను. పబ్లికు నాటకకాగారములలో దీపము లుంచనియ్యఁబడెడివి గావు. ప్రైవేటు నాటకాగారములలో సహితము ప్రదర్శనము సామాన్యముగ మూఁడుగంటలు మొదలు అయిదారుగంటల వరకు ఆడబడుచుండెను. చీకటి పడక పూర్వమే జనులందఱు నిండ్లకు పోఁగోరెడివారు. ఈరెండవ నాటక రంగములలో ఒక్కొకప్పుడు రాత్రి పడిన తరువాత కూడ నాటకములాడఁ బడుచుండెను. అప్పుడు కొవ్వొత్తుల దీపములును, నూనె దీపములును పెట్టఁబడుచుండెను.

---

## ప్రేక్షకులు.

ప్రేక్షకులలో నన్ని తరగతుల వారు నుండెడివారు. నాగరికయౌవనులు, రంగస్థలమున నాసనము లియ్యఁబడెడివారు. వారప్పుట తమ వేషముల ఠీవియు, తమనడల సొగసును లోకమున కెల్ల వెల్లడి చేయుచుండెడువారు. కులసతులు మేలిముసుంగుల ముఖముల కప్పుకొని వచ్చెడివారు. పట్టణము నందలి పెద్దమనుష్యులు తమయిల్లాండ్రతో వచ్చుచుండెడివారు. నౌకరులు తమయజమానులను సంతోషపెట్టుటకు తఱచుగ నాటకములకు వచ్చుచుండెవారు. నాటక దర్శనకుతూహలము వేలంవెఱ్ఱిగ నెక్కువై యుండెను. అప్పుడు లండను యొక్క జనసంఖ్యసుమారొక్క లక్షయుండెను. అయినను మొదటి జేమ్సురాజ్యకాలములో, నిప్పుడు 40 లక్షల జనసంఖ్యకున్నియుండెనో అప్పుడన్ని నాటకాగారము లుండెను. ఎలిజబెత్తురాణి యొక్క రాజ్యకాలములో నాటకములు దర్శించుటకు రేట్లు ఒకఅణా మొదలు, 11 అణాల వరకు నుండెను. తరువాత నింకను ఉత్తమ తఱగతి రేటు ఎక్కువయ్యెను. పట్టణములోని సాధారణముగ గౌరవనీయమైన తరగతి వారికి ఆరు అణాల రేటు యోగ్యమైనదిగ నెంచఁ బడుచుండెను. రెండు అణాలు గ్యాలరీ యొక్క రేటు. నేలమీద ఒకఅణా. క్రింద కూర్చుని సామాన్యజన మంతయు రంగస్థలము మీదికి గుంపుగ త్రోసికొనుచు కూర్చొనెడివారు. ఒక నాడు వారికి వసూలు, ముఖ్యముగ క్రొత్త నాటక మాడి నపుడు, 150 లేక 180 రూపాయలు వచ్చుచుండెను క్రొత్త నాటక మాడి నపుడు రెట్టింపు రేట్లు వెయ్యబడు చుండెను.

---



## నాటకులు.

ఆదిని, నాటకులు సాధారణముగ నెవరో గొప్ప యభిజనుని నౌకరులుగ నుండి వానిచే జీతము లియ్యఁ బడు చుండెడి వారు. నాటకము లాడుట యొక వృత్తిగా చేసికొనుట మొదట హీనముగ నెంచఁ బడు చుండెను. కాని యది క్రమక్రమముగ ప్రజారంజకమైన కొలదిని పోషకుని యొక్క యౌదార్యము కంటె ప్రజలఁ దని యుంచుట యే లాభకరముగ కనుబడి యనేకులు స్వంతముగ నాటకాగారములను ప్రజలపై నాధారపడి కట్టి యుండిరి. ప్రతిదినమును నాటకమునకు సాధారణముగ ముప్పదిలేక నలుబది రూపాయలు వచ్చు చుండెను. క్రొత్త నాటకమునకు 100 రూపాయలు వచ్చుచుండెను. ప్రైవేటు నాటకకంపెనీల వారికి ఇంతకు రెట్టింపు కూడ వచ్చు చుండెను. వేషధారులకు జీతము లెటు లియ్యఁ బడు చుండెడివో స్పష్టముగ తెలియదు కాని, సాధారణముగ భాగములు, అర్థ భాగములు, పావు భాగములుగ నిర్ణయింప బడు చుండి నటుల తెలియ వచ్చు చున్నది.

అప్పు డప్పుడు ఈ నాటకకంపెనీలు యాత్రలు చేయుచుండెను. 1601 సం॥ములో షేక్స్పియరుయొక్క నాటకకంపెనీ ఎస్సెక్సు యొక్క తిరుగఁబాటునకు వాక్సహాయము చేసినందున, దర్బారుయొక్క క్రిస్మసు వేడుకలకు రానియ్య బడక పోయినందున, అతని కంపెనీ ఉత్తరమున స్కాట్లాండులో అబర్డీను వరకును యాత్ర చేసెను. ఒకానొకప్పుడు ఇంగ్లీషు నాటక సంఘములు యూరపుఖండమునకు కూడ పోవుచుండెడివి. షేక్స్పియరు నాటక కంపెనీలో చేరక పూర్వము ఆ కంపెనీవారు డెన్మార్కులో ఎల్సినోరు వద్ద నాడినటుల తెలియవచ్చుచున్నది.

ప్రథమమునుండియు నాటకముల నదుపులోనుంచుటకు కఠినమైన విమర్శ గవర్నమెంటువారిచే జరిగింపఁబడుచువచ్చెను. ఈ యుద్యోగిని 'మేస్టరు ఆఫ్ ది రెవెల్సు' అనగా 'ప్రమదకృత్యంబుల కధికారి' అని పేరు. 1581 సం॥ లో ఇతనితో పాటు ఇంకొక మతాచార్యుఁడు కూడ జతచేయఁబడెను. నీతికిని, మతమునకును విరుద్ధముగ నాటకులేమియు బోధింపకుండ కట్టుబాట్లు చేయుటకే యీయుద్యోగస్థులు నియమింపఁబడిరి. నాటకరంగమున నీచాభాష్యమగు భాషలును, జనదూషణ వాక్యములును ఒకప్పుడు హెచ్చుగా నాటకుల దుర్వినియోగంబులను ఆపివేయుటకు 1608 సం॥ ములో నొకశాసనము చేయఁబడెను. ఆ కాలపు నాటకములలో తమ నెక్కువగ దూషించుచున్నవారని ప్యూరిటనులు (నీతియెడల నెక్కువాసక్తిగలవారు) మొఱపెట్టు చుండెడివారు. షేక్స్పియరు యొక్క నాటకములు మాత్రము అట్టివిధమైనవి కావు. ప్యూరి

టనులయొక్క ప్రాబల్యము చేతనే ఎలిజెబెతు కాలములో మ్యునిసిపల్ సంఘము వారు నాటకప్రచారమును చాలతగ్గించుటకు ప్రయత్నించిరి.

---

## నాటకైక్యములు.

నాటకైక్యములని పిలువంబడునవి మూడు; కాలైక్యము, స్థానైక్యము, కథైక్యము. ఈమూడు ఐక్యములను, గ్రీకుతత్వశాస్త్రవేత యగు అరిస్టాటిలు యొక్క ప్రోక్తములని ప్రజలచే సాధారణముగఁ దలపఁబడుచున్నవి. కాని యా మహాత్ముఁడు తన కావ్యశాస్త్రంబునందు స్థానైక్యమును గూర్చి వచింపనేలేదు. నాటకరచనయం దీనియములు రూఢములుగ తరువాత పరాసునాటక గ్రంథకర్తలచేఁ జేయంబడినవి

## కథైక్యము.

కథైక్యము యొక్క నియమము వలన ప్రధానకథను ప్రోదిచేయఁ జాలని యుపకథ లెంత మనోహరములైనను, అద్భుతంబులైనను తెచ్చి యతుకు పెట్టవలను పడదు. ఉపనదులనేకములు వచ్చి యొక్క ప్రధానవది సెట్లుచేరి వృద్ధిచేయునో, ఉపశాఖలనేకములు యొక్క వృక్షమూలంబునకు కలసి యనురూపంబుగ నుండునో, అవయములన్నియు దేహంబునకు అంటియుండి సౌష్టవాది లక్షణంబు లెట్లు కల్పించుచుండునో, యటులనే యుపాఖ్యానము లన్నియు నొక్క ప్రధానాఖ్యానమునకు అనురూపంబుగ చేరి కథకెల్ల నొక్క యేకత్వము నొసంగి దానిని బలపఱచ వలయును. ఇట్టి లక్షణము నాటకమున కున్నపుడే యది చతురకావ్యంబగును. నాటకమునకే లక్షణము తప్పకయుండవలెను.

## స్థానైక్యము.

స్థానైక్యముయొక్క నియమము, నాటకముయొక్క రంగము మార్పఁబడకుండ నొక్కటిగనే యుండుటకు, నిర్బంధించును. అనేక గ్రీకు విషాద నాటకములందు రంగము మారదు. కొన్నిటియందు మారుటయును కలదు. షేక్స్పియరీ నియమము నెచ్చటను పాటించలేదు. పులిందాసుశీల మందు మొదటి రంగము వినీసునందు ఉంచఁబడెను. రెండవ అంక మందు మనము సైప్రసు నందు రంగమును చూచుచుంటిమి. అట్లు రంగముల మార్పు షేక్స్పియరు నందు తరచుగ కలదు



కథైక్యమున కనుకూలమైనంత వఱకే స్థానైక్యమును, కాలైక్యమును పాటించవలసినది కాని అంతకంటె కఠినముగ పాటించఁగూడ దని నాటక గ్రంథకర్తలందఱును సమ్మతించుచున్నారు. కాళిదాసాది కవులెవ్వరును ఈ రెండు నియమము లెచ్చటను పాటించి యుండలేదు.

## కాలైక్యము.

ఈ నియమము కఠినమైన యర్థములో సహజముగ నాటకము రంగస్థల మందు ఆడుట కెంతకాలము పట్టునో యంతయే జీవితమందును పట్టియుండునదిగా నుండవలెనని యైయున్నది. కాని యీనియమమును పాటించినయెడల కథయొక్క యభివృద్ధికి భంగమగును. కావున నిది గొప్పగ్రంథకర్తలెవ్వరును పాటించియుండలేదు. అయితే కాలయవధివిస్తారమైనయెడ నాటకమునకు సారస్యము చెడును. కావున రెండుమూడు నియమంబులు ముఖ్యములుగావు. అవి కఠినముగ పాటింపఁబడిన నాటకముకూడ చెడిపోవును. కథైక్యముయొక్క నియమముమాత్రము ఎల్లప్పుడును ముఖ్యము. ఈ నియమమును పాటింపక, పాత్రలకు వానివానికి యర్హంబైన ప్రాముఖ్యతనియ్యక చేయంబడిన నాటకము గొప్పకావ్యముగ నెంచఁబడదు. మనకాళిదాసాది సంస్కృత కవులందఱు నీ నియమంబును తప్పక గౌరవించుచుండిరి. నవీన ఆంధ్రకవులు కొందఱీ నియమంబును పాటింపక తమ నాటకముల నంగవైకల్యంబుగ రచించుచుండిరి. కొంచెము విమర్శగ పరిశీలించిన యెడల నీలోపంబు స్పష్టంబుగ కనుపడును. షేక్స్పియరు యొక్క యీనాటక మీ నియమమును పూర్ణముగ తృప్తిపరచును. ఆదిమధ్యాంతంబులు కలిగినదే పరిపూర్ణమగు నొక్కటి యగునని అరిస్టాటిలు చెప్పుచున్నాడు. ఈ పులిందాసుశీల' మను పేరున పిలువంబడు 'ఒథెల్లో' యొక్క ప్రథమాకమందు పాత్రల యొక్క గుణములన్నియు చతురతతో వ్యక్తీకరింపఁబడి, పులిందాసుశీలుల యొక్క వివాహసందర్భము లన్నియు నందలి యుపద్రవములయొక్క యశుభసూచకం బెల్ల తెలుపంబడెను. నాటకముయొక్క మధ్యభాగమగు రెండుమూడు నాలుగంకములందు ఉగ్రునియొక్క దుష్టబుద్ధి ప్రభావంబున, ఉపద్రవకారణంబులు భయంకర మహాజ్వాల లోనికి ప్రజ్వలింపబడ, పులిందునికిని భార్యకునుంగల దాంపత్యానురాగంబు, అసూయాగ్రహంబులోనికి మారెను. తరువాత పంచమాంకమందు, వెనుక జరిగిన చర్యలకెల్ల నపరిత్యాజ్యనీయ ఫలితంబుగా విషాదయోగంబు సంప్రాప్తంబయ్యె.

---

## విషాదములు, ప్రమోదములు.

నాటకములు రెండు విధములుగ పరిగణింపఁబడు చున్నవి; విషాదములు ప్రమోదములు. నాట కారంభమున సంతోషముగ ప్రారంభమై క్రమక్రమముగ యుపద్రవములు వృద్ధియై కడపట గొప్ప విషాదముతో నంతమొందెడివి విషాదములు. మొదట ప్రధాన పాత్రల కనేకయిక్కట్టులు కలుగుచు వచ్చి క్రమక్రమముగ మంచు విరిసి పోయి నట్టు లన్ని బాధలు నంతమై సంతోషమున నంతమయ్యెడివి ప్రమోదములు. సాధారణముగ మృదు హృదయము కల యెల్లవారలకును విషాదము చూడ బాధ కలుగక మానదు. అందువలననే, నాటకమునకు సంతోషముగ ప్రొద్దు పుత్తమని వచ్చు వారికి విషాదప్రదర్శనము చూపి వారి మనస్సును బాధించుట యుక్తము కాదని నాటకులును తలంతురు. అందు వలననే, మనదేశమునందు విషాద నాటకములు లేనేలేవు. ఏదైన విషాదము సంభవించినను కవి యొద్దియో యొకవిధమున దేవతలనైన భూమి మీదకురప్పించి యందలి బాధ నుపశాంత పరచునట్లు చేయు పద్ధతి కవుల వలనఁ గల్పింపఁ బడు చున్నది. ఈ విధముగనే ఇంగ్లీషు వారి నాటకము లందును కొన్ని విషాదములను ప్రమోదములుగ కడపట మార్చు వాడుక యుండెను. కాని రాను రానువిషాదములను విషాదములుగనే యుంచిన నెక్కువ రక్తిగ నుండు ననియు, అటుల నుండిననే స్వాభావికముగ నుండు ననియు నభిప్రాయము ప్రబలినది.

ఎట్టి విషాదనాటకము లైనను, అవి కేవలము నాటకములే యైనందున నవి యంత మనస్సునకు బాధ కలుగ చేయవు కావున నందలి సారస్యమును చక్కఁగ నానందింపవచ్చును.

---

## విజ్ఞాపన.

షేక్స్పియరు యొక్క యత్యుత్తమ నాటకమనం బరగు నీ ఒథెల్లో నాటకము మన హిందూదేశ నాటక రంగమునకు చాల యనుకూలముగ నుండు నని తలంచి నే నాంధ్రీకరించితిని. సాధ్యమైనంత వఱకు షేక్స్పియరు యొక్క యభిప్రాయమేమియు చెడకుండ ప్రదర్శనమున కనుకూలముగు నటుల వ్రాసితిని. అర్థగుంభన కొరకు కొన్ని కొన్ని చోటుల నిందు ఛందో విషయము లందు స్వల్పముగు మార్పులను చేసియున్నాను. అందుకును, మరి యితర ప్రమాద దోషములకును, లోపములకును, విద్యాధికులను మన్నింప వేడుచు నీ నాటకము ఆంధ్రదేశమందు షేక్స్పియరు యెడల నుండఁ దగిన గౌరవముచే నా దరింపఁ బడునని నమ్ముచున్నాను.

ఇట్లు,
సుజనవిధేయుఁడు,
సి-శ్రీనివాసరావు,

ఈగ్రంథము వలయువారు ఈక్రింద వారికి వ్రాసికొనవచ్చును.

వి. రామస్వామి శాస్త్రులు అండు సన్సు.
192, ఎస్ప్లనేడు మద్రాసు,
లేక
గ్రంథకర్త, గాజుపేట, మచిలీపట్టణము.
కృష్ణాజిల్లా.

## నాటకము లోని పాత్రలు.

వినీసు రాజ్యే.

వీరబాహుఁడు.—సభ్యుఁడు, సుశీల తండ్రి (బ్రబాన్షియో)

ఇతరసభ్యులు.

వీరసేనుఁడు:—వీరబాహుని సోదరుఁడు.

రఘుపతి.—వీరబాహుని బంధువుఁడు.

పుళిందుఁడు.—వినీసు రాష్ట్రీయ సేనానియగు మూరు వంశజుడు (ఓథెల్లో.)

కృష్ణుడు.—పుళిందుని యువసేనాని.

ఉగ్రుఁడు.—పుళిందుని యనుచరుఁడు (అయాగో.)

రుధిరుఁడు.—వినీసు పురవాసుఁడు.

మదనుఁడు.—సైప్రసు గవర్నమెంటునకు పుళిందునికి పూర్వమున నున్న యధికారి.

విదూషకుడు.—పుళిందుని సేవకుఁడు.

సుశీల.—వీరబాహుని పుత్రిక. పుళిందునిభార్య (డెసిడిమోనా)

కమల.—సుశీల చెలికత్తె, ఉగ్రుని భార్య.

సీమంతిని.—కృష్ణుని యుంపుడు కత్తె.

నా వికులు, చారులు, దండోరావాఁడు,

ఉద్యోగస్థులు, పెద్దమనుష్యులు, గాయకులు, సేవకులు.

# పుళిందా సుశీలము.

## ప్రథమాంకము.

### రంగము I. వినీసు. ఒకవీధి.

[రుధిరుఁడు, ఉగ్రుఁడు ప్రవేశించుచున్నారు ]

రుధిరు.— చాలు, చాలు, ఇఁక నాకు చెప్పకు; ఓ ఉగ్రా, నాసంచుల మూతియురుల నీ వశమునందుంచుకొని ఈరహస్యమును దెలిసియుండి నాదగ్గర దాచియుంచితివి గదా !

ఉగ్రు.— ఛీ, ఛీ, మూర్ఖా! నీవెంత చెప్పినను వినవు:—నే కలనైన నా కథ నెఱిఁగి యున్న నన్నధముగా నెంచుము.

రుధిరు.— వాఁడు నీకు పరమ విరోధియని నీవు పలుమా రుగ్గడించి యుండలేదా?

ఉగ్రు.— ఇప్పుడు మాత్రము వాఁడు నా బలవద్విరోధికాఁడా? కానిచో నీ నిందకు నే పాత్రుఁడ నగుదును. మన పట్టణంబున ముువ్వురు పెద్ద మనుష్యులు సవినయంబుగ వానికి స్వాగతం బిచ్చి నన్ను తనయువసేనానిగాఁ గైకొమ్మని పలుతెఱంగులఁ బ్రార్థించిరి దైవమానవులు సాక్షి! నా విలువ నాకు తెలియకపోలేదు. అంతకు తక్కువ పదవి నా కుచితంబుకాదు. కాని, వానికా! తనయుద్ధగర్వంబున నున్న ప్రీతి మఱిదేనిపైనను లేదు తనసాంగ్రామిక పరుషశబ్దపూరితంబులైన దుర్భాషలచే వారి విన్నపంబుల నవలంఘించి 'నాయుద్యోగస్థుఁ డీవరకే యెన్నుకొనఁబడె'నని నిరాకరంబుగఁబల్కెను! ఎవడా యుద్యోగస్థుఁడు! మంచి గణితశాస్త్రపాండిత్యమున మించువాఁడు! కృష్ణుడు! వహావా! సౌందర్యవతియగు తన సతీమణితో సరససల్లాపంబులఁ గాలంబుఁబుచ్చు రసి కాగ్రగణ్యుఁడు! వాఁడా! కదనరంగమున కాలెప్పుడైనఁ బెట్టి యెఱుఁగునా? సేనాముఖం బెప్పుడైనఁ జూచియుండెనా? వ్యూహముల నెన్నడైనఁ బన్నెనా? ఒకముగ్ధబాలిక మాత్రంబైన వానికా

జ్ఞానంబుగలదా? కేవలపుస్తకజ్ఞానము! ఇప్పటి మనసభయందు నీవు జూచుచు ఖాసీనులైన ముసలి సభ్యులతో సరిసమానముగ కబురులుచెప్ప సామర్థ్యము గలవాఁడు. ఆచరణ తెలియని అతివాగుడుగాడు! వాగ్దర్పమేగాని కార్యదర్పమేమియులేదు! ఈయన యువసేనాని! ఇఁక దేశదేశంబులం దనేక యుద్ధరంగముల సాహసవిక్రమంబులఁ బేరొందిన నేను వీనివెనుక నొదిగి యుండవలెనా? వాఁడ్కు యువసేనాని! నే ననుచరుఁడను! బాగు! బాగు!

రుధిరు.— దేవునియాన! నేవాని తలవరి నగుటకు తత్తర పడుచున్నాను.

ఉగ్ర.— కానిమ్ము దీనికేదియు ప్రతిక్రియలేదు.

ఉ॥ సేవకవృత్తిశాపమిది చెందునధిక్యత ప్రేమపాపులన్
దీవన బొందవెప్పుడును ధీయుతప్రజ్ఞలు శక్తియుక్తులున్
వావిరి పూర్వధర్మవిధి వారసుహృత్కులు శూన్యమయ్యె హా!
ఏవిధిగూర్తుమూరునకు నీవె యదార్థముఁ దెల్పుమిత్రుఁడా॥

రుధిరు.— అటులైన నేనిపుడు వానివెంటరాను. వచ్చిన ఫలమేమి?

ఉగ్ర.—ద్వి॥ పరితృప్తినుండుము పదిలంబుగాను
వానివెంటనెబోయి వానిపై పగను
దీర్చివత్తును గాని తీరైనయపుడు
వేగిరపడనయ్య! విడనాడనయ్య!॥

ఆ. వె॥ అందఱు యజమానులగుటది ప్రాపించ
దందరు యజమాను లధికభక్తి
ననుగమింపగ బడ రనుచరులవలన
సేవయెప్పుడు నిజసేవగాదు॥

తే. గీ॥ నీవు లక్షింప నెందఱో నీతిదక్కు
వంగిమ్రొక్కుచు బానిసభంగినెపుడు
కష్టములమోసి యజమాను ఖరములనఁగ
కాలముగడుపరె? యొకింత గడ్డికొఱకు.
ముసలి తనమట్టి వారికి మూఁగగాను
వెడలఁగొట్టంగఁ బడరొకో వెడగులబలె॥

ఇట్టివిశ్వాసముగల సేవకులఁ గొరడాలఁబట్టి కొట్టినను పాపములేదు. మరియొక తెగవారుగలరువారు.



తే. గీ॥ ముఖమున తగునాకారముల్ మురువు దిద్ది
వెలికి ధర్మస్వభావంబు వెడలజూపి
లోనహృదయంబు తమబాగె పూని యుండ
పైకి సేవకా చిహ్నముల్ పారఁజూపి
పెంపుఁ జేతురు తమమేలె యింపు గులుక
నిట్టి వారలె నిజముగ గట్టివారి॥

నే నీతెగలోని వాఁడను సుమా! ఏలయన:—

ద్వి॥ రుధిరుండ వైనంత రూఢి దప్పకను
నే మూరు నైనచో వేనుగ్రుగాను
వాని వెంట నరుగ వానికై కాదు
నాకార్య సాధన నన్నంపు చుండె.

దైవమేసాక్షి! నే పోవుట ప్రీతిచేఁ గాదు. ధర్మబుద్ధి చేగాఁదు. నా కార్యసాఫల్యంబు కొఱకే నే నా విధంబుగ నటించెదను.

సుగంధి॥ స్వాంతమందు డాఁగి యున్న సంగతంత తేటగా
మంత నంబు లేక విప్పి మాయఁద్రోసి చెప్పినన్
స్వాంత మెల్ల దీసి యొప్ప యంతికంబు జేర్చినన్
చెంతఁ బారు పక్షి యెల్ల జీర దొక్కొ ముక్కునన్

రుధిరు—ఆముద్దు మొగమున కెట్టి యదృష్టము పట్టు నామెను గ్రహించినచో!

ఉగ్ర—ఆమె తండ్రిని గట్టిగ నరచి పిలువుము. వాని లేపింపుము. వాని వెంటనంటి వాని సంతోషమును విషాదంబు సేయుము. వీథుల నెల్ల వాని కథఁ జాటింపుము. ఆమె బంధువుల కెల్ల రోషముఁ బుట్టింపుము. వాడెట్టి సౌఖ్యంబులఁ దేలుచున్నను ఈఁగలు ముసిరి నట్లు ముసిరి వానిఁ బట్టి శోధింపుము. వాని యానందంబున నవకాశ మున్నంత వరకు విషంబుఁ గలుపుము.

రుధిరు.—ఆమె తండ్రి గృహ మిదియే. నేను బిగ్గరగఁ బిలచెదను.

ఉగ్ర.—అటుల చేయుము. గొప్ప పట్టణంబున నర్ధరాత్రంబున నజాగ్రతవలన నగ్నిహోత్ర ప్రమాదంబు గలిగినప్పుడు కేకలు వేయు చందమ్మున భగ్గుత్తికతో నరువుము.

రుధిరు—ఓ వీరబాహూ! ఓహో వీర బాహూ! వీరబాహూ! వీరబాహూ!!

ఉగ్ర.—ఓహో వీరబాహూ! నిద్రలే. దొంగలు! దొంగలు! దొంగలు!! నీయిల్లు నీవాకిలి, నీ బిడ్డలు, నీ కూతురు, నీధనము, మాచుకొనవయ్యా! దొంగలు! దొంగలు!!

(వీరబాహుఁడు మేడపై కనఁబడుచున్నాఁడు.)

వీర.— ఈ భయంకరమైన పిలుపున కేమి కారణము? ఎవరక్కడ? ఏమది?

రుధిర.—అయ్యా, మీ వాళ్లందఱు నింట్లో నున్నారా?

ఉగ్ర.—మీ తలుపుల తాళములు భద్రముగ నున్నవా? లోపల నందరు సరిగా నున్నారా?

వీర.—ఏల మీరట్లు ప్రశ్నించెదరు?

ఉగ్ర.—ప్రారబ్ధకర్మ!—అయ్యా, మీ ఇంట్లో దొంగలు పడినారు. చాలు. చాలు. సిగ్గులేదా యేమి? పైన బట్ట వేసుకొని బయలు వెడలిరమ్ము. మీ కొంప కూలింది. మీ గుండె బ్రద్దలైనది. మీ ప్రాణము సగము పోయినది. లే, నిద్ర లే. ఈ గుఱ్ఱుపట్టి నిద్రించు ప్రజలను గంట వాయించి లేపు. లేని యెడల నీ యంత పనికి మాలిన వాఁడు ప్రపంచమునం దుండఁడు. లే, లేవయ్యా, లేచి రావయ్యా.

వీర.—మీ కేమైన మతి పోయినదా?

రుధిర.—అయ్యా, నాకంఠ ధ్వని మీకు తెలియుచున్నదా?

వీర.—తెలియదు, నీవెవరు?

రుధి.—నా పేరు రుధిరుఁడు.

వీర.—ఓరి దుష్టా! నా యింటికి రావలదని నీ కనేక సారులు బుద్ధిచెప్పి యుంటిని నాకుమార్తె నీ కియ్యఁబడదని నీ కీవరకే స్పష్టముగఁ జెప్పియుంటిని. మరల నీ విప్పుడు మధుపానమత్తుఁడవై యొడలు మరచి లేని ధైర్యమునుఁ దెచ్చుకొని నా విశ్రాంతికి భంగంబు సేయవచ్చితివా?

రుధిర.—అయ్యా! అయ్యా!—

వీర.—ఓరి తులువా; నీయక్రమంబునకు తగుప్రాయశ్చిత్తముఁ జేయింప నాకుసామర్థ్య మున్నది సుమా!

రుధిర.—అయ్యా, కొంచెము శాంతింపుఁడు.

రవీ.—మాయింట దొంగలా! ఇదివినీసు; నాయిల్లు కోటగాని గుడిసెకాదు.



రుధిర.— ఆర్యా, వీరబాహూ, నేను పరిశుద్ధ మనస్కుఁడనై వచ్చియున్నాఁడను సుమండీ.—

ఉగ్ర.—దుష్టుఁడు చెప్పినన్న మాత్రమున మంచి కార్యమునుగూడ చేయనొల్లని మూర్ఖులలో నీవొకఁడవు. ఇప్పుడు మేము నీకుపకారముచేయ వచ్చినపుడు మేము దుర్జనులమని నీ కూఁతు రడవి మృగంబునొక్కదాని వరింపఁజూచు చూరకుం డెదవు కాబోలు.

వీర.—ఓరి ఖలుఁడా, ఏమిరా ప్రేలెదవు?

ఉగ్ర.—నీవు—మహాసభ్యుఁడవు బయలుదేఱినావు

వీర.—ఇందుకు తగుశిక్ష ననుభవింతువులే. రుధిరా, నిన్నెఱుంగుదును.

రుధి.—అయ్యా, నే నేశిక్షనైనఁ బడుదును కాని, నేనొక్కటి ప్రార్థించెదను. నన్ను మన్నింపుఁడు. నీ సుకుమార కుమారి, ఈ అర్ధరాత్రి, ఈ నిశీథసమయంబున నొక సామాన్య పల్లెవాని ననుచరునిగఁ దీసికొని పుళిందుని దుష్టగాఢాలింగనంబులకై యరుగుచున్నది. ఇది నీ సమ్మతమును సంతోషమునైన యెడల,— కొంత వరకటుల నేతోఁచుచున్నది,—నీ యాజ్ఞాప్రకారమును, అంగీకారప్రకారమును జరుగుచుండె నేని, మేము నిశ్చయముగ నీయెడల నపరాధము చేసినవారమే. కాని ఆ విషయ మెరుక లేదేని నీ దూషణకు మే మనర్హులము. మీ ఘనత మాకుఁ దెలిసి యుండియు మేమిట్టి యసత్య వర్తమానంబులచే మీగౌరవము నుల్లంఘించు వారము కాము. నీయనుజ్ఞయే లేక నిట్లు చేయుచున్న యెడల, నీ పుత్త్రిక తన గుణ సౌందర్య సౌభాగ్య విభవంబుల నెల్ల, కులహీనుఁడును ద్రిమ్మరీడునైన వానికి కట్టిపెట్టి,నీయెడ నిర్భరమైన తిరుగబాటు చేసినదన్నమాట. తత్క్షణంబు నీమనస్సు సంతుష్టిచేసికొనుము. ఆమె శయ్యాగారంబునఁగాని గృహంబునఁగాని యున్న యెడ నన్ను నీ యిష్టము చొప్పున శిక్షింపుము.

వీర.—దీపము వెలిగింపుఁడు. నాకొక దీపమునిండు. నాబంధువులఁ బిలువుఁడు. నా యుడుమ కన్న దురుచున్నది. నా కలలోఁ దోఁచినట్లుగనే సంభవించుచున్నది. అప్పుడే నామనస్సులో భయము కలుగుచున్నది. అయ్యో! అయ్యో!! నిజమైతే కావచ్చును. దీపము! దీపము! హా! హా!

ఉగ్ర.— రుధిరా, నాకు సెలవిమ్ము. నేనిచ్చట నుండ గూడదు. పుళిందునికి వ్యతిరేకముగ నున్నట్లు కనుపడరాదు. ఈ రాష్ట్రమువారి పరిపాలన నే నెఱుంగుదును. సభవారిందుకొఱ కాతని కొంచెము మందలింతురేగాని యతని త్యజిం

పరు. వారి కార్యసానుకూలంబు సేయు సమర్థుఁడు మరి యొకఁడు వారికి లేడు యమబాధలఁబోలి వాని నే నసహ్యించుచున్నను, ప్రస్తుతకాలము ననుసరించి నేను వాని యెడల ప్రేమాతిశయంబు వెల్లడిచేయవలెను. ఇది వట్టి నటన గాని నిజముగాదు. వాఁడిప్పు డూరివెలుపలి సత్రము నందుండును. వీరందఱి కక్కడకు దారిఁజూపుము. నేనక్కడే వానితో నుండెద. గనుక నేపోయి వచ్చెద. [పోవుచున్నాడు.

(వీరబాహుఁడును సేవకులును కాగడాలతో ప్రవేశించుచున్నారు.)

వీర.—ఎంతదుఃఖ మెంత దుఃఖము!—నిజముగ నచ్చటికే పోయియున్నదా? నాగతి యెట్లు పట్టినది? నాజీవనమెంత విషతుల్యమైనది? ఓరుధిరా, నీవామె నచ్చటఁ జూచితివా? నిజముగఁ జూచితివా? ఓనిర్భాగ్యులారా! ఆ మూరుతోనా యున్నదని చెప్పుచున్నావు? హా! నాకడుపు చెరుపఁబుట్టినది. ఆమెయే యని నీకెట్లు తెలిసినది? కాదేమో? అయ్యో, నాకెట్టి భ్రమనుగల్పించెను? ఎంతమోసము చేసెను?— నీతో నేమనిచెప్పెను? ఇంకను దీపముల దీసికొనిరండు. నా బంధుజనుల నందఱను లేపుడు. వివాహము చేసికొన్నదా? నీవేమని యనుకొందువు?

రుధిరు.—ఆహా,—వివాహమైనదనియే తలంచెదను.

వీర.—హా! దైవమా!—గృహమెట్లు వెడలెను? ఎంత ఘోర మెంత మోస మెంత పాపము!

సీ. తనయలు పచరించు వినయంబు పాటించి తగ మోసపోకు డో తండ్రులార!
మంత్ర తంత్రంబుల మతి జవ్వనంబునఁ జెరచు నుపాయముల్ తఱచు లేవె?

రుధిరు.—ఔనట్టి విషయంబులను గూర్చి నే చదివి యున్నాఁడను.

వీర.—నా తమ్ముని బిలువుము. ఓ రుధిరా, నీ కీయిన నాపుత్త్రిక నిచ్చినచో—ఒకరా త్రోవ.—ఒకరిటు—కొంద రటు-నలుగురు నాలుగు త్రోవలఁ బొండు.— వారెచ్చట కనపడఁగలరు?

రుధిరు.—తగినంత మంది జనముతో నావెంటరండు. నే వానిఁ జూపించెదను.

వీర.—నాయనా, త్రోవతీయుము. ప్రతియింటి యొద్దను జనులను లేపి ఎక్కువమందిని పోగుచేసుకొని పోవలెను. ఆయుధములను గూడఁ గొనిరండు. నడువండి. రుధిరా నీకు ప్రత్యుపకారము చేసెదను. మరువను. [అందరును పోవుచున్నారు.

---



రంగము II.—వినీసు. మరియొకవీధి.

(పుళిందుఁడు, ఉగ్రుఁడు, సేవకులు ప్రవేశించుచున్నారు.)

ఉగ్ర. చ. అనయము శత్రుసంతతుల నాజినినిర్దయ గూల్చు, నేడు నా
మనమున సంశయంబు విషమంబుగ ఘాతకు నోడు, నొక్కెడన్
ఘనమగు పాప భీతి సరిగాక ఘటించెడు కార్యహాని
నా సునిశిత ఖడ్గమెప్పుడును చూచెడుబొడ్వగ వానిడొక్కకై॥

చూచుచుఁ జూచుచు నరహత్య సేయ నామనం బొప్పకున్నదిగాని, అనేక సారులు వానిని ఖండ తుండెములుగఁ జేయ బుద్ధి యంకురించినది మహాప్రభో!

పుళిందు.—నీ వూరకుండుటయే మంచిపని సుమీ, ఉగ్రా.

ఉగ్ర.—కాదు, కాదు, వాఁడనేక కారులరచి, తమ ఘనంబు నుల్లంఘించి పలుకరాని దుర్భాషలఁ బలికెను. నావంటి శాంతునికి సహితము క్రోధమునుఁ గల్గించెను. నాకు దయసేసి చెప్పుడు. వివాహమైనదిగదా? ఏలనన నీ సుభ్యుఁడెక్కుడు జనప్రీతి గలవాఁడు. మంచి పలుకుబడి గలవాఁడు. రాజుకంటెఁ గూడ సామర్థ్యము గలవాఁడు. మీ యిద్దఱ కెడబాపుఁ జేయఁగలఁడు. ధర్మశాసనంబున కవకాశ మున్నంత వరకు మీపై నెట్టి శిక్షనైన విధింపగలడు.

పుళిం.—వాని ద్వేషమంతయు నాపై దీర్చుకొన నిమ్ము—నేను రాష్ట్రమునకు చేసిన యుపకారములే నాపక్షమున వేనోళ్ల వాదింపఁగలవు. నాకార్యముల నుపేక్షించి వారు పలుకదురేని నా యుత్తమ చరిత్ర నప్పుడు చెప్పవలసినఁ జెప్పెదను. అట్టి సమయమున నాత్మస్తుతి దోషము కానేరదు.

ఉ॥ పుట్టితి రాజవంశమునఁ బొందిన దొడ్డ యవస్థ కిప్డు నా
చెట్టలు బాగులారయఁగ సిగ్గిలహేతువు లేదు వే బయ
ల్వెట్టఁగ నెట్టి శోధనకు భీతి దొలంగదు నా యశంబు నే
పట్టఁగ రాని ప్రేమలత బంధుఁడనైతిని సాధ్వి నన్ను చే
పట్టెను గానిచో నిటుల పారము గట్టుదె నైజస్వేచ్ఛ కో
పట్టున విడ్తునే కడలి భాగ్యముకైనను దాని మిత్రుడా॥

అదుగో చూడు!—ఆ కనుపడు వెలుతురేమి? ఆ కాగడాలేమి?

గ్ర.—వారే! ఆమె తండ్రియు బంధువులును. మీ రా లోపలికిఁ బోయి దాగుకొనుఁడు.

పుళిం.—ఛీ, ఛీ, నే లోపలికి పోవుదునా?—నాశక్తి, నా సామర్థ్యము, నా ప్రజ్ఞలు, నా నిష్కళంకమైన ఆత్మ, అన్నియును బహిరంగమగు గాక! ఆదివారేనా?

ఉగ్ర.—కాదు. కానట్టు తోఁచుచున్నది.

(కృష్ణుఁడును సేవకులును ప్రవేశించుచున్నారు)

పుళిందు.—రాజుయొక్క సేవకులును, నా యువసేనానియు. మిత్రులారా, మీకు భద్రమగుఁగాక! వార్తలేమి?

కృష్ణు.— రాజుగారు మిమ్ము నభినందించి అతి త్వరితగతిని దర్శనమిమ్మని మనవి చేయుచున్నారు.

పుళిం.—కారణ మేమై యుండును?

కృష్ణు.—సైప్రసు ద్వీపము నుండేమియో వర్తమానములు వచ్చెనని తలంచెదను. ఏదియో శీఘ్రకార్యమై యుండవచ్చును. ఓడలలోనుండి ఒకరి వెంట నొకరు పదిమంది కొంచెము కాలములో పరుగెత్తుకొని వచ్చిరి. అప్పుడే సభ్యు లనేకులు రాజుగారి దగ్గరకు వచ్చియున్నారు. తమ కొఱకు వేచి యున్నారు. మీరింటివద్ద లేమిఁ గనుంగొని నలువుర నలుమార్గముల వెదకం బంపిరి.

పుళిం.—నేను నీకే కనుపనుట నయమేసుమీ! ఈ గృహమున నొక్కమాటఁ జెప్పి యిప్పుడే యరుదెంచెదను.

కృష్ణు.—అనుచరా, ఇతఁడిక్కడేమి చేయుచున్నాఁడు?

ఉగ్ర.—నేఁడీయన కొక గొప్ప నిక్షేపము దొరకినది. అది ధర్మ సమ్మతమైనచో అఖండ మనోజ సామ్రాజ్య సార్వభౌముండగును.

కృష్ణు.—నీమాట నాకర్థ మగుటలేదు. విన్నగాఁ జెప్పుము.

ఉగ్ర.—ఆయనకు మంచి భార్య దొరకినది. వివాహము చేసికొన్నాఁడు

కృష్ణు.—ఎవరిని?

(పుళిందుఁడు మరల ప్రవేశించుచున్నాఁడు.

ఉగ్ర.—ఎవరినా?— సేనానీ, మనము పోవుదుమా?

పుళిందు.—ఇదె వచ్చుచుంటిని.

కృష్ణు.—అదుగో! మీకొఱకు మరికొందఱు వచ్చుచున్నారు.

ఉగ్ర.—సేనానీ, ఆవచ్చునది వీరబాహుఁడు. జాగ్రత్త,వాఁడు దురుద్దేశముతో వచ్చుచున్నాఁడు



(వీరబాహు, రుధిరుఁడు, మరికొందఱు సేవకులు ప్రవేశించుచున్నారు.)

పుళిం.—ఓయీ! దూరముగ నిలు!

రుధిర.—వీరబాహూ, వాఁడే పుళిందుఁడు.

వీర.—దొంగ! పట్టుకొనుఁడు దొంగ!

(ఇరుపక్షముల వారును కత్తులు దూయుచున్నారు.)

ఉగ్ర.—ఓరీ, రుధిరా, రమ్మురా, నీకు నేను ఉద్దీ.

పుళిం.—మీ ప్రకాశమానమైన కత్తుల నొరలం దుంచుకొనుఁడు. ఈమంచున కవి నిష్కారణముగఁ ద్రుప్పుపట్టిపోవును.

ఆర్యా, సభ్యా, మీఆయుధములకంటె మీ వత్సరములు మాకెక్కువ గౌరవనీయములు సుమా!

వీర.—సీ॥ కలుపాత్మదుష్టాత్మ పలుమందుమాయల మోసంబుఁజేసితే ముద్దుబిడ్డ
మంత్రపాశంబుల మతిజిక్కి భ్రమఁజెంది జ్ఞానంబు హీనంబు గాంచకున్న
తనుగోరివచ్చిన ధనవంతుల నతుల లావణ్యసంపద రా కుమారు
లనుఁగూడ వరియింప లక్ష్యంబు సేయని మోహంబు లెఱుఁగని ముగ్ధబాల
యేల ప్రేమించు కామించు నేమి వెఱ్ఱి
తండ్రిగృహము వెడలి వీడిధర్మమిటుల
తోడివారలు నవ్వంగదుష్టనిన్ను
చూడభయమందు నీరూపుఁజూడఁగలదె?॥

ఓలోకమా, ఈద్రోహంబు కళ్లకు కట్టినట్లు నీకు కనుపడుచుండలేదా? ఈ దుర్జనుం డనేకములగు మంత్ర తంత్రములచే నామెమనమును వశంబుఁ జేసికొని ఆమె లేజవ్వనంబునకు విషమూలికల వలన మాంద్యంబు గల్పించి వివేకంబు నడుగంటఁజేసి నట్లు కనుబడుటలేదా? జ్ఞానలేశంబుగల ప్రతివానికిని నీదుశ్చరితంబు స్పష్టం బగుచున్నది. కాననో దుష్టనిశాటా!

తే. గీ॥ శాసన బహిష్కృతములైన చర్యలీవు
చేసిలోకవిరోధంబుఁ జేయుచుంటి॥

ఓయీ, చూచెదరేమి?వానింబట్టి బంధించి నావెంటఁ గొనిరండు. ఎందరుతిరిగెనేని శిక్షింపుడు. (అందరను కత్తులు దూయుచున్నారు)

పుళిందు.—నాపక్షమువారును, తక్కినవారు నందఱు మీమీఆయుధముల నుపసంహరింపుడు. ఇప్పుడు జగడంబునకు తఱియయ్యేనేని మీప్రేరణ నాకవసరంబు

లేదు. అయ్యా, ఈనేరమునకు నేనెక్కడ ప్రత్యుత్తర మియ్యవలసి యుం డును.

వీర.—కారాగారంబున, ఖైదుఖానాలో— క్రమమైన విచారణ కవకాశమగు వఱకును నీవచ్చటనే వాసంబుండ వలెను.

పుళిం.—మీయాజ్ఞకు బద్ధుండనై నచో మనరాజెట్లు సంతుష్టిఁ జెందగలడు? ఇదుగో వారి చారులు నన్ను తత్క్షణము తీసికొనిరమ్మని వర్తమానముతో నిలచి యున్నారు. చూచితిరా?

సేవ.—రాజుగారు సభ తీర్చియున్నారు. మీకొఱకు గూడ చారుల నంపియున్నారు.

వీర.—ఏమి? రాజుగారు సభ తీర్చియున్నారా? ఈరాత్రివేళ! వానినిగూడ తీసికొని రండు. నావ్యాజ్యెమును సామాన్యమైనది కాదు. రాజుగాని మరిసభ్యులలో నెవ్వరుగాని ఈకష్టమును తమదిగా భావించు కొనకుందురా? ఇట్టిదుర్మార్గకృత్యం బు లూరక బోవిడిచిన యెడల మనరాజ తంత్రజ్ఞులు బానిసలును మ్లేచ్ఛులు నగుదురు. (అందరు పోవుచున్నారు)

## రంగము III. సభ.

(రాజు, సభ్యులు సభ తీర్చి యుందురు. తక్కిన ఉద్యోగస్థులు సేవకులు వేచియుందురు.)

రాజు.—ఈ సమాచారము లన్నియు నొకదానితో నొకటి సంబధించి యుండలేదు. నమ్మ శక్యముగ లేవు.

ప్రథమసభ్యుడు.—ఔను. అసంబద్ధముగనే యున్నవి. నాకు వచ్చిన యుత్తరములలో 107 యోడలని యున్నది.

రాజు.—నాయుత్తరములలో140 అని యున్నది.

రెండవసభ్యుడు.—నాలేఖలు 200 అని చెప్పుచున్నది. కాని సంఖ్యలో భేదమున్నప్పటికిని,ముఖ్యమైన విషయము తురుష్కుల సైన్యము సైప్రసు ద్వీపమునకై బోవుచున్నదను వర్తమానమందు మాత్రము విరుద్ధములేదు.

రాజు.—ఈముఖ్యవిషయమును గూర్చియే నాకును భయముకలుగుచున్నది. ఇందు మాత్రము పొరపాటుండదు.

నావికుఁడు.—(లోపల) అహో! అహో! అహో!

ఉద్యో.—నావలలోనుండి యొకనావికుఁడు వచ్చియున్నాఁడు.



(నావికుఁడు ప్రవేశించుచున్నాఁడు)

రాజు.—వర్తమానములేమి?

నావిక.—తురుష్కుల సైన్యము రోడ్సుదేశమునకై పోవుచున్నదని నావికాధికారి మనవి చేయుమన్నాడు.

రాజు.—సభ్యులారా, ఈమార్పున కేమి కారణమో యోజింపుడు.

ప్ర. సభ్య.—ఇది ఏమాత్రమును సహేతుకముగఁ గనఁబడదు. ఇది మనల భ్రమపెట్టు తంత్రము కావచ్చును. సైప్రసు తురుష్కులకు ముఖ్యస్థానమైనట్లు మనకు కనుపడుచున్నందునను, రోడ్సుపట్టణ మింతకంటె దృఢముగ రక్షింపబడుటచే జయింపనింతకంటె నసాధ్యమై యుండుటచేతను, సులభముగఁ జిక్కు సైప్రసు ద్వీపమును ముందాక్రమించు కొనకుండుటకు తురుష్కులంత వెఱ్ఱివారా? అట్లు వ్యర్థమైన యుద్ధమును రోడ్సులో నెప్పుడును వారు చేయరు. కావున నిది కేవలము మనలను పొరపెట్టవలయునని ఎత్తిన పన్నుగడవలెఁగనుపడుచున్నది.

రాజు.—ఇది నిశ్చయము. వారిప్రయాణము రోడ్సు వైపునకుఁ గాదు

ఉద్యో.—మరల నింకొక చారుఁడు వచ్చియున్నాఁడు.

(చారుఁడు ప్రవేశించుచున్నాఁడు)

చారుడు.—మహాప్రభువులారా, ఆతురుష్కులు రోడ్సు పట్టణమునకై క్రమముగ నోడలునడిపి అక్కడ మరికొంత నావసైన్యముతోఁ గలిసికొనిరి.

ప్ర. సభ్య.—ఆహా! నే ననుకొనినట్లే అయినది. సుమారెన్ని యోడలతో గలిసికొనెను.

చారుడు.—ముప్పది యోడలుండును. ఇప్పుడు వారు మరల తిరిగి సైప్రసు ద్వీపమునకై ధారాళముగ వచ్చుచున్నారు. మీ వినయ ధైర్య గాంభీర్య సద్గుణ గరిష్ఠుండగు మదనుండు తన వర్తమానమును విశ్వసింప వలయునని ప్రార్థించుచున్నాడు.

రాజు.—అటులైన నిఁక సైప్రసునకే సందేహములేదు. మనసేనానియగు లక్ష్మణుడెచ్చట నున్నాడు. పట్టణమున లేడా?

ప్ర. సభ్య.—అతఁడు ఫ్లోరెన్సులో నున్నాడు.

రాజు.—ఆతనికి తత్క్షణము లేఖనంపుము. అతి శీఘ్రముగఁ బోవలెను.

ప్ర. సభ్య.—ఇదుగో! వీరబాహుడును, మన పరాక్రమవంతుండగు పుళిందుడును వచ్చుచున్నారు.

(వీరబాహు, పుళిందుడు, కృష్ణుడు, ఉగ్రుడు, రుధిరుడు, ప్రవేశించుచున్నారు.)

రాజు.—శౌర్యనిధీ, పుళిందా, మన శత్రువగు తురుష్క నాయకుండగు నుద్దామునిపై నిన్నిప్పుడే యుద్ధమునకుఁ బంపఁ దలఁచుకొన్నాము. (వీరబాహుని వంకఁ జూచి) నే నింత వఱకు చూడలేదు. సభ్యా, నీకు స్వాగతము. ఆసనముఁ గైకొనుము. ఈ రాత్రి మీయొక్క సహాయ హితోపదేశంబులు మాకు కొఱఁతఁ గల్గెను గదా!

వీర.—మీ యొక్క సహాయము నాకు నక్లేయున్నది. అయ్యా. నన్ను క్షమింపుడు నా యుద్యోగము గాని, రాజ కార్యములు గాని నన్నిపుడు రప్పింప లేదు.

క.॥ నా దుఃఖమె ఘన మయ్యెను
బా ధింపదు దేశదుఃఖ•భారము నన్నున్
నా దుఃఖము వెల్లి విరిసి
ప్రొది నడచె నితర దుఃఖ•పుంజము లెల్లన్॥

రాజు.—ఏమి? ఏమి? ఏమి ఆపద సంభవించినది?

వీర.—నాకూతురు! నాకూతురు! అయ్యో నా కూతురు!

అందరు.—ఆ! చచ్చిపోయినదా? పోయినదా? పాపము! పాపము!

వీర.—లేదు. లేదు. చావలేదు. చచ్చిన బాగుగనే యుండెడిది. చావుకంటె నన్యాయము!

రాజు.—ఏమది? శీఘ్రముగ చెప్పుము. మాకు బహు విచారముగ నున్నది. చెప్పుము.

వీర.—ఎత్తుకొనిపోయిరి. పాడుచేసిరి. ఇంకేమున్నది!

తే. గీ॥ మందు మాయల చేత మై మరువఁ జేసి
కపట తంత్రంబులఁదనయ కన్నుఁ బ్రామి
నన్ను నెడఁ బాపి రయ్యయో! నయము నాఁక
తొడరి యింద్రియంబుల సుప్తు దొలఁగ కున్న
బుద్ధి యేల చెడును మంత్ర బోధ లేక॥

రాజు.— ఉ॥ ఎవ్వని తుచ్ఛ కాంక్ష మది యెవ్వడు క్రూరుడు నిర్భయంబునన్
జవ్వని బుద్ధిఁబాపి కడు సంక్షుభితుం గనుఁజేసె నిన్ను వా
డెవ్వడు గాని నా సుతుడె యిందున గూడి చరించెనేని నే
నెవ్వగఁజేతు శాసన మనూన విధిం గను ఘోరదండనల్॥



వీర.—మీ నిష్పక్షపాత దయా స్వాంతమున కెంతయు మ్రొక్కుచున్నాను. ఆ దురాత్ముఁడు, ఆ పాపి వీడే. ఇచ్చట రాజకార్యంబుల నిర్వహింప నుద్యుక్తుండై నిలువఁబడి యున్న వాఁడు.

అందరు—ఇందుకు మాకు చాల విచారముగ నున్నది.

రాజు.—పుళిందా, నీవు దీని కేమిసమాధానము చెప్పెదవు?

వీర.—ఏమిచెప్ప గలఁడు? ఇదంతయు నిజమని తప్పు.

పుళిం.— సీ॥ ధీమంతులార, సుధీరమానసులార•అలఘు చరితులార, యనఘులార
నా భూరి యజమాన నాయకులార వి•చారణనైపుణి స్వాము లార
ఈ వృద్ధు పుత్రికనే గొనిపోయి వి•వాహంబు సల్పుట వాస్తవంబు
నా యపరాధంబు నాదోష దౌష్ట్యంబు•వివరమింతయకాని వేఱులేదు.

సీ॥ పరుష వాక్యంబు లభ్యాసంబులగుగాని శాంతవచనంబులు చేతకావు
పదియేండ్లప్రాయ మీ బాహుద్వయమునుండ మొనమొన్న యేడాది ముందుదనుక
సాహవవ్యూహకోలాహలాంతరమున కాలంబుఁగడిపిన కఠినమతిని
కలహసంబంధంబు గా నట్టికార్యము లీలోకమున మది నెరుగనయ్య

తే. గీ॥ వాదనచతురతను నేను పేద,మీకు
దయయునోపిక గలుగ నుదంతమంత
లేని మెరుపులు కల్పింప లేశమైన
నున్నదున్నట్లు చెప్పెదో మాన్యులార॥

క॥ మందుల మంత్రంబుల బహు
చందమ్ముల దుర్నయముల చాన మనంబున్
మందంబు సేయు టుత్తది
బంధురమగు ప్రేమచేత బద్ధుడనైతిన్॥

వీర.—శా॥ పలుకుల్నేరదు ముద్దరాలు విమలాభావంబునన్నొప్పు సం
చలనంబింతకు లజ్జచేఁగలగు సచ్చారిత్ర నేడియ్యెడన్
కులమున్ శీలము ప్రాయమున్ మరచి యీకూళన్ వితర్కింపగా
కలనైనంగని భీతినొందునుగదా! కల్యాణిగాంక్షించునే?॥

తే. గీ॥ నైజమునకిట్టి విరుద్ధంబు నెగడగలదె?
జ్ఞానహీనులుగాని విజ్ఞాననిరతు
లిట్టిమాటలెపుడుచెవి పెట్టరయ్య
క్రూర కర్మలె దీనికిఁగారణములు॥

కావున, నేను మరల మరల గట్టిగ నొక్కి చెప్పుచున్నాను. ఈదుర్మార్గుడు, ఈ పలుగాకి, విషప్రయోగంబులచే నాకూతురును వశ్యంబుచేసికొన్నాడు. నేను చెప్పునది రూఢి.

రాజు.—ఈ ఊహఁ జేయు ప్రమాణవచనంబులు చాలవు. ఇంతకంటె స్పష్టమైన దృష్టాంతములు గలవా?

ప్రథమ సభ్యు.—పులిందా, నీవు నిజము చెప్పుము. నీ వేమైన కపటోపాయంబు వలన నా కన్యకామణి మనంబు నాకర్షించితివా లేక యదార్థమైన ప్రేమానుబంధం బామెకు నీయెడం గల్గెనా?

పులిందు.—ఊరబయట సత్రము నందామె యున్నది. ఆమెను బిలిపించి తండ్రి యెదుట నన్ను గూర్చి యామె నే బలుకనిండు.

ఆ. వె॥ రమణి నాయెడ నపరాధంబు మోపిన
పదవిగౌరవంబు భంగపరచి
కఠినశిక్షఁ జేసి కంఠంబుఁ దెగ నేసి
ప్రాణమిచటఁ గొనుడు హీనునన్ను

రాజు.—సుశీలను తీసికొనిరండు.

పులిందు.—అనుచరా, నీవామె యెచ్చటనున్నదో యెరుగుదువు. వెంటబెట్టుకొనిరమ్ము.

ఆ. వె॥ ఆమె నచ్చునంత నేమెయి నామెకు
నాకు ప్రేమ మెదిగె న్యాయరీతి
చెప్పదొర్పు చెవియొగ్గఁగలదేని
నామనోవికల్ప నాలిసెల్ల॥

రాజు.—పులిందా, చెప్పుము.

పులిందు,—ఆమె తండ్రి నన్ను ప్రేమించి నన్ను పలుమారు తనగృహంబునకు బిలిచి నా చరిత్రనుఁ గూర్చి ప్రశ్నింపుచుండెడివాఁడు. నేను యుద్ధములు, ముట్టడులు, నాకష్టసుఖంబులు చిన్ననాటనుండి యిప్పటివరకు సంభవించిన ఆపదల నేను చెప్పుచుండెడివాడను. అందు విపరీతమైన దురదృష్టములు, భూమి సముద్రంబులపై తటస్థమైన ఘోరవిపత్తులు ఒక్కొకయెడ ప్రాణాపాయంబులు సూక్ష్మముగ తప్పిపోవుట, క్రూరశత్రులచేఁ జిక్కుట, బానిసత్వంబున నమ్మబడుట, మరల స్వాతంత్రమునుఁ బొందుట కొండలు, గుహలు, పర్వతములు, దుర్గములు, ణ్యములు, ఎడారులు మొదలైన వానిలో సంచారములు, ఒండొరుల హిం



కొని తిను రక్కసులు, బాహువులక్రింద శిరసులుగల విపరీతాకార శరీరులగు కబంధులు మొదలైనవారలఁ గూర్చి కథలనేకముల నుడువుచుండెడివాడను. సుశీలయు నీకథల నతిశ్రద్ధతో వినుచు, అప్పటప్పటికి తన గృహకృత్యంబుల నెరవేర్చుకొనఁ బోయి త్వరలో తన పనులెల్లఁ జేసికొని మరల వచ్చి వినుచుండెడిది. అది నేను గ్రహించి నే నొక్క సమయంబున నామె నా చరిత్రనంతయు సంపూర్ణముగఁ జెప్పుమని నన్ను ప్రార్థించునట్లు చేయఁగలిగితిని. నాయౌవనకాలపు కష్టంబుల కామె మనంబు కరిగి కన్నీరు కార్చుచుండెడిది. నాకథ ముగిసిన తరువాత నామె అనేక నిట్టూర్పులఁ బుచ్చి, అతిచిత్రము, అత్యద్భుతము అతికరుణాకరము, అత్యంతకరుణాకరము అని నన్నెంతో పొగడుచుండెడిది. అంతేకాక, నాకొక మిత్రుండుండెనేని, అతఁడీకథలఁ జెప్ప నేర్చిన తన ప్రేమకు పాత్రుండగునని చెప్పెను. ఆ సన్నఁ గైకొని నేనామెం బ్రార్థించితిని. నా కష్టములకామె నన్ను ప్రేమించెను. ఆమె జాలినొందెనని నే నామెను ప్రేమించితిని. ఇదియే నామాయ, ఇదియే నామంత్రము. అదుగో ఆమెయే వచ్చుచున్నది. ఆమెను చెప్పనిండు.

(సుశీల, ఉగ్రుడు ప్రవేశించుచున్నారు)

రాజు.—ఈకథ నాపుత్రికనుగూడ ప్రేమావేశంజేయును వీరబాహూ;

క॥ నయముడిగిన కార్యంబిది
పోయినవగ నేమిఫలము పొందుముతృప్తిన్
ఆయుధము మొక్కవోయిన
బాయుదురె కరమునకంటె బాగనరొక్కొ॥

వీర.—ఆమెను చెప్పనిండు. ఆమె బుద్ధిపూర్వకముగఁ గొంతవగకైనను వానిఁ బ్రేమించెనేని, ఈతని నన్యాయంబుగ దూషించిన పాపఫలంబు నాపైఁబొలుఁగాక! ప్రియకుమారీ, ఇచ్చట నున్నవారందరిలో నీవిన విధేయతల కెవ్వరుయోగ్యులు?

సుశీ.— ఆ. వె॥ ధర్మమిచట నాకుఁ దగ రెండు తెరగుల
కనులఁగట్టియుండె వినుము తండ్రి
విద్యబుద్ధిఁ జెప్పి వెలయంగఁ జేసితి
వీవు నాకుఁ దండ్రి వినుతిసేతు
ప్రొక్కుదానమరియు ప్రొక్కుచుండెడుదాన
తనయనీకు నే కృతజ్ఞురాల॥



కాని,

సీ॥ నాభర్తఁజూడుడు నాకూర్మిమిత్రుండు నాజీవనవిభుఁడానందదాయి
సాహసవిక్రముం డాహవకోవిదుం డప్రతిహతతేజుఁడార్యుఁడతని
భార్యనైతి నిపుడు భరియింపబడుదాన ధర్మవిధిని నతనిదాసినగుదు
గారాబు మాతల్లి ఘనమైనపతిభక్తి సెరపెఁదండ్రినిమించి నీయెడనెటు

తే. గీ॥ లట్టి ధర్మమెతగును నా కన్యమేల ?
నట్టి ధర్మంబె య్యాగమూనతనియెడల
భర్తయతఁడునాకు సరగభార్యనైతి
నింద లోకవిరోధంబు పొందగలదె ?॥

వీర.—చాలు, చాలు, నాకు సంతోషమైనది. నా దుఃఖము శాంతించినది. ఇక మీరాచ కార్యంబులఁ జూచుకొనుడు. ఇట్టి సుతను మరల పరిగ్రహించుట కంటె మరియొక దానిని పెంచుకొనిన మేలు. పుళిందా, ఇటురమ్ము. ఇట్టి దురాత్మురాల నీవరకు పరిగ్రహింపకున్న, నిశుఁ జెందకుండఁ జేసి నిన్ను రక్షించెడినాఁడనే కాని, ఇప్పుడు నీవు స్వీకరించితివి గాన నా హృదయ పూర్వకముగ నీకిచ్చి వేసెదను. ఓ పుత్రికామణీ, నాకింకొక పుత్రిక లేనందున నా మనస్సున సంతోషముగ నున్నది. నీవు పారిపోవుటగలన దానినెట్లు శోభపెట్టుటకు సంకల్పము గలిగెడిగో! అయ్యా, రాజా, నాపని పూర్తియైనది.

రాజు.—వీరబాహు, నేను రెండుమూడు నీతివాక్యంబులచే నీదంపతుల నిద్దరను నీ ప్రేమంబున కర్హులగు నట్లు చేసెదను.

మానిని॥ ఊనిప్రతిక్రియ శక్తికి మించినఁబోవును దుఃఖము సాంతముగా
నైన యవస్థ గడంగినఁదీరెడుఁనాశవిచారము లెల్లమదిన్
హాని సమాప్తము గూడిన నింకనుఁనద్దిదలఁచుచు శోకము నుం
బూనిన హానికి తోడుగ నైన నఁపూర్వపు దుఃఖము వచ్చిపడున్

చ॥ తోడరి యదృష్ట మీడ్చుకొని దుఃఖము దార్చిన నోర్పుతో మనం
బడలక నిల్చిన న్పరిభవంబగు దానికె కాదె దొంగిలిం
బడిన నరుండు నవ్విన శుభంబుగ దొంగను దొంగిలింపడే
గుడుచును గాదె మించు వగ గుందు తలిన్ ద్విగుణంపు దుఃఖమున్

వీర.—చ॥ అగమరలేక సంతసము నందుచు నవ్వుచు నుంటిమేని యా
తురక జయింపదేశమున తొందర గల్గక యుండుగా బళే !



కరము భరంపు శిక్ష సుకరంబుగ మోయగ వచ్చు నందులో
సరస తమంపు సౌఖ్యములె చల్లగ వీనుల సోకు చుండినన్
భరమగు శిక్షయున్ మిగుల బంధుర దుఃఖము నావహించు నా
గురు సహనంబులేక కడు గుందుచు నుండెడు వానికెల్లడన్॥

ఈ నీతు లుభయ పక్షమునను చెప్పవచ్చును. ఈ యుపదేశముల కేమిలెండి. ఈ యోదార్పు మాటల కేమిలెండి.

తే. గీ॥ చెవులలోనుండి హృదయమున్ చీల్చి పెట్లొ
ఎరుగ నైతిని పూర్వమే నెరిగి తిపుడు
మెట్ట వేదాంతములు వట్టి మినుకు లైన
శస్త్రితుల్యములై మించి జరగుచుండె॥
మీ రాజకార్యముల నిక చూచుకొనుఁడు.

రాజు.—ఆ యుద్దామనుడు సైప్రసుపై దండెత్తు ప్రయత్నములో నున్నవాఁడు. ఆ స్థలము యొక్క బలాబలంబులు నీకు బాగుగఁ దెలిసియున్నవి గదా ! అక్కడ విశ్వాసపాత్రుఁడైన పరాక్రమవంతుఁ డొక్కఁడుఁన్నను, నీమీఁద యాధార పడి యున్నంత నతనిపై నాధార పడి యుండఁ జాలము. కావున, నీ నవీన వైభవంబు దారుణయుద్ధ సంరంభంబు వలన కొంత కళావిహీనం బగుట కొప్పు కొన వలెను.

పుళిం.—అనుభవంబున, వజ్రలోహకర్కశంబగు యుద్ధరంగంబు నాకు హంసతూలికా తల్పంబు. ఓ ధీరమానసులగు సభ్యులారా, అట్టి పౌరుష కార్యంబులందు నాకు సహజంబగు నుత్సాహము గలదు. ఈ తురుష్కులతోఁ బోరు సల్పుటకు మీ యాజ్ఞకు బద్ధుఁడనై యుందును. కాని నాప్రియురాలుకు అఘ వంశంబునకు తగిన మర్యాదల ననుగ్రహింప మిమ్ము ప్రార్థించుచున్నాను.

రాజు.—నీకిష్టమైన యెడల నామె తండ్రి యొద్ద నుండవచ్చును.

వీర.—వద్దు, వద్దు, నాదగ్గర వల్లకాదు.

పుళిందు.—నాకు నది పనికి రాదు.

సుశీల.—నే నందుల కొడంబడను. నా తండ్రి కను ముందర మెలంగుచు నాయన శాంతమును భంగము చేయుచు నే నిచ్చట నుండఁజాలను. దయా స్వాంతుడ వగు నో మహారాజా, నే నొక్క ప్రార్థనను చేయుచున్నాను. దాని నంగీకరింపుడు.

రాజు.—సుశీలా, నీకోరి కేమి ?

సుశీ.—సీ॥ నా యదృష్టసులపై నాశలు విడనాడి•కల్లోలమున కిట్లు గంతువైచి
ఘన పులిందుని ప్రేమఁ గాంచు టతనితోడ•జీవనమని మతిఁ జింతగాదె ?
అతని లావణ్య మా యాత్మ జూచుచునుందు•నతని శౌర్యాగరిమ మతనిఖ్యాతి
ప్రభులార, నన్నెంతో పరవశఁ జేయును•ప్రాణమాతని నెడఁబాయజాల

తే. గీ॥ నతఁడు సంగ్రామ రంగంబు కరుగ నకట !
వీడు కలఁజూడ కేనిట వైరినుండ
వ్యర్థముంచుఁ దెల్పెద నీప్సితార్థ మెల్ల
కాల మెంతయు దీర్ఘమై కానుపించు॥
కావున, నన్నా యనతోఁ బోవ ననుజ్ఞ నొసంగుడు.

పులిందు.—ప్రభులారా, ఆమె కోరిక ననుగ్రహింపుఁడు. నాయింద్రియ చాపల్యంబున కోరిన కోరికగా మదిఁ దలఁప వద్దు. నా యౌవన రాగంబు లీవరకే శాంతి నొందినవి. ఆమె మనోరథం బీడేర్చుటయే నా ప్రయత్నంబు. కావున నా కోరిక చెల్లింపుడు. ఆమె నన్ననుసరించి యుండుట వలన రాచకార్యముల నిర్వహించుట యందశ్రద్ధఁ జూపుదునని భయము గలదేని,

ఉ॥ పూవిలుకాని తూపులకు బుద్ధి భ్రమించి చరించితేని యా
భావజు మోహతంతువులు బంధురమై పొరఁగప్పఁ గండ్లకున్
నావిధి కృత్యముల్ మరచి నాశమొనర్చితి నేని కార్యముల్
భూవరులార, వీరుడనె? భూమికి భారము దెచ్చు భీరుడన్॥

మరియు నటులైన.

ఆ. వె॥ చేతిడాలు కత్తి వీత మర్యాదలై
గరితచేతి పిచ్చిగరిట గావె?॥

రాజు.—నీలో నీవాలోచించుకొని వలయునట్లు సవరించుకొనవలెను. రాజకార్యమునకై త్వరపడవలెను.

ప్ర. సభ్యు.—ఈరాత్రియే ప్రయాణము కావలెను.

పులిందు.—మనః పూర్వకముగఁ బోవుచున్నాను.

రాజు.—ఉదయమున తొమ్మిది గంటలకుఁ మరలఁ గలసికొందము. పులిందా, మావద్ద నుండి వర్తమానములఁ గొని వచ్చుటకును నీ వెనుక ముఖ్యమైన నితర వస్తువులఁ గొని తెచ్చుటకును నొక యుద్యోగస్థుని నిచట నుంచి పోవలయును,



పులిం.—నా యనుచరుండగు నుగ్రుండు దాని కొరకు నియమింపఁబడును. అతడు మంచి విశ్వాస పాత్రుడు. నా భార్యను, ఇంకను మీరు పంపు నవసరమైన వస్తుసామగ్రుల నతడు సురక్షితముగ వెంటఁ దీసికొని రాఁగలఁడు. నాకు సెల వొసంగుడు.

రాజు.—అటులనే కానిమ్ము. అందఱకును శుభంబగుఁ గాక ! వీరబాహూ, నీయల్లుడు రూపంబున కాక పోయినను సుగుణగణంబులచే ప్రకాశించుచున్న వాడు సుమా!

ప్ర. సభ్యు.— ధీరపులిందా సెలవు తీసికొనెదను. సుశీలను చక్కగాఁ జూడుము.

వీర.—పులిందా, జాగ్రతగఁ గనిపెట్టి యుండుము. తండ్రి నిట్లు చేసినది. నిన్నేమి చేయునో జాగ్రత.

(రాజు, సభ్యులు, ఉద్యోగస్థులు పోవుచున్నారు.)

పులి.—నా ప్రాణసమాన ! విశ్వాసమునుఁ గూర్చి మీరు చింతింపఁబనిలేదు. ఉగ్రా, సుశీలను నీవు వెంటఁగొనిరమ్ము. నీ భార్య నామెకు పరిచర్యఁ జేయనాజ్ఞాపింపుము. సుశీలా, రమ్ము.

గీ॥ తరుణి యింకొక్క మాఱయె విరతి గలదు
లోక ముచ్చటఁ బలుకంగ వీఁక రమ్ము॥
కాలము నతిక్రమింప వీలు లేదు గదా !

(పులిందుడును సుశీలయుఁ బోవుచున్నారు.)

రుధిరు.—ఉగ్రా!

ఉగ్రు.—ఓ ధీరమానసా! ఏమి చెప్పెదవు !

రుధిరు.—నే నిప్పుడేమి చేతునని దలంచెదవు !

ఉగ్రు.—ఇంటికి పోయి సుఖంబుగ పక్క వేసుకొని పడుకొని, హాయిగా నిద్రింపుము.

రుధిరు.—నే సముద్రములో పడి చచ్చెదను.

ఉగ్రు.—బాగు! బాగు! నీవట్లు చేసిని నటు తరవాత నే నిన్నెప్పుడుఁ బ్రేమింపను.
—ఎందుకు ? ఏమి వచ్చినది? ఓరి పిచ్చివాడా !

రుధిరు.—బ్రతుకే బాధ అయినపుడు బ్రతికేమి లాభము ! వట్టి అవివేకము. చావే వైద్యుడు. చావే మందు. వచ్చిన నన్ని బాధలు నివారణగును. కాన ఆ మాత్ర నొక్కటి గుటుక్కున మ్రింగిన చక్కగ నన్నియు చల్లపడును.

ఉగ్రు.—ఛీ! ఛీ! దుర్మార్గము. నేను నాలుగేళ్లు ఇరువది ఎనిమిది వత్సరముల నుండి లోకవర్తనములను చక్కగ గమనించి యెరుంగుదును. మేలు కీడులు లాభనష్ట

ములు బాగుగ విచక్షణచేయు సామర్థ్యము నాకు గలదు గనుక చెప్పుచున్నాను. తన లాభమును తాను బాగుగ గ్రహింప గలవాఁ డొక్కఁడును నాకంటికి కనుపడలేదు గదా. ఈ స్వల్ప భాగ్యము కొరకు సముద్రమున పడి చచ్చెదనని చెప్పుటకు ముందు నేను మనిషి జన్మవదలి పశు పన్మ యెత్తెదను సుమీ !

రుధిరు.—నేను నిజముచెప్పుచున్నాను. నే నింత కంటె నేమి చేయవలెను? నాకింత మోహమున్నందుకు సిగ్గుగనే యున్నది, కాని దీని సవరించుకొను సుగుణము నాకు లేదు.

ఉగ్ర.—సుగుణమా? జీలకర్ర! మన కిట్టులుండినను అట్టులుండినను అంతయు మన చేతిలోనున్నది. మనదేహంబులు మనవనంబులు. మనమనోనిశ్చయములే మన వనపాలకులు. మనము ముండ్లచెట్లు వేపినను, గడ్డివేసినను, కసవువేసినను ఒకే విధమైన నారుబోసినను, పలునారులు వేసినను, ఘటనాఘటన సామర్థ్యము మన స్వాధీనములో నున్నది. మన జీవన మనే త్రాసునం దొక వైపు కామక్రోధాదుల మెుగ్గుండగ రెండవపైపు వివేకములేని యెడల మనవిషయేచ్ఛలు మనల నే దుర్గతికి గొనిపోవునో. మనమనోవికారములను మన మనస్తాపములను చల్లార్చుటకు మనకు బుద్ధిగలదుగదా! నీవు ప్రేమ, మోహమని, బిలుచుచున్నది కూడ నిట్టిదానియొక్క యొకశాఖగ నేఁ దలంచెదను.

రుధిరు.—కాదు, కాదు.

ఉగ్ర.—కాకపోవుటేమి? అది స్పష్టముగ మన మనోరాగజనితము. మన మనోనిశ్చయముయొక్క అనుజ్ఞ. జలంబుల మునిఁగిచచ్చెదవా? కండ్లు తెరువని కుక్కపిల్లలను పిల్లికూనలను నీ బదులు జలంబుల ముంచుము. నీవు కండ్లు తెఱచి ముప్పది సంవత్సరములైనది. నీ వంతయు లోకమునుచూచుచుండి జలంబుల మునిగి బలవంతపు చావుచచ్చెదవా? నేను నీ హితుడనై నిన్ను సౌఖ్యంబునకు దీసికొనిపోవ నీప్రక్కనున్నాను. నెయ్యంపు రజ్జువులచేత నీకు బద్ధుండనైతిని, నీవుభయపడవలదు. నీకిప్పుడు చేయఁగలిగినంత యుపకారమును మరెప్పుడును నే చేయఁజాలను. నీసంచిలోధనముండనిమ్ము; ఈయుద్ధంబునకు నీవుకూడ బయలుదేరిరమ్ము. గడ్డమొకటి తగిలించుకొని మారువేషముధరించి రమ్ము. ఆ సుశీలకు పుళిందుని యెడ, నను రాగము చిరకాలముండదు. నీసంచిలో నిండుగధనముండనిమ్ము. ఆపుళిందుని ప్రేమయునంతే. ఆప్రేమయొక్క ఆరంభ మాగంతుకము త్వరలో నంతర్హితంబగుట నీవుచూడవా? సంచిలో డబ్బుమాత్రముండవలె—ఈమూరుల స్వభావము లతి చంచలములు. సంచిలో డబ్బుమాత్రము బాగుగనుండవలె-ఇప్పుడు మకరందమురీతి నతిమధురమైన



యాహారము త్వరలో వేపనూనెతో సమానముగ చెగటగును. ఆమె జవ్వనంబునకై వెతుకులాడఁ జొచ్చును. తప్పదు. ఆమెకు కొంచెము ముఖము మొత్తినతోడనే తనయవివేకమును గ్రహించును. ఆమెకు మార్పు కావలసివచ్చును. కావున నీవుమాత్రము డబ్బుజాగ్రతచేయుము. నీవు ప్రాణత్యాగముపై కృతనిశ్చయుఁడవై యున్న నీళ్లలో పడి చచ్చుటకంటె నింకొక నాగరికమైన మార్గముఁ జూచుకొనుము. నీకు సాధ్యమైనంత డబ్బుపోగుచేయుము. ఆ అనాగరికుడైన కోయవానికిని అతి నాగరికు రాలునకును జరిగిన క్షణభంగురప్రమాణంబులు నాశక్తియుక్తులచే గాజుపెంకులవలె వికలంబు గాకుండునా! నిన్నామె పరిగ్రహింపకుండునా? కావున, కావలసిన ధనము పోగుచేయుము.— ఓ ఉన్మత్తుఁడా! సముద్రములో యేటిలో గోతిలో పడుట స్పష్టముగ నీమనస్సునుండి తొలిగింపుము. నీప్రయత్నంబున ప్రాణంబుఁ గోల్పోయిన పోవచ్చును గాని; చేతఁగాక బుద్ధిపూర్వకంబుగ ప్రాణత్యాగంబుఁ జేసి కొనుట పిరికితనము.

రుధిరు.—నే నింకను నమ్మియుండిన నాశ గల దందువా?

ఉగ్ర.—నిశ్చయము. నామాటనమ్ము.—పోయి డబ్బుఁ గూర్చుకొని రమ్ము.—నే నిదివరకనేక సారులు చెప్పియుంటిని. మరల మరల చెప్పుచుంటిని. పుళిందుడు నా పరమ శత్రువు. నా విరోధ కారణము గాఢము. నీ విరోధ మంతకంటె గాఢము. కావున, మన మిద్దఱమును కూడి పగఁదీర్చు కొన వలయును. కాలముయొక్క భవిష్యద్గర్భమునం దెన్నెన్నియో కార్యంబులు గలవు. క్రమంబుగ నన్నియు ప్రసవించును. నడు. వెళ్లు. పో. డబ్బు సంపాదించుకొనిరా. రేపింకను, మాట్లాడ వచ్చును. జయమగుగాక!

రుధిరు.—మనము ఉదయమున నెచ్చటఁ గలిసికొందము.

ఉగ్ర.—నా బసవద్ద.

రుధిరు.—చీకటితోడనే వచ్చెదను.

ఉగ్ర.—మంచిది; పొమ్ము.—రుధిరా, జ్ఞాపకమున్నదా?

రుధిరు.—ఏమి?

ఉగ్ర.—ఇఁక నీళ్లలో పడు నాలోచన లేదు సుమీ, వింటివా?

రుధిరు.—ఆ, ఆలోచన మార్చుకున్నాను. నా భూములన్నియు నమ్మి డబ్బు తెచ్చెదను.

ఉగ్ర.—మంచిది. పొమ్ము. నీకు జయమగును. చాలినంత తీసికొని రావలెను.

(రుధిరుడు పోవుచున్నాడు)

హా! హా! హాహా! ఈ విధముగ నామనోరథము సాధనంబు. ఏమన, నాలాభమునకును నాహాస్యమునకుఁ గాక పోయిన నీ ముష్టి పక్షిగానితోఁ గాలయాపనఁ జేసి నా విద్యావిశేషంబుల నపవిత్రంబుఁ జేసి కొందునా? ఘోరంబే నాకుఁ గిట్టదు. నా యుద్యోగము నతని కిచ్చి నన్నవమానించెను. అతనికి మాత్రము నా యెడ మంచి నమ్మకము. అందుచే నా కార్యము కొనసాగుటకు మఱింత అవకాశము గలదు. కృష్ణుఁడును మంచి తగిన వాఁడే. ఏదీ, చూచెదను. ముందాతని ఉద్యోగము సంపాదించి, తరువాత ద్విగుణముగ మాయచేయుట,—ఆ, ఎటులా, ఎటులా?—మరల పరిశీలించెదను. కొంత కాలమైన తరవాత మెల్లమెల్లగ వీఁడు వాని భార్యతో నెక్కువ పరచయుఁడుగ నున్నాడని చెవిలో నూదుట:—వీఁడును అనుమానమునకు తగిని రూప యౌవనంబులు గలవాఁడే. ఆ పులిందుడును ఉత్త నిష్కపట ధారాళ మనస్కుఁడు. పైకి నమ్మకస్థులవలెఁ గనబడు వారి నందరిని నిజముగ నమ్మును. గాడిదవలె ముక్కుపట్టుకొని ఏవైపునకుఁ ద్రిప్పిన నావైపునకు చక్కఁగఁ దిరుగును. ఆ. అయినది. బోధపడినది. సంకల్పమైనది. ఓ భూతపిశాచములరా, నా దురుద్యమమును భూలోకంబునకుఁ దీసికొనిరండు.

పోవుచున్నాడు.

---

## ద్వితీయాంకము.

---

### రంగము I—సైప్రసులో నొక రేవు పట్టణము.

(మదనుడును ఇద్దరు పెద్దమనుష్యులును ప్రవేశించుచున్నారు)

మదనుడు.—అగ్రంబునుండి సముద్రముమీద నేమైనఁ గన్పించుచున్నదా?

మొ. పె. మ.—ఏమియుఁ గనుపించుటలేదు. సముద్ర ముప్పొంగి పొరలుచున్నది. సముద్రాకాశముల మధ్య నొక్క యోడయుఁ గానుపించుటలేదు.

మదనుడు.—ఇంత గొప్ప గాలివాన మన వప్రంబుల నెప్పుడుఁ గొట్టి యుండలేదు.

ఉ॥ అక్కట! భూమిమీద నె భయాతురమౌ పెనుగాలివీచె, నే
డిక్కరణిన్ పయోనిధిపయింబడి మోదిననెట్టి నావలున్
మిక్కిలిచేవఁగల్గినను మీరుసమీరుని ధాటికోర్చునే?
డొక్కలుఁ బద్దలైపగిలి డొల్లవె దిక్కులఁ దేలియాడవే?॥

దీనిఫలిత మెట్లుగానిందుమో,

రెండ. పె. మ.—తురుష్క నావికా సైన్యము పటాపంచలయినదని వినుదుమేమో. నురుగులు గ్రక్కు సముద్రతీరంబునుండి చూడుము.



చ॥ అరచుచు బొబ్బరించుచు మహానిలుఁ ప్రేరణమేనునిక్కు తా
నెరయుచు నాకసం బతి వినోదగతిన్ శమనింపఁ జూచును
త్తరుపి ధ్రువంపుమండలము దారొక్కని పైకెగఁ ద్రోయుచునుండె నీ
సరభస వృత్తిఁ జూడగవిషాదము గోపముఁ బొందెసంద్రమున్॥

ఇంత క్రోధావేశంబైన జలధి నేనెప్పుడును చూడలేదు.

మదనుఁడు.—తురుష్క సైన్య మొక్క రేవునఁ జేరకున్న నింతటితో నాశంబుఁ గావలసినదే.

(మూడవ పెద్దమనిషి ప్రవేశించుచున్నాడు)

మూ. పె.—సోదరులారా, మేలువార్త! మేలువార్త! మనయుద్ధములు ముగిసినవి. ఆ భయంకరమైన తుపాను తురుష్క నావసైన్యమును దగ్ధముఁ జేసి వారియుద్యమము నాపివేసినది. వినీసునుండి రేవున నిప్పుడు దిగిన నొకగొప్పయోడ ఆ కానాశనమునుఁ గన్నులారఁ జూచివచ్చినది.

మదను.—ఏమి? ఈవార్త నిజమేనా?

మూ. పె. మ.—అదుగో! ఓడ రేవునఁ జేరినది. యువసేనానియగు కృష్ణుండోడ దిగి తీరమందున్నాడు. సేనానియగు పులిందుడును మనద్వీపమున కభిముఖుఁడై సముద్రముమీద నున్నాడట.

మదను.—నాకెంతయో సంతోషముగనున్నది. ఆయన మంచి అధికారి.

మూ. పె.—కాని యీకృష్ణుండు తురుష్క సైన్యవిచ్ఛేదమునకు సంతసింపుచుఁ బల్కినను, పులిందుని క్షేమమునుఁ గూర్చిమాత్రము కొంచెము ఖిన్నుడైయున్నాడు. ఏలనన, ఘోరమైన తుపానుకారణమున వా రిద్దఱి యోడ లెడబాసినవట.

మదనుడు.—దైవము రక్షించుగాక! ఆయనసేవ నీవఱకు నేఁ జేసియున్నాను. నిజమైన యోధునివలె నాజ్ఞాపించును. ఇప్పుడువచ్చిన యోడను జూచుటకును ఆపులింద వీరుని కొఱకు నిరీక్షించుటకును సముద్రతీరంబునకుఁ బోవుదమురండు.

మూ. పె.—అటులఁ జేయుదమురండు. ప్రతినిమిషము నెవ్వరో దిగుచుందురు.

(కృష్ణుడు ప్రవేశించుచున్నాఁడు)

కృష్ణుడు.—మీరు పరాక్రమంబు నామోదించు నో సైప్రసుద్వీపవీరులారా, మీకు వందనములు. కల్లోలాంబుధి మధ్య నెడబాపు గలిగిన నా పులిందునికి భద్రంబగుఁ గాక!

మదనుడు.—ఓడ బలమైనదేగదా!

కృష్ణుడు.—దృఢమైనదే. నావికుఁడును అనుభవ చాతుర్యములు గలవాఁడుకావున నాయన క్షేమమునుఁగూర్చి నా కంతగా భయంబు లేదు.

(తెరలో) నావ, నావ, నావ!

(మరియొక పెద్దమనిషి వచ్చుచున్నాడు)

కృష్ణు.—ఆ ధ్వని యేమి?

నా. పె. మ.—పట్టములోని జను లందఱువచ్చి సముద్రతీరమున గుంపులు గూడి యున్నారు. నావ నావ యని కేకలు వేయుచున్నారు.

కృష్ణు.—సేనానియే వచ్చుచున్నాడని తలంచెదను.

(ఫిరంగులు వినవచ్చుచున్నవి.)

రె. పె. మ.—స్వాగత సంధానములు చేయుచున్నారు. మన మిత్రులు మాత్ర మగుదురు.

కృష్ణు.—అయ్యా, మీరు పోయి ఆ వచ్చిన వారెవరో కనుఁగొనిరండు.

రె. పె.—చిత్తము. (అని పోవుచున్నాడు.)

మదనుడు.—యువసేనానీ, మీ సేనాధిపతికి వివాహమైనదా?

కృష్ణు.—ఆ యనయదృష్ట మేమన వచ్చును!

ఉ॥ ఎంచఁగ రాదు చక్కదన మేమిదలంపగరాదు శోభ యీ
కొంచెత గల్గనేరదు యశుంత కవీశ్వరు దృష్టి బారికిన్
మించిఁ గడంగు భాగ్యవతి మీరు నలేఖ్యతనూవిలాస శ్రీ
మ్మించుల మించుబోఁడి యిఁక మించిన బోటి జగంబులేదు ప్రే
మించె పుళిందు నెంతో కడు మించెనుఁ దాముదితాంతరంగుడై॥

(రెండవ పెద్దమనిషి మరలప్రవేశించుచున్నాడు.)

సమాచారమేమి? ఆ వచ్చిన వారెవరు?

రె. పె. మ.—అతఁ డుగ్రుడనువాడు, సేనాధిపతి యనుచరుడు.

కృష్ణుడు.—శీఘ్రముగ సురక్షితముగఁ జేరినాడు.

ఉ॥ ఘోర తుపాను లుద్ధతిని ఘూర్ణిలు తోయధి మారుమ్రోగు నా
మారుతముల్ జలంబులకు మాటున దాగిన గుట్ట మెట్టలున్
క్రూరతమాని భద్రముగఁ గూరిమిఁజూపుచు మార్గ మిచ్చెనా
చారు సురూప సుందరి యశంబున కాదరణంబు భక్తిగన్॥



మదనుడు.—ఆమె ఎవరు?

కృష్ణు.—ఆమె యే నే నిప్పుడు వర్ణించి నామె. మనసేనాని నాయకురాలు. వీరుఁడగు నుగ్రుని రక్షణంబున నిక్కడకుఁగొని రాఁబడినది. మే మను కొని నంతకంటె యొక వారము ముందుగ నిక్కడకుఁ జేరి నారు. ఓ వాయుమూర్తీ, నీవు పుళిందుని యోడను గాపాడుము.

తే. గీ॥ ఆనుఘ, నీ యసమాన యుశ్వాసములను
ఘనపుళిందుని తెరచాప గములఁజొన్పి
శీఘ్రమాతని నిడుయోడఁ జేర్చి రేవు
సతి సుశీల మనోగతశ్రమనుఁ బాపి
సుక్కామానసంబులకెంతో చుకను నిచ్చి
సైప్రసు జనులకునుఁగూర్చు సంతసంబు.

అదుగో! ఓడయొక్క భాగ్యలక్ష్మి యొడ్డునకు వచ్చినది. ఓ సైప్రసు ద్వీపవాసులారా, ఆమె పాదకమలంబులకు మ్రొక్కుడు. దేవీ మీకు స్వాగతము. ఈశ్వర కరుణాకటాక్షంబు మీకు నలుప్రక్కల ప్రసరించుఁగాక!

సుశీల.—శౌర్యనిధీ, నీకు వందనములు. నా మనోహరుని గూర్చి వార్త లేమి గలవు?

కృష్ణు.—దేవర వారింకను విజయంబు సేయలేదు. ఆయన కుశలంబుగ నున్నవారనియు త్వరలో నిచట రాగల రనియు మాత్రము చెప్పగలను.

సుశీల.—నామనంబు తత్తరపాటు నొందుచున్నది. మీరిద్దఱు విడిపోవుటెట్లు సంభవించినది?

కృష్ణు.—సముద్రాకాశంబుల పరస్పర సంఘట్టనంబు మమ్మెడబాపినది.

(తెరలో) నావ నావ అనికేకలు (ఫిరంగిధ్వానములు)

రె. పె. మ.—కోటకు స్వాగతమిచ్చుచున్నారు. వీరుకూడ మిత్రులైయుండవచ్చును.

కృష్ణు.—వార్తలేమో కనుఁగొనిరమ్ము.

(పెద్దమనిషిపోవుచున్నాడు.)

సుగుణాకరా అనుచరా, నీకుస్వాగతము. కమలా, నీకును స్వాగతము (అనిచేయి ముద్దుబెట్టుకొనుచున్నాడు)

ఉగ్రా, సందేహింపకుము. నాకు మొదటినుండియు నిట్టి సరసము లలవడినవి. కావున నింత చనువుఁగైకొంటిని.

ఉగ్రు.—అయ్యా, ఆమె జిహ్వతో నా కనుగ్రహించి నంత నీకుచేతితో వడ్డించిన మేలగును.

సుశీల.—అయ్యో! ఆమెకు నోటివెంట మాటలేరావే.

ఉగ్ర.—అబ్బో! మాటలురావు! అతిమాట. దేవిగారి యెదుట మాత్రము కొంచెము నాలుక కడుపులోనికిలాగుకొని ఆలోచనలు మెండుగఁ జేయుచుండును. సందేహము లేదు.

సుశీల.—నీ వకారణంబుగ నిందించుచున్నావు. పాపము!

ఉగ్ర.—చెప్పెదను వినుడు.

ఉ॥ కాంతలు మాటలందు ఘనచాతురు లాత్మదలంపులందు వే
దాంతులు కష్టమించుక యెదంబడి గాసిలఁ జెందినంత దు
ర్దాంతవిరోధ మత్సరము దార్కొను నల్కజనించెనేని నీ
మంత విలాసినీరుచుల మారుని బిల్తురు ప్రీతిఁగల్గినన్
వింతలు వింతలౌగతుల వేడ్కఁ జరింపరె యింతులదటున్? ॥

సుశీల.—ఛీ, ఛీ, దూషణప్రలాపీ!

ఉగ్ర.—కాదు, నేచెప్పినమాట సత్యము. లేనియెడల నే తురుష్కుఁడను.

కమల.—నీవు నన్ను స్తుతింప నక్కరలేదు.

ఉగ్ర.—వద్దు. వద్దు. నేను స్తుతింపవద్దు.

సుశీల.—నన్ను స్తుతించిన నేమి జెప్పెదవు?

ఉగ్ర.—ఓ సాధ్వీమణీ, నన్నందుకు నియోగింపవద్దు. నాకు గర్హణమేగాని స్తోత్రంబు చేతకాదు.

సుశీల.—అయినప్పటికిని ప్రయత్నము చేయుము.—రేవునకెవ్వరైనఁ బోయియుండిరా?

ఉగ్ర.—దేవీ, పోయియున్నారు.

సుశీ.—నాకేమియుఁదోచుటలేదు. కాని యెట్టులైన కొంతసేపు కాలక్షేపంబుఁ జేసెదను.—కానిమ్ము, నన్నెట్లు స్తోత్రంబుఁ జేయుదువో చూచెదను.

ఉగ్ర.—ఇదుగో, అందుకొఱకే ప్రయత్నము చేయుచున్నాను. కాని నా భావము జిగురువలె మెదడును పట్టుకొని వచ్చుటలేదు. మెదడు నంతను చుట్టపెట్టుకొని లాగుకొని వచ్చుచున్నట్లున్నది. నావాణి నాలుకమీదకు వచ్చినది. ఊడి బయట బడును. చెవు లొగ్గండి.

చ॥ ఒనరసురూపమున్ దగినబుద్ధివివేకము గల్గెనేని యా
వనిత సురూపబుద్ధులు ధృవంబుగ పరస్పరమైత్రితోడగున్॥



సుశీల.—చక్కగ వర్ణించితిరి. ఆమెకు తెల్విగలిగి, తగిన చక్కఁదనము లేనియెడల నేమిచెప్పెదవు?

ఉగ్ర.—ఉ॥ చానకుబుద్ధిగల్గి సెర చక్కదనంబును లేకపోయినన్
చాన వివేక ప్రజ్ఞ నతిచక్కని నాథుగణింప కుండునా?

సుశీల.—ఛీ, ఛీ.

కమల.—చక్కదనముండి తెల్విలేకుండిన,

ఉగ్ర.—చక్కదనముండి తెల్విలేని వారింతవఱకు నాకెచ్చటను గన్పడలేదు.

సుశీ.—ఇవి వెఱ్రివాండ్రను మధుపాన సమయంబున నవ్వించు హాస్యప్రసంగములు. ఇఁక తెల్వియు నందమును లేని వారి కెట్టి యపాత్రపు స్తోత్రము నిత్తువు?

ఉగ్ర.—తెల్వితేటలు గలవారు చేయు నప్రయోజకపు కార్యములనే యవివేక యుందవిహీనులు గూడఁ జేయుచుందురు.

సుశీల.—ఈ యజ్ఞానము నిర్భరము! చెడ్డ వారిని మంచి వారుగ ప్రశంసించుచున్నావు! ఓయీ, నిజమైన యోగ్యురాలు నెట్లు ప్రశంస చేసెదవు? దుర్జనులచేఁ గూడ మెప్పుఁగొను సుగుణఖని నెట్లు ప్రశంసచేసెదవు?

ఉగ్ర.—సీ॥ చక్కదనము గల్గి సౌభాగ్యమును గల్గి • గర్వమించుకఁబోని గరితమిన్న
భాషించు నేర్పునఁ బ్రౌఢయియ్యునొకింత • పల్కులుతొణకని కల్కిమిన్న
ధనలోపమును లేక డంబమేమియు లేక • వినయంబుఁ జూపెడు వెలదిమిన్న
కోరికలాదవిన నోరిమితోనుండి • సమయానువర్తియౌ చాన మిన్న
క్రోధంబుఁగల్గి తా సాధించుకాలమా • సన్నమైన నుడుగు సరస మిన్న
తనవెంట వరులురాఁ దానదిదెలిసియు • వెనుతిర్గి చూడని విమల మిన్న

తే. గీ॥ మంచిచెడ్డలు గమనించు మందయాన
లాభ నష్టము లేర్పఱచు రాజహంస
లోని యాలోచన నడంచు లోలనేత్ర
పనికి వచ్చును తగనెట్టి పనికినైన॥

సుశీల.—ఎందుకు పనికి వచ్చును?

ఉగ్ర.—తే. గీ॥ పద్దు వ్రాయంగ కనిపెంచ మొద్దు సుతుల.

సుశీల.—ఛీ. ఏమి వికటంబైన సారాంశము! కమలా నీ నాథుడైన నీదుర్నీతుల మాత్రమతని యొద్ద చేర్చుకొనకుము. కృష్ణా, నీ వెట్లుదలంచెదవు. ఇతఁడు వట్టి విపరీతవాదియు దుర్నీతి బోధకుడునుఁ గాడా?

కృష్ణ.—దేవీ! అతఁడు కొంచెము మోటువాఁడు. ఈతని శక్తిచాతుర్యములు విద్య యందు కంటె యుద్ధరంగ మందె దెక్కువ ప్రకాశించును.

ఉగ్ర.—(స్వగతము) అదుగో చేయిపట్టుకొనుచున్నాడు. అట్లే గుసగుస లాడుము. ఇంత చిన్న సాలెగూడులో కృష్ణ నంత పెద్దఈఁగను నే పట్టఁజాలనా? ఆహా! నవ్వు ఇంకానవ్వు. ఈనవ్వే నీయువసేనానిత్వము నూడఁ బెరకును.

(తెరలో బ్యాండు.)

(బిగ్గరగా) అదుగో! సేనాని వచ్చియున్నాడు. ఆయన భేరి మ్రోగుచున్నది.

సుశీల.—పోయి కలిసికొని స్వాగత మిత్తమురండు.

కృష్ణ.—అదుగో! దేవరవారు విజయంబు చేయుచున్నారు.

(పులిందుడును సేవకులును ద్వీపవాసులును ప్రవేశించుచున్నారు.)

పులిం.—ఓ నాసుకుమార మార యోధాగ్రణీ!

సుశీల.—నా ప్రియ నాథా.

పులిందు.—నిన్నిచట గలిసికొనినందుకు నా యానందమున కంతులేక యున్నది. ప్రాణసఖీ,

చ॥ అరయఁగ నెప్పుడీగతి తుపానుల వెంటను శాంతి దోఁచినన్
ధరణి వడంకు నట్లు బెడిదంబుగ మృత్యువునిద్ర మేల్కొనన్
కరువలి వీచుఁగాక ఘన కంధిచరించెడు నావ శీతభూ
ధరపతి శృంగ మెక్కుచుఁ గడంగి రసాతల సీమఁ గూలినన్
కరము సుఖంబు సంతసము క్రమ్ముమనమ్ము ఘనమ్ము కోమలీ.॥

నాయాత్మ యానందంబుతో పరిపూర్ణంబయ్యె. ఇంతకు మిక్కిలి సుఖంబు నా యదృష్టంబునఁ గల్గనేరదు. ఈ ప్రాణమింతటఁ బోయిన నేనెంత సౌఖ్య మనుభవించిన వాఁడ నగుదును!

సుశీల.—దైవము రక్షించుఁగాక. దినదినంబు మన యన్యోన్యాను రాగంబు ప్రవర్థమాన మగుఁగాక!

పులిందు.—ప్రియసఖీ! నా సంతోషంబు వర్ణింప నలవిఁ గాకున్నది. ఇంతట విరమించెద. అగణ్యమైన ఆనందము! మనహృదయంబు లింతకంటె భేదంబు లొందకుండుగాక! (అని ముద్దులు పెట్టుకొనుచున్నాడు)

ఉగ్ర.—(స్వగతము) ఆ. లయపడినది. మీలయ నేఁ దప్పించెద. మీ శ్రుతిసదిరినది. మీశ్రుతి నేనిమిషములోఁ గీడ్పరిచెద.



పులిం.—కోటలోనికి పోవుదమురమ్మ.—మిత్రులారా మేలువార్త. మనయుద్ధములు గడచినవి. తురుష్క సైన్యములు మడిసినవి. ఈ ద్వీపమునందలి నాపూర్వమిత్రుఁడు సుఖంబుగనున్న వాఁడా? ఓమధువా, ఈద్వీపమునందు నీవుకావలసినంతయున్నావు. ద్వీపవాసులందఱును మనయెడల నతిప్రేమగలవారు. ప్రియసఖీ, నే నపూర్వముగ మాట్లాడుచున్నాను. నాయుల్లాస మెక్కువై అతిచిత్రముగ భాషించుచుంటిని. సుజనహృదయా, ఉగ్రా, నీవు రేవుకడకుఁబోయి మన సామగ్రి నంతయుఁ దింపింపుము. ద్వీపయజమానుని కోటయొద్దకుఁ దీసికొనిరమ్మ. అతఁడు గౌరవార్హుండు. సుశీలా, సైప్రసులో మరల భద్రంబుగఁ గలిసికొంటిమి.

(పులిందుడును సుశీలయు సేవకులును వెడలిపోవుచున్నారు)

ఉగ్ర.—నీవు తత్క్షణము నన్ను రేవునొద్దఁ గలిసికొనుము. ఇటురమ్మ. నీవు ధైర్యము గలవాఁడ వేని,—ఏమనగా, నీచులకు ప్రేమ ఆవేశించినపుడు వారికి సహజముగ లేని ధైర్యసాహసములు గల్గునందురు. కావున నామాట వినుము. నేటిరాత్రి యువసేనాని కోటకు కావలియుండఁగలఁడు. మొదట నీకొక్క రహస్యము చెప్పవలసియున్నది. సుశీల అతనిని ప్రేమించియున్నది సుమా!

రుధిరు.—వానినా! చా!చ! ఉత్తది. అసంభవము.

ఉగ్ర.—ఇటుల నోటిమీద చేయి వేసుకొని నే చెప్పిన దంతయు నాలకించుచు నూరకుండుము. నేఁజెప్పినది గ్రహింపుము. లేనిప్రగల్భములుఁగొట్టి, చిత్రయసత్యములనుఁ జెప్పుటవలన పులిందు నామె యెంత తీక్ష్ణముగఁ బ్రేమించెనో జ్ఞాపకము తెచ్చుకొనుము. ఇంకను నట్టి ప్రలాపములకామె ప్రేమించునా? ఆమె కండ్ల కింపుఁ గలుగవలెనా? అక్కరలేదా? ఆదయ్యపు మొగమున కెట్లు సంతోషింపఁగలదు? ఆరంభముయొక్క ఆవేశముకొంత చల్లఁబడినతోడనే, మరల మరల సంతోషంబునఁ బురికొల్పుట కేవియో క్రొత్తరుచులు గలుగవలెనుగదా! చక్కదనములు శుభలక్షణములు మొదలైన వేమియు మూరునకు లేవు. ఈలోపంబులకామె సుకుమారంబు ముఖము మొత్తి మూరునఁ జూచిన నసహ్యించుకొనకుండునా? అది స్వభావసిద్ధము. ఆమెయనురాగము వేరొక యెడకు దిరుగకుండునా? అట్టి ప్రేమకుతగిన యాకారము, మురువు, పదవి, యదృష్టము కృష్ణునికంటె మఱెవరియందు గలవు? పలుప్రసంగములు నేర్చినటక్కరు. పైకి మర్యాదచిహ్నముల ధరించి తన కార్యము చక్కఁబెట్టుకొను దొంగ. సమయమెరిఁగి కార్యానుకూలంబుఁ జేసికొను గజదొంగ. పలువేషములు నేర్చినబానిస. అంతేగాక, పాపియము, రూపము

చమత్కారము, జవ్వనుల నాకర్షించు లక్షణము లన్నియుఁగలవు. అప్పుడే తగినవాఁడు దక్కినాఁడు.

రుధిరు.—ఆమెయం దిట్టి దానిని మాత్రము నేనునమ్మను. ఆమె అత్యుత్తమురాలు.

ఉగ్రు.—ఉత్తమురాలుకాదు! ఉత్తముద్దరాలు! ఉత్తమొద్దురాలు! ఉత్తపనికిమాలినరాలు! ఉత్తజవరాలు! తినునవి పాలు పెరుగు నెయ్యి యన్నమేనా? రక్తంబు క్షీణంబు గాలేదే; యౌవనంబు దరుగలేదే! ఆమె నిజముగ నుత్తమురాలేయైన యెడల మూరు నేలప్రేమించును? ఆమె బుద్ధి చెడిపోయినదని అప్పుడే తెలియవచ్చినది. ఆమె తన కరాంజలి పలుమారు కదలించుట నీవుచూడలేదా?

రుధిరు.—ఆ, చూచితిని. అది గౌరవసూచకంబుగాని వేరొండుగాదు.

ఉగ్రు.—అదియేమాయ! అదియేసంజ్ఞ! అదియే సూచన! దుష్టచింతనంబులకెల్ల ప్రథమాంకంబు! దుర్నీతుల కెల్ల వేగుచుక్క! వారి యొండురుల యుశ్వాసంబులును దగులునంత దగ్గరకు వచ్చిరి. రుధిరా, దురాలోచన లెంతలో నెరుగును? ఈ సామాన్య గౌరవంబులు క్రమంబుగ వృద్ధిఁ జెందిన నింకేమున్నది? పాపంబు వెంటనే పరుగెత్తుకొని వచ్చుట కేమి సందియంబు? ఇస్సీ! నేను చెప్పినట్లు నీవు నడుచుకొనుము. వినీసు నుండి నిన్నిచటకుఁ దీసుకొని వచ్చితిని. ఈరాత్రి నీవు కావలిలో నుండుము. నాయాజ్ఞయిది. కృష్ణుండునిన్నెరుఁగడు. కృష్ణునెట్లయిన కోపావేశుం జేయ వలయును. కేకలువేసిగాని, ఆజ్ఞనుల్లంఘించిగాని, లేక సమయానుకూలంబుగ నేదైన నొక్క కారణముఁ గల్పించుకొని వాని నెట్లయిన సక్రోధుం జేయవలయును. నే నంతికంబు నే యుందును.

రుధిరు.—సరే; అట్లే చేసెదను.

ఉగ్రు.—అతఁడు తొందరవాఁడు. కోపాతిరేకంబున నిన్నుఁగొట్టినఁ గొట్టును. నిన్నుఁ గొట్టునట్లు పురికొల్పవలయును. ఆంతమాత్రముచే నీసైప్రసు ద్వీపము నెల్ల నల్లకల్లోలంబుఁ జేసెదను. మరల కృష్ణుండు తన పదవినుండి దప్పింపబడు వరకు నీ ద్వీపవాసులకు శాంతంబు గలుగ నేరదు. అప్పుడే నీయభీష్టంబునకుఁ దోవదగ్గరఁబడును. దానికి తగిన సహాయంబు నేఁజేసెదను. ఈ యాటంకముఁదొలగింపకుండ మన కార్యంబుల సాధింపఁ జాలము. మనమేలు కలుగ నేరదు.

రుధిరు.— మన కార్యంబున కవసరమైన నట్లే జేసెదను.

ఉగ్రు.—నీవు తప్పక కోటవద్ద కొంచెముసేపుండి నన్నుఁగలిసి కొనుము. నే నిప్పుడు సేనానియొక్క పరికరముల నోడనుండి తీసికొని రావలయును. పోయిరమ్ము.

రుధిరు.—సెలవొసంగుము. (అని పోవుచున్నాడు.)



ఉగ్రు.—కృష్ణుం డామెను ప్రేమించు ననుట నేను నమ్మవచ్చును. ఆమె కృష్ణుని ప్రేమించు ననుమాట నమ్మించవచ్చును. ఆపులిందుడు, నాకెంత మత్సర మున్నను, ఉదాత్తగుణ ధీరుఁడు. నిశ్చలప్రేమాతిశయంబుఁ గలవాడు. సుశీలకు తగిన ప్రాణనాథుండనుటకు సందేహము లేదు. కాని ఈ వికారస్వరూపుఁడీ విదేశీయుఁడు రోమను వనితను పరిగ్రహించి మాకందర కవమానంబుఁ జేసినవాఁడు. అంతే కాక నాయుద్యోగమును కృష్ణుని కిచ్చి నాహక్కును లెక్కఁజేయక నాకు కోపకారణంబుఁ గల్పించినవాఁడు. అయిన నాకు కోపకారణం బెంత కావలయును? వీని సౌఖ్యంబు భంగంబుఁ జేసిన నాకానందంబుగాదా! నాశక్తి చాతుర్యంబులు వానిపై ప్రయోగించుటయే నాకొక వినోదంబు. చూడు నామహిమ! వాని, గాడిదెబోలె ముక్కుఁ బట్టి యాడించిన కొలదిని నన్ను ప్రేమించు, నాకువందనము లర్పించు, పారితోషికంబుల నిచ్చు. ఈ కార్యంబు నెడఁ గూర్చుటకే రుధిరుఁడు నాకు కావలసి వచ్చెను. ఈసారమేయం బలయకుండ వేటందరిమెనేని, ఈకృష్ణసారంగంబు నాకుఁ జిక్కకుండునా? పులిందునితో వీనిఁ గూర్చి కడు నసహ్యమయిన దోషంబు లారోపించి వర్ణించి చెప్పెద. నా పన్నుగడ యింకను తేటపడలేదు. పోయిన కొలదిని స్పష్ట పడగలదు.

## రంగము II. వీధి.

సాటింపు (జనులు శిపాయిలు వెంటవచ్చుచున్నారు.)

దండోరావాడు.—ఆహో! సమస్తమైన వారికిఁ దెలియపరిచే దేమంటే: మన శౌర్యపరాక్రమవంతుండగు పులిందసేనాధిపతిగారిట్లాజ్ఞాపించుచున్నారు. తురుష్కనావలు భగ్నంబులైనవనిఁ దెలియ వచ్చినందున నెల్లవారును విజయచిహ్నంబుల ధరింప వలయుననియు, అంతేకాక, వారి పాణిగ్రహణ మహోత్సవదినంబులు గావున నెల్లవారును వారి యిష్టాను సారంబులైన సంతోషంబుల ననుభవించ వచ్చుననియు ననుజ్ఞ నిచ్చియున్నారు. కొందఱు నృత్యంబున, కొందఱుగానంబున, కొందఱు భక్ష్యభోజ్యంబుల ఎవరికెట్టి యాటల యందభిరుచి గలదో యిట్టి యాటలయందు కాలంబుఁ గడుపవచ్చును. ఈసాయంకాల మైదుగంటలనుండి రాత్రిపదునొకండు గంటలకు తమ తమ యుద్యోగంబులుమాని యథేచ్ఛగ సంచరింపవచ్చును. సైప్రసుద్వీపంబునకు క్షేమంబగుఁగాక! మన సేనాని పులింద మహారాజునకు భద్రంబగుఁగాక!

(అందఱు వెడలిపోవుచున్నారు.

## రంగము III. భవనమునందొకహాలు.

(పుళిందుడు, సుశీల, కృష్ణుడు, సేవకులు ప్రవేశించుచున్నారు.)

పుళిం.—కృష్ణా, నేటిరాత్రి నీవు కావలియందప్రమత్తుండవై యుండవలెను. మన సైన్యమునకంతకు సెలవొసంగితిమి. నీవు జాగరూకుడవై యుండవలెను. మన యుత్సవంబు వివేకము నతిక్రమింపగూడదు సుమీ. మిత మెరిఁగి వర్తింప వలయును.

కృష్ణ.—ఉగ్రుండంతయు చక్కఁగ నెరింగినవాఁడు. అయిన నేనును పై పరామఱిక సేయుచుండెద.

పుళిం.—ఔను, ఉగ్రుఁడు బహుమంచివాడు, విశ్వాసపాత్రుడు. కృష్ణా, నీతో కొన్ని సంగతులు చెప్పవలసియున్నవి, ఉదయముననే కనుపడుము. ప్రియసఖీ, రమ్ము.

(పుళిందుడును, సుశీలయుఁ బోవుచున్నారు.)

(ఉగ్రుడు ప్రవేశించుచున్నాడు.)

కృష్ణుడు.—ఉగ్రా, మనము కావలియందు జాగరూకులమై యుండవలెను.

ఉగ్ర.—యువసేనానీ, ఇప్పుడుకాదిప్పుడుకాదు. ఇంకను పదిగంటలైనఁగాలేదు. మన సేనాని సుశీలమెడ ప్రేమాతిరేకంబున మనల శీఘ్రుంబుగ వదలిపెట్టిపోయినాఁడు.

కృష్ణ.—ఆమె పరమసాధ్వీమణి సుమీ !

ఉగ్ర.—ఆమె బహుచిత్రవిచిత్రమైన మనిషి. బహుతమాషాస్త్రీ.

కృష్ణ.—నిజముగ నామె నవసుకుమార సుందరియే.

ఉగ్ర.—ఆమె గొప్ప కనులెట్టి వానినైన శాంతచిత్తునిఁజేసి వశపర్చుకొనుసుమీ.

కృష్ణ.—అట్టి ఆకర్షణామె కనులందు గలమాట సత్యము. ఆ కరుణాకటాక్ష వీక్షణంబులెట్టి దుర్జనునినైనను సుజనుంజేయఁజాలుననుట కేమిసందియంబు?

ఉగ్ర.—ఆమె మాటాడునపుడెల్లను కుసుమాయుధుండు గుణటంకారముఁ జేయునట్లుండునుసుమీ.

కృష్ణ.—ఆమె సర్వవిధంబుల పూజ్యార్హాలైన దేవత.

ఉగ్ర.—మంచిది, వారికి శుభమగుగాక! రమ్ము, యువసేనానీ, రమ్ము. నాయొద్ద మంచి ద్రాక్షరసంబుగలదు. వెలుపల నిద్దఱుసైప్రసు యోధులు వేచియున్నారు. మన



తోఁగూడఁగలిసి పుళిందుని యాశీర్వదింపుచు మధుపానంబుఁజేయ నిచ్ఛగించియున్నారు.

కృష్ణ.—ఈరాత్రికాదు. నన్ను విడువుము. ఉగ్రా, నన్ను క్షమింపుము, నాకుత్రాగుడలవాటులేదు. నేనిలువలేను. మనమర్యాదలం దీ దురాచారమునుఁ దీసివేసి మరియొకయేర్పాటుఁజేసిన బాగుండుననిఁ దలంతును.

ఉగ్ర.—నీ వట్లనఁగూడదు. వచ్చినవారు మనస్నేహితులు. పెద్దమనుష్యులు. శూరులు. కొంచెము తీసికొనివచ్చెదను. ఒకగ్లాసే పుచ్చుకొనవచ్చును. వారి నగౌరవింపఁ గూడదు. నీబదులు నే తక్కినవి పుచ్చుకొనెదను. రమ్ము.

కృష్ణ.—నే నప్పుడే యొక గ్లాసు పుచ్చుకొన్నాను. అది అప్పుడే నన్నెంత మార్చెనో చూడుము. నామతి అప్పుడే కొంచెము చలించినది. నాదురదృష్టమున నాకీ నీరసముగలదు. ఈ నీరసము నిఁక శోధింపఁగూడదు.

ఉగ్ర.—ఏమిటి? ఈవరకు నీ వెంతఁ జెప్పినను వినకున్నావు? నేటి రాత్రి గొప్ప యుత్సవము. ఆ యోధు లించుకసేపు సంతోషంబునఁ గాలంబుఁ గడుపఁ గోరుచున్నారు.

కృష్ణ.—వారెచ్చట నున్నారు?

ఉగ్ర.—ఇదుగో ఇచ్చటనే ద్వారమున వేచియున్నారు. నా ప్రార్థన నంగీకరించి లోనకుఁ బిలువుము.

కృష్ణ.—పిలిచెదనుఁగాని నామన సొప్పక యున్నది. (అని వెళ్లుచున్నాడు.

ఉగ్ర.—ఈ వఱకప్పుడే యొక గ్లాసునుఁ ద్రాగియున్నాడు. దానిపై నింకొక గ్లాసు వేయించితినా, వీడు కాట్లకుక్కవలె కజ్జాకు కాలు ద్రువ్వును. ఇఁక మా బుద్ధిహీనుఁడు రుధిరుఁడు ఉండనే యున్నాడు! సుశీలమీఁది మోహంబున మనిషి తలక్రిందై యున్నాడు. సుశీలనుఁ దలచి తలచి తదేకనిష్ఠగా త్రాగి యున్నాడు. వీడు కూడా కావలి యందుండును. సైప్రసు ద్వీప వాసులగు మువ్వురు యౌవనులు, శూరులు, ధీరులు, పౌరుషవంతులు, తమమానముకెడ నసమాన గౌరవముఁ గలవారిని నే నీ రాత్రి విపరీతముగ త్రాగించి మత్తెక్కించెదను. వీరందఱు కావలి గాయుదురు. ఈ త్రాగు బోతుల మధ్య కృష్ణుని విడిచి కొంచెము గదలించవలెను. పట్టణము కల్లోలముఁ గాకుండునా? అదుగో వారును వచ్చుచున్నారు. నాపన్నుగడ సఫలమైన, గాలి వాలుఁగూడ నా కనుకూలమైన నా బోటు రయ్యున నిరాటంకముగ గమ్యంబుఁజేరదా?

(కృష్ణుఁడు మదనుఁడు మరికొందఱు పెద్ద మనుష్యులును—ద్రాక్షరసమునుఁగొని యొక సేవకుఁడును ప్రవేశించుచున్నారు)

కృష్ణ.—దైవమాన! అప్పుడే నా కొకసాఱి ఇచ్చినారు.

మద.—అబ్బే! కొంచెము. నామాటఁదీసివేయవద్దు. కొంచెము, ఎంతోలేదు. ఈ ఒక గ్లాసే. మనము యోధులము ఒకరి నొక రిట్లవమానించు కొనఁ గూడదు.

ఉగ్ర.—హా! హా! హా! తీసికొనిరండి. (చేతిలో నొక గ్లాసుపుచ్చుకొని

చ॥ తనువది బుద్బుదంబు సుభ టాళికి ప్రాణము నేఁడో రేపనన్
దినమొక గండమయ్యె తగుదీవనఁబల్కుచుఁ ద్రాగుడీసురన్
మనమున సందియంబు ననుమానముమాని సుఖంబునొందుఁడీ
దినకర ప్రాభవంబు మతి దైన్యహిమంబు కరంచి మేలగున్॥

సేవకా, మధురస మింకను గొనివచ్చి అందఱకిమ్ము.

(అందఱు మరల నొక్కొక్క గ్లాసు చేతులో బట్టుకొనుచున్నారు)

క॥ సురత్రాగుటచే నమరులు
సురలయి వెలసిరి కరము యశోశోభితులై
ధరనెట్టివారిని సురయె
దరిఁజేర్చును క్లేశ జలధి దార్కొని నపుడున్.॥

అందరు.—హోయి! హోయి! (అని త్రాగుచున్నారు)

కృష్ణ.—బహు బాగున్నది. మంచిపద్యము!

ఉగ్ర.—నే నిది హిందూస్థానములో నేర్చుకున్నాను. ఆదేశంబున మధ్య నే శాఖలును లేక ఓకటే విధముగ నాకాశంబులోని కెదిగి సామాన్యమానవుల కలవి గాకుండ నుండు వృక్షంబులుగలవు. చతురులగు నొక వర్ణంబువారు మాత్రము చెట్లపై కెగఁబ్రాకి దేవతల యమృతంబోయని నట్లాదివ్యమైన రసంబుఁదెచ్చి మానవులకిచ్చి స్వల్పకాలంబు స్వర్గలోకజ్ఞానంబుఁ గలుగఁజేసి తద్దేశీయుల కృతజ్ఞతకుఁ బాత్రులగుదురు. భూలోకకల్పవృక్షంబులని బొగడొందునావృక్షంబులు హిందూదేశంబున బహుళంబుగనుండును. కావుననే వారును తమదేశం బన్నిదేశములకంటె నుత్కృష్టంబనియెంచి విఱ్ఱవీగుచు తమదేశంబు నెడఁబాసి యొక నిమిషంబైన నుండఁజాలరు.

కృష్ణ.—ఆదేశమువారు త్రాగుడునందు ప్రవీణులేనా?



ఉగ్ర.—కాదు, కాదు, వారట్లు సురసముద్రంబున మునిఁగి దేలుచున్నను ప్రావీణ్యంబునఁ దక్కిన దేశస్థులతో సాటిరారు. త్రాగుడునందు ఆంగ్లేయునిఁజెప్పి మఱెవరినైనఁ జెప్పవలయును. హిందూదేశీయుఁడొక గ్రుక్కెడుత్రాగి క్రిందపడి దొర్ల నారంభించును. డచ్చివాడు గ్రుక్కుచున్నను, డేను డొగర్చుచున్నను, ఆంగ్లేయుఁడింకను చలనములేకఁ ద్రాగుచునేయుండును సుమీ! అందుచేతనే వీరు దేశదేశములందును ముందు ప్రఖ్యాతిగాంచఁగలరని యొకభవిష్యత్తు గలదు.

కృష్ణ.—మనసేనాధిపతికి కుశలంబగుఁగాక! (అనిపుచ్చుకొనుచున్నాడు.)

మదనుడు.—యువసేనానీ, నేను నిన్న గౌరవపఱచను. ఇదుగో, నేను నిన్న గౌరవపఱచను. ఇదుగో! నేనుఁగూడ పుచ్చుకొనుచున్నాను.

ఉగ్ర.—చ॥ ఇనసముపార్జితంబు కమనీయవినిర్మిత కాయమాన శ
య్యను ప్రమదాను వర్ధిత మనన్య విలాసిని హస్తపోషితం
బనుపమ రాగరక్తిమశుభంబులు గుల్కెడుమందహాసముల్
మనమును హెచ్చరించు గరిమంబిది ద్రాక్షరసంబుగ్రోలుడే॥

కృష్ణ.—ఇదిమొదటికంటెనుఁ జమత్కారంబుగ నున్నదోయి.

ఉగ్ర.—మరల పాడుదునా?

కృష్ణ.—అయ్యా, వద్దు, వద్దు, ఈకార్యంబులు సేయువారీ యుద్యోగమున కర్హులుగారు. మేలు మేలు, పైనదైవమున్నాడు. కొన్నియాత్మలు స్వర్గంబుచేరును. మరి కొన్ని నరకంబునఁగూలును. (తూలిమాట్లాడుచున్నాడు.

ఉగ్ర.—యువసేనానీ, నిజము నిజము. వహవా, వహవా.

కృష్ణ.—నామటుకు నేను-సేనానికిగాని మరి యే గొప్పవారికిగాని యపరాధము గాదు. నన్నీశ్వరుడు క్షమించుఁగాక!

ఉగ్ర.—నేనుఁగూడ నట్లే దలంచెదను.

కృష్ణ.—అయ్యా, ఇకనూరకొనుడు. నాసముఖమున నట్లు చెప్పవలదు ఆ! ఆ! యువసేనాని, సేనానియనుచరుని ముందుక్షమింపవలయునా? చాలు, చాలు నిఁక నిది చాలింపుదము. పాపముశమించునుఁగాక! పాపముశమించునుగాక! మన పనులనుచూచుకొందము రండు. సజ్జనులారా, మనయుద్యోగముల కేగుదము రండు. సజ్జనులారా, నేను త్రాగియొడలెరుంగకున్నానని దలంపకుడు. అదుగో ఇతడు నా అనుచరుడు. ఇదినాకుడిచేయి. ఇదినాయడమ చేయి (అని తప్పుగా చూపించు

చున్నాడు) నేనిప్పుడు త్రాగియున్నానని ఎ-ఎవరనగలరు ? నేను తి-తిన్నగ-ని ని-నిలువగలను, చక్కగ మాట్లాడగలను.

అందరు.—వహవా! వహవా!

కృష్ణ.—అటులైన నేను త్రాగియున్నానని మీరు దలంపఁగూడదు.

(నిష్క్రమించుచున్నాడు.

మదనుడు.—వేదికపై నెక్కుడు. భటులారా. కావలి కాయుదమురండు.

ఉగ్ర.—క॥ మనసస్సుఖమున నేగిన

సేనుజాఁడు సుభటుండు చూడు మాన్యుడు మదనా
మొనలను భీష్మునిప్రక్కను
మనుపఁగ సమర్థుడతఁడు మత్తిలకున్నన్

ఉ॥ దయ్యపు మద్యపాన మిక డగ్గరి మస్తక మల్లఁ బట్టి తా
నయ్యెల లూపకున్న నతఁ డూర్జిత సత్వ డహోనిశల్
ముయ్యెకకంటిరెప్పతప మూనినభంగి తదేక నిష్ఠతో
కయ్యము సొంతమౌదనుకఁ గావలిఁ గాయు వివేకచిత్తుడై.॥

మదను.—మన సేనానికీ లోపంబు నెరిఁగించిన మే లేమోనని దలంచెద. బహుశః ఆయన దీనిని జూచి యుండడు. ఒకవేళ ఆయన సత్స్వభావంబు కృష్ణుని సుగుణంబులనే లెక్కించి, దుర్గుణంబులను పాటింపకుండె నేమోగదా ! నిజమై యుండునా ?

రుధిరుడు ప్రవేశించుచున్నాడు.

ఉగ్ర.—(దూరముగ వానితో బోయి) ఏమి? రుధిరా, యువసేనాని వెంట నంటి బొమ్ము. నామాట విని త్వరితముగఁ బొమ్ము.

(రుధిరుడు బోవుచున్నాడు)

మదను.—ధీరుండగు మీరు, తన సహాయసేనానిగా, నిట్టి జీర్ణ దుర్గుణంబు గలవాని నెన్నుకొన్నవాఁడు. మీరు నకీ సత్యంబుఁ దెలియ పరచు టెంతయు నుచితంబుఁగాదే?

ఉగ్ర.—అబ్బబ్బా! నేను మాత్ర మాపనినిఁ జేయఁజాలను. నాకు కృష్ణుండు పరమ మిత్రుండు. అతని నీ దోషంబు నుండిఁ దప్పింప నా సర్వశక్తులఁ బాటుపడుదునే గాని—అదుగో ! నేమియోకలకలము విన వచ్చుచున్నది.

(తెరలో కలకలము)



తెరలో (అరెరెరె రక్షింపుడు రక్షింపుడు ఆ, ఆ, రక్షింపుడు రక్షింపుడు)

(రుధిరుడు పరుగెత్తుకొనివచ్చును. కృష్ణుడు తఱుము కొనివచ్చును)

కృష్ణ.—అరే, దుష్టా, తులువా, నీచా.

మదనుడు.—(దగ్గరకుఁ బోయి) యువసేనానీ, యువసేనానీ, ఏమిటది?

కృష్ణ.—ఈ అధముఁడు నా కుద్యోగధర్మంబును బోధింప సాహసించుచున్నాడు! వీని యొడలి నారతీసి యారవేసెదను.

రుధిరు.—ఆ. ఆ. నన్నుఁగొట్టెదవా ? ఊ ! చూడు.

కృష్ణ.—ఇంకను వాగెదవురా? తుచ్ఛా ! (రుధిరునిఁ గొట్టబోవుచున్నాడు)

మదనుడు.—అయ్యా, కొంచెము శాంతింపుము. యువసేనానీ, వద్దు వద్దు. ఊరకుండుము. (అవి అడ్డముఁబోవుచున్నాడు)

కృష్ణ.—ఓరీ, నన్ను వదలిపెట్టు : లేనియెడ నీతల పగుల నేసెదను.

మదను.—నిలునిలు ! నీవు త్రాగి యొడలు మరచి యున్నావు.

కృష్ణ.—త్రాగియున్నానా ? (అని యిద్దఱునుఁబోరుచున్నారు)

ఉగ్ర.—(రుధిరుని వేరుగాఁబిలచి) వెంటనేపోయి తిరుగఁబాటు జరిగినదని కేకలిడుము.—గంట వాయింపుము.

ఉగ్ర.—(మరలవచ్చి) అయ్యో ! అక్కటా ! ఏమి యువసేనానీ, ఆయ్యో! సజ్జనులారా ! అహో, రక్షింపుడు రక్షింపుడు. అయ్యా, యువసేనానీ, అయ్యా, మదనా, ఏమండోయి, ఓ సజ్జనులారా ! రక్షింపుడు రక్షింపుడు. కావలి బాగుగనే యున్నది! మహా బాగున్నది! (గంటమ్రోగుచున్నది) ఎవ రా గంటవాయించెడువారు? ఏమీ గందరగోళము ! ఏమి ప్రళయమువచ్చినది? ఓహో పట్టణమంతయు కల్లోలమగుచున్నదిగదా! ఛీ! ఛీ! యువసేనానీ, ఆగు! శాశ్వతముగ నవమానము పాలగురుదుగదా !

(పుళిందుడును సేవకులును ప్రవేశించుచున్నారు)

మదను.—(కిందపడి) హా! నాకు దెబ్బతగిలినది. ఇంకను రక్తము కారుచున్నది. వఱదవలె బారుచున్నది. హా! నేచచ్చిపోవుచున్నాను.

పుళిం.—ప్రాణంబులపై నాశలున్న చాలింపుడు.

ఉగ్ర.—ఓ యువసేనానీ, ఆగు, అయ్యా మదనా! సజ్జనులారా ! దేశకాలపాత్రంబుల మరచి వివేకశూన్యులై యిట్లు వర్తించుచున్నారు. అయ్యా, చాలింపుడు. సేనాని పల్కుచున్నాడు. అపకీర్తి పాలుగాకుడు. ఇకఁజాలింపుడు.

పులిం.—ఏమి, దీనికి గతంబేమి?

క॥ చాలింపుడు వైరములిఁక
కేలెత్తినవానిశిరము క్రిందనె వ్రాలున్
చాలింపుడు ఆనాదము
దోలించెడు ద్వీపజనుల దోష్మికరపున్॥

చ॥ కరుణసముద్రుఁడై మనలఁగావఁగ దైవము శత్రువీరులం
దఱను సముద్రమందు బడఁద్రద్దయుఁజేయఁగ మీకు మీఱె పా
మరత తురుష్కులై మిగుల మారణ కర్మలఁ జేయనెంచిరే
శిరములు వంచనాపనులు చేయుటకెట్లు సహించిరోఁగదా॥

యదార్థవాదియగు సూరాయుగారి, నీ వతిఖిన్నవదనుండవై నూచున్నావు. నిజముచెప్పుము. ఈయల్లరి నెవరుప్రారంభించిరి? నాయెడగల స్నేహంబును మదినుంచుకొని యథార్థంబు వల్కుము.

ఉగ్ర.—నాకేమియుఁదెలియ రాకున్నది.

ఉ॥ ఇప్పుడె మిత్రులట్లుఁగడునింపుఁదలిర్పఁగ బల్కరించుచున్
మెప్పుగ నిద్దపై దంపతుల మీఱిచరించుచు నంతలోనె యే
తప్పుఘటించెనో గ్రహముదారొకని బుద్ధిఁగలంచెనోయనన్
కప్పులదూసి కత్తులను క్రౌర్యముఁజూపుచు డాసిరప్పుడే॥

మఱియు.

క॥ తలతోక గానిపించదు
కలహంబును గలిగె వట్టి గాలిని వినుమా
తిలకింప నన్నుఁదెచ్చెను
కలిప్రేరణమున పాపికాళ్లిచ్చటికిన్॥

పులింద.—కృష్ణా, నీ విట్లొడలు మరచినందుకు కారణమేమి?

—(తలవంచుకొని) అయ్యా, క్షమింపుడు. నేనిప్పుడొక్కమాటైనఁజెప్పఁజాల.

ఘ.—క॥ మదనా, బహువిధ సహానా
బుధజననుత నయవినయ విభూతి విశాలా
వదలుచు సన్మార్గమిటుల
సిథిలము గౌరవభవనము సేయఁగనేలా?



నీకున్న పేరు ప్రఖ్యాతులనెల్ల నొక్కమారుగా బోఁగొట్టుకొని రాత్రించర నామధేయంబునుఁగొని తెచ్చుకొంటివేమి?

మదను.—మహానుభావుండవగు నోపులిందసేనానీ, నాకు గాఢమైన గాయంబుఁదగిలి ప్రాణావశిష్టుడనై యున్నాను. కాన నేనేమియుఁ జెప్పుకొనఁ జాలని యవస్థయందున్నాను. నిష్పక్షపాతియు, సూనృతవాదియు, నగు నుగ్రుండు మీకది సవిస్తరంబుగ విన్నవించఁగలడు. నేనాత్మ రక్షణకంటె నెక్కువకుఁ గడంగియుండలేదు. ఇక నాత్మరక్షణమే తప్పయినచో నేనుడువఁజాల.

పులిందు.—ఉ॥ దేవునియాన! నాయొడలు తీక్షణవహ్ని దహించుచుండె నా
సేవనుఁ దప్పి క్రోధమికఁ జెచ్చెరనాయజమానియయ్యె నా
భావమునందు సేతువికపాలనఁసేయదు చేయియెత్తి నే
నేవగశిక్షఁజేసినను నీరసమౌందెడు మేటిఁగూడ మీ
లో వశీ జెప్పరేని యికనోర్తునె చెయ్దిము లిట్టివానికిన్?॥

ఉ॥ యుద్ధముతిన్నగా ముగియ దూరి ప్రజల్ భయమందుచుండ కో
పోద్ధతి కెక్కి మైమరచి పోరులు సల్పుట లింకెలోనె? యీ
పద్ధతి యర్ధరాత్రమున బాధ్యతమోసెడువారె కావలిన్
శ్రద్ధవహించువారలె విచారణఁ జేయరు ఘోరమయ్యయో!॥

ఈ యపరాధంబుఁజేసిన వాడెవ్వడో నాకుఁ జెప్పిన, వాడు నా తోడి కమల వాఁడైన నావలన శిక్షింపఁబడును. ఉగ్రా, దీని నారంభించిన దెవ్వరు?

మదనుడు.—కృష్ణుని తోడియుద్యోగస్థుడవని గాని, స్నేహితుడవనిఁగాని నీవు సత్యంబునకు లేశం బెచ్చుతగ్గుఁ జెప్పిన సుక్షత్రియుండవుగావు సుమీ!

ఉగ్ర.—ఉ॥ ఏమిటికంతయాన! చను నే? ప్రియుకృష్ణునిహానిసేతునే?
క్షేమముఁ గోరుదాతనికి జింహ్వానెకోసికొనంగ నిత్తునే
నేమియుఁగీడుఁబల్క గమనింతును సత్యమదేల యొట్టు? న
న్నేమియు నిందసేయకుడు నేనిపుడిట్టి యవస్థఁ జిక్కితిన్॥

సేనానీ, యిదియెల్ల నిట్లుసంభవించెను.

నేనును మదనుడును మాటలాడుచుండగ నెవ్వరోయొకఁడు 'రక్షింపుడు రక్షింపుడ'ని యిటుల పరుగెత్తికొనివచ్చెను. వాని వెంట కృష్ణుడు క్రోధావేశుండై తన ఖడ్గంబుతో వానిఁగొట్ట నుద్యోగించి వచ్చెను. అంతట నీసజ్జనుఁడు కృష్ణునిముందు నిలచి

శాంతిరప్పు వేడుకొనెను. నేనాకేకలువేయుచు వచ్చినవాడు పట్టణమంతయు నల్ల కల్లోలముఁ జేయునేమోయని వానివెంబడించితిని. వాఁడును నాకంటె తీవ్రంబుగ బరుగెత్తి నన్నుఁదప్పించుకొని పాఱిపోయెను. నేనింతలో వీరిఖడ్గంబుల ధ్వనివిని పరువెత్తి వచ్చితిని. కృష్ణుండు పరవశుండై శపథంబులఁజేయుచు సమరోత్సాహంబున నున్నవాఁడు. నేనిదివరకెన్నడు నిట్టిస్థితియందాతనిఁ జూచియుండలేదని చెప్పఁగలను. మీరు వచ్చి విడఁదీయునప్పటి స్థితియందు వారిని నేఁ జూచితిని. ఇంతకంటె నేనెక్కువఁ జెప్పఁజాలను. మనుజులలో లోపములేనివారుగలరా? ఎంతమంచివారి కొకానొక సమయంబున మైమరపు గలుగకుండునా? కృష్ణుండాతని నొప్పించియున్న నేదో యొక యవమానం బాతనికి జరగకున్న నిట్టి విపరీతకార్యము సంభవింపదని నా నమ్మకము.

పులింద.—ఉగ్రా, నాకర్థమైనది. నీయదార్థవాదిత్వమును, నీప్రేమయు కృష్ణుని యపరాధమును సంక్షేపముగ తేల్చిబలుకుచున్నది. కృష్ణా, నీయెడనాకు ప్రేమయేగాని, ఇంతటినుండి నాయుద్యోగస్థుడవుగ మాత్రముండకుము. నాప్రియసఖికి నిద్రాభంగము కాలేదుకదా! పలువురకుదాహరణంబుగ నిన్ను శిక్షించెదను.

సుశీల.—ప్రియనాథా, ఈకలవరమేమి?

పులింద.—ప్రేయసీ, అంతయు చక్కనైనది. పోవుదమురమ్ము. అయ్యలారా, మీగాయములకు నేనచికిత్సఁజేసెదను. అతనినిఁ దీసికొనిపొండు. ఉగ్రా, పట్టణమంతయును జాగ్రతగఁ గనిపెట్టియుండుము. ఈగంద్రగోళమువలన కలవరపడిన జనులను శాంతిపరుపుము. సుశీలా, రమ్ము.

తే. గీ॥ భటునిజీవంబు బహుదుఃఖ భాజనంబు
భద్రనిద్రల కలహముల్ భంగపరచు

(అని నిష్క్రమించుచున్నారు.)

(కృష్ణుడు, ఉగ్రుడు, తప్ప తక్కినందరు పోవుచున్నారు.)

(కృష్ణుడు తలవంచుకొని స్తంభమునానుకొనియుండును.)

ఉగ్ర.—యువసేనానీ, నీకేమైన హానిగల్గెనా?

కృష్ణ.—అహా! ఈహాని కిఁక చికిత్సలేదు.

ఉగ్ర.—దైవము రక్షించుగాక!

కృష్ణ.—అహా! పేరు! ప్రతిష్ట! గౌరవము! హా నామానంబు ఖిలంబైనది. నాశాశ్వతభాగంబు నాశనమైపోయెను. ఇక నిలచినదంతయు పశుత్వము. ఉగ్రా, నాకీర్తి! నాయశస్సు!



ఉగ్ర.—నేను యదార్థముగా నీ కాయంబునకు గాయంబుఁదగిలినదని యనుకొంటిని. అటులైన కొంచె మర్థమున్నది. ఇకకీర్తిబోయిన దన్న నేమి? కీర్తిగౌరవంబులు వట్టిబూటకము. అర్హతలేనిచో నవిలంభించును. ఉన్నచో నవియుండవు. నీకిప్పుడేమి గౌరవహానిగల్గినది? నీయంతట నీవట్లు దలంచినఁగాని నీకు గౌరవహానియేమియున్నది? ఏలనీకీచింత? నీవిప్పుడు సేనానియొక్క శీతలకటాక్షంబున కొంచెము గ్రుక్కితివికాని నీయెడల నతనికి విరోధభావంబుగలదా? తక్కినవారందఱకును బుద్ధిరాఁగలందులకు నిన్నుకొంచెము శిక్షించెను. నీవు మరలఁ బ్రార్థించిన నెప్పటియట్ల మరల నీవాడేయగును.

కృష్ణ.—అట్టి ఉదారశీలుఁడగు సేనానిని నేనుత్రాగి మత్తెక్కి యొడలెరుంగక యవివేకినై మోసపుచ్చుటకంటె చివాట్లు పెట్టఁబడుటకే నేను బ్రార్థించెద. త్రాగి, మదించి, పిచ్చికూతలఁగూసి, నోటికివచ్చిన ట్లెల్లనరచి, యెగిరిపడి, ప్రమాణములు చేసి, నీడతో నాపోట్లాడుటా! యవాగ్మనసగోచరంబగునో మధుపానమహాశక్తీ! నీకేపేరు పెట్టవలెనో దెలియరాకున్నది.

ఉగ్ర.—అయితే నీవు తఱుముకొని వచ్చిన యాదుష్టుఁడెవ్వఁడు? అతఁడు నిన్నేమి చేసెను.

కృష్ణ.—నాకేమియును తెలియదు.

ఉగ్ర.—ఏమియు తెలియదా! అదిసంభవమా?

కృష్ణ.—నాకేమియో కలవరముగనున్నది ఏదియు స్పష్టముగ జ్ఞాపకములేదు. ఏదియో జగడము. ఎందుకో తెలియదు. ఓదైవమా! మనుజులు తమ బుద్ధిని దొంగిలించుటకు దొంగను వదనగంహ్వరము ద్వారా లోనకు చేతులారఁబంపుకొనుచుందురే! ఒక్కనిమిషములో పిచ్చిసంతోషమున గంతులుతక్కి పశుప్రాయులగుచుందురే! ఎంతయన్యాయము!

కృష్ణ.—నీవిప్పుడు బాగుగనుంటివే! నీవింతలో నెట్లు స్వస్థుడవైతివి?

కృష్ణ.—ఆ మత్తురాక్షసివదలి ఈక్రోధపిశాచమును ప్రవేశపెట్టినది. ఒకదయ్యమువదలి మరియొకదయ్యము నన్నావహించి నన్నతిహేయునిగాఁ జూపించుచున్నది.

ఉగ్ర.—చాలు! చాలు! నీవు బహు లావు నీతులు ప్రసంగించుచున్నావు. దేశకాలపాత్రంబులను బట్టి ఇట్టిది సంభవించుటంత యుత్తమమనిఁదలంచనుఁగాని ఇఁక గతజాలసేతుబంధనమేల? అయినదేమో అయినది. దీనినిప్పుడు బాగుఁచేయుటకే ప్రయత్నింపవలెను.

కృష్ణు.—నేనుమరల నా యుద్యోగము నిమ్మని ప్రార్థించెదను. నేను త్రాగుఁబోతునని ఆయన సెలవిచ్చెను. నా కాదిశేషువకున్న సహస్రజిహ్వాలున్నను ఆమాటయొక్కటి వానిసన్నిటి బంధించివేయును. ఇప్పుడు తెలివిఁగలిగియుండి ఇంతలోఁ దెలివిఁదప్పి, ఇంతలోనె మృగమైవర్తించుట ! ఆహాహా ! ప్రతిగ్రుక్కెడు మధురసము నొక్కొక్కదయ్యముగఁ బరిణమించెను గదా!

ఉగ్ర.—చాలు! చాలు! ఇకచాలు! ఉపయోగింపవలసిన రీతిగ నుపయోగించిన యెడల దానియంత మనోజ్ఞమైన వస్తువున్నదా? ఇకదాని ననవసరముగ నిందింపకుము. యువసేనానీ! అయితే నేను నిన్ను ప్రేమింతునని నీవుదలంతువని నే దలంచెదను.

కృష్ణు.—ఆహా! సందేహమేమి? హా! నేను త్రాగుబోతునైతినిఁగదా!

ఉగ్ర.—ఓ కృష్ణా, ఇకనూరకుండుము. ఇకచాలింపుము. నీవుగాని మరియెవ్వరుగాని జన్మలో నెప్పుడైన త్రాగియుండవచ్చును. నీకేమి చేయవలెనో నేచెప్పెద వినుము. మనసేనానియొక్క భార్య ఇప్పుడు సేనానిపై సేనానియై యున్నది. అతఁడామె సుగుణసౌందర్య విలాసంబులపై వలపుందగులుకొని అత్యంతానురాగియై యున్నాడు. ఆమెయెడకుం జని నీకష్టంబులనెల్ల స్పష్టంబుగ విన్నవించుకొనుము. ఆమెను ప్రార్థింపుము. ఆమెపుళిందుని నీయెడ ప్రసన్నుఁడగునట్లు చేయగలదు. ఆమె యెట్టి దయాదార్యస్వాంతురాలనగా, నామె నడిగిన దానికంటె నెక్కువ యుపకారంబుఁ జేయకుంట పాపంబుగ పరిగణించును. నీకును సేనానికిని విరిగిన నీ స్నేహంబును మరల కట్టుగట్టి మాన్పఁగలదు. మీస్నేహంబు మరల గలసెనేని తొల్లింటికంటె దృఢతరంబుగ నుండును సుమా!

కృష్ణు.—నీయుపదేశంబు కడులెస్సగనున్నదోయి.

ఉగ్ర.—యదార్థంబుగ నాకు నీయెడల గల ప్రేమాతిశయంబుచే నిట్టి యుపదేశంబునుఁ జేసితిని.

కృష్ణు.—నేను నిశ్చయముగ నట్లేదలంచెదను. ఉదయమున నేగి యా సుగుణవతియగు సుశీలను ప్రార్థించెదను. నాయదృష్ట మక్కడఁగూడఁ దప్పెనేని ఇక నా యాశ నిరాశయే.

ఉగ్ర.—నిజము, యువసేనానీ, నాకు సెలవిమ్ము. నేను కావలిలోనికిఁ బోయెదను

కృష్ణు.—మంచిది, ప్రియమిత్రమా (కృష్ణుడు పోవుచున్నాడు.)

ఉగ్ర.—హా! హా! హా! హా! నన్నెవడు ఖలుడని పిలువగలడు? నన్నెవడు దుర్మార్గుడని పిలువగలడు. హా! హా! హా! హా! ఏమి? నేనిచ్చినయుపదేశంబు ఎట్టి బుద్ధిమంతునకైన



యదార్థంబుగఁ దోచునదియే. సేనానియగు మూరునెట్లు అనుగ్రహాంతఃకరణునిఁ జేసికొనవలెనో ధారాళంబుగ నెవ్వరైన చెప్పు యుపదేశంబునే నేనును జేసితిని. దయాశీలయగు సుశీల నెవ్వరైన ధర్మకార్యంబునం దాసక్తురాలుగ సులభంబుగఁ జేసుకొనఁగలరు గదా! ఇక నామె పుళిందుని వశముఁ జేసికొనుటకేమి ఆయాసముఁ గావలెను? ఆమెయెడల మోహపాశంబుఁ దగులుకొనిన యాపుళిందుడు యామె యిష్టప్రకారము, చేదు తీపి, తీపిచేదుగ గ్రహించును. ఇక నేనెట్లు దుర్మార్గుడను? కృష్ణునకు తనకార్యమునుఁ గట్టెకించుకొనుటకు సరియైన మార్గమును నేను చూపించితినా లేదా? హా! హా! హా! హా! దుష్టరాక్షసులు ఘోరపాపంబులుఁ జేయఁదలచినపుడు కామరూపంబున గంధర్వవేషంబుల ధరింతురుగాదె? ఆహాహా! నాకు తెలియును. ఈతెలివి తక్కువ బోళాపోయి యాసుశీలను తనను రక్షింపమని ప్రార్థేయపడ నామెమూరుతో నితనిపక్షమున గట్టిగ వాదింప నేనేమి చేయుదును? ఈకాలకూట విషంబు వాని చెవిలో పిండుదును. ఆమె కృష్ణునిపై మోహాతిరేకంబున నిట్లు బలుకుచున్నదని చెప్పెదను. అట్లామె యదార్థం బయదార్థంబుగా, ఆమె సౌశీల్యంబు దుశ్శీలంబుగ నేను చేసెదను. ఆ హ హ హ! ఈ చాపల నన్నియు నొక్కవలలో పట్టివేసెదను. చూడు నా ప్రభావము. హ హ హ!

(రుధిరుడు మరల ప్రవేశించుచున్నాడు.)

ఉగ్ర.—ఏమోయి రుధిరా, ఏమిపని?

రుధిర.—నే నీవేటలో పరుగెత్తి ఆయాసపడుటయేగాని నాకేమి ఆహార మిందుదొరకునట్లు గనుపడు చుండుటలేదు. నా డబ్బంతయు ఖర్చయినది. రాత్రినాకు మెత్తగా దెబ్బలుకూడ తగిలినవి. చిట్టచివరకు ఫలితము నాకనుభవమువల్ల కొంత బుద్ధి వచ్చునట్లు తోచుచున్నది. కావున డబ్బుపోయినను, కొంత బుద్ధినైన సంపాదించుకొంటిని గనుక నిక నింతటితో నింటికిబోయిన బాగుండునని, దలంచుచున్నాను.

ఉగ్ర.—రుధిరా,

ఉ॥ ఓపికలేనివారలు ప్రయోజకు లౌదురె యెచ్చటైన? సే
వింప కనేక మందు లతి వేగమె మానువ్రణం బదేది? భా
వింప మనుష్యమాత్రులము వీలున బుద్ధిబలంబు చేతఁ గా
వింప సమర్థు లౌదుము గ్రహింప మహాత్మ్యము లేదుగాన చిం
తింపకు మెల్లకార్యములు ధీబలవశ్యములౌను మెల్లగా ॥

అంతయుఁ జక్కఁగా జరుగలేదా? కృష్ణుఁడు నిన్ను రవంత కొట్టుటవలన నీవు రవ్వఁజేసి యతని పదభ్రష్టుని చేయలేదా? తక్కిన కార్యము లెట్లున్నను మొదట పుష్పించిన కార్యములు మొదటఫలించును. నీవిప్పుడు వెడలిపొమ్ము. నీ వున్న కడ కేగుము. తరువాత తక్కిన సంగతులు తెలియగలవు. పొమ్ము. పొమ్ము.

(రుధిరుఁడు పోవుచున్నాఁడు.)

ఉగ్ర.—ఇప్పుడు రెండు పనులు జరుగవలసియున్నవి. నా భార్య కృష్ణునికి సుశీల యొక్క దర్శనమగునట్లు చేయవలెను. నే నీలోపుగ పుళిందుని దూరంబుగఁ గొని పోయి, కృష్ణుండును సుశీలయు మాట్లాడుచుండు సమయమున అకాత్తుగఁ దీసికొనివచ్చి పడవేయవలెను. ఆ! అదియే కర్తవ్యము. తామ సాభావములు నా పన్నుగడను విఫలంబుఁ జేయకుండుఁగాక!

---

## తృతీయాంకము.

---

### (రంగము I—పుళిందుని భవనము యొక్క సముఖమున.)

(కృష్ణుఁడు, గాయకులు ప్రవేశించుచున్నారు.)

కృష్ణుఁడు.—గాయకులారా, ఇక్కడఁ గూర్చుని మీ గాన మాధుర్యంబుచే సేనానికి ప్రభాతమంగళాభి వందనంబులఁబాడుడు. శీఘ్రముగఁ గావలయును.

(పాడుచున్నారు.)

విదూషకుడు.

వి.—అయ్యలారా, మీ జంత్రంబులకేమి కొంచెము జలుబు చేసినట్లున్నదికి

గా.—ఏమి! ఏమి చెప్పెదరు స్వామి!

వి.—ఏమిలేదు, ఏమిలేదు, కొంచెము ముక్కులు బిగవేసినట్లున్నవి.

గా.—అయ్యో! లేదండి, లేదండి.

వి.—అయ్యలారా! మీకు పారితోషిక మిదిగో! మీ గానంబును మా సేనాధిపతిగారు మెచ్చుకొని ఇక దయజేసి పాడవద్దని ప్రార్థించుచు నీ పారితోషికము లిచ్చినారు.

గియ.—చిత్తము, చిత్తము, ఇక పాడము.

వి.—మా సేనానిగారును నేనును వినఁగూడనిపాటయేమైననుండినయెడల మీరు మరలఁ బాడవచ్చును.



గా.—అటువంటి పాట మావద్ద లేదు.

వి.—అట్లైన మీ జంత్రగాత్రములను మీ చంకలోఁ బెట్టుకొని గంధర్వులవలె యంతరిక్షమార్గంబున కెగసి గాలిలోఁ గలిసిపొండు.

(గాయకులు వెడలిపోవుచున్నారు.)

(కృష్ణుడు ప్రవేశించుచున్నాడు.)

కృష్ణ.—ప్రియమిత్రుఁడా, నేచెప్పినమాట కొంచెము వినెదవా?

వి.—మీరు చెప్పినమాట విందునుగాని మీరు చెప్పినమాట వినను.

కృష్ణ.—నీ హాస్యప్రసంగములు చాలింపుము. ఇదుగో, నీకుబహుమానము. సేనానిభార్య చెలికత్తె యిచ్చటెచ్చటైన తిరుగుచుండె నేని కృష్ణుం డామెతో కొంచెము మాట్లాడఁగోరుచున్నాడని తెలియఁజేయుము.

వి. ఆహా! ఆమె యిచ్చటెచ్చటనైనఁ దిరుగుచుండిన యెడల సాటింపుజేయించి పిలిపించెదను.

కృష్ణ.—మిత్రుఁడా, అట్లుచేయుము.

(ఉగ్రుడు ప్రవేశించుచున్నాడు.)

మంచిసమయమునఁ గలిసికొంటిమి.

ఉగ్ర.—ఏమి నీవురాత్రియంతయు మేల్కొనియుంటివా?

కృష్ణ.—లేదు మనమిద్దఱమును విడిపోవునప్పటికి తెల్లవారవచ్చెను. ఉగ్రా, నాకు సుశీల దర్శనముఁ జేయింపుమని ప్రార్థించుచు నీభార్యకు నేనిప్పుడే కబురు పంపించుటకు సాహసించితిని.

ఉగ్ర.—అటులనా, మంచిపనిచేసితివి. నేనిప్పుడే ఆమెనిచ్చటకుఁ బంపెదను. నీ కార్యంబు సులభంబుగ సఫలంబగుటకు పుళిందుని వేఱొకమిషచే నేను దూరంబుగఁ గొనిపోయెదను.

కృష్ణ.— మిత్రుఁడా, వందనములు. (స్వగతము) ఇట్టి దయాస్వాంతుని నేనెచ్చటనుఁ జూచియుండలేదు.

కమల ప్రవేశించుచున్నది.

కమల.—యువసేనానీ, జయము జయము. నీయెడలఁ గలిగిన యాగ్రహమునకు నాకెంతయు విచారముగనున్నది. కాని యంతయు త్వరలోఁ జక్కఁబడును. సేనానియుభార్యయు అందునుఁగూర్చి మాటలాడుచున్నారు. ఆమె నీపక్షమున బలముగ వాదించుచున్నది. మీరు గొట్టినవాఁడీ ద్వీపమునఁ గడుప్రసిద్ధికెక్కినవాఁడని

మూరు చెప్పుచున్నాడు. అతఁడు నీయెడల ననురాగముఁ గలవాడనని చెప్పెను. మరల క్రమమ్ముగ నీయెడ ననుగ్రహముఁ జూప తరుణముఁ జూచుచున్నాడు.

కృష్ణు.—అయినప్పటి కిందునుఁగూర్చి మనవిఁజేసికొనుటకు సుశీలయొక్క దర్శనము నాకు లభించునట్లుజేయ నిన్నునే ప్రార్థించుచున్నాను.

కమల.—అటులైనరమ్మ. నీహృదయగత విచారమునుఁ దెల్పుకొనుటకుఁ దగిన యవసరంబుఁజూపెద.

కృష్ణు.—నేను మిక్కిలి కృతజ్ఞుడను.

(నిష్క్రమించుచున్నాడు.

## రంగము II. భవనములో నొకగది.

(పుళిందుడు, ఉగ్రుడు మరికొందరు పెద్దమనుష్యులు ప్రవేశించుచున్నారు.)

పుళిందు.—ఉగ్రా, ఈయుత్తరములఁ దీసికొనిపోయి నావికున కిచ్చి సభికులకు నా వందనములుదెల్పుము. అటుతరువాత నేను కోటగోడపై దిరుగుచుండెద.నీ వచ్చుటకు వచ్చి నన్నుఁగలిసికొనుము.

ఉగ్రు.—చిత్తము. మహాప్రసాదము.

పుళిందు.—యోధులారా, మనముకోటనుఁబరీక్షింతుమా ?

యోధు.—తమ సముఖమున వేచియుందుము.

(నిష్క్రమించుచున్నారు.

## రంగము III. భవనముయొక్కవనము

(సుశీల, కృష్ణుడు, కమల ప్రవేశించుచున్నారు.)

సుశీల.—కృష్ణా, నీవు సందేహింపకుము. నీపక్షమున నా శక్తినంతయును ధారఁబోసెదను.

కమల.—అమ్మా, అటులఁ జేయుము. నా నాథుండుగూడ నీ దుఃఖము తనదేయనినట్లు పరితాపఁబడుచున్నాడు.

సుశీ.—అతడు బహుయోగ్యుడు. కృష్ణా, చింతింపకుము. నా నాథునకును, నీకును, పూర్వ స్నేహంబు మరల నెలకొల్పెదను.

కృష్ణు.—దయాస్వాంతురాలగు నో జననీ,



ఉ॥ కృష్ణున కేమి సంధిలినఁగూర్చెదు సేవకుడమ్మ మీకు

సుశీల.

చిన్నతభక్తియుక్తుడవు చిత్తమెరుంగవె? దీర్ఘసఖ్యవర్తి
ద్ధిష్ణుడవేల సందియము? దీర్ఘ విరోధము గాదు నీ యస
హిష్ణుతఁదాల్చి లౌక్యమున నింతియెదూరముమీకు వారికిన్॥

కృష్ణు.—క॥ ఆలౌక్యము బహుకాలముఁ
గీలించినమదిఁదలపడొ క్రిందటిసేవల్
ఆలోకన లేకుండుటఁ
బాలింపగ మరచు నొక్కపదపడి నన్నున్॥

సుశీల.—నీవు చింతింపవలదు. ఇదుగో, కమల యెదుట నేను వాగ్దానముఁ జేయుచున్నాను. నేబాసఁజేసిన నం దావంతయైనఁ దప్పకఁ దీర్చెదను. భర్తగారు నా ప్రతినఁదీర్చువరకు విడువను.

ఆ. వె॥ పడకమందిరమ్ము పాఠశాలనొనర్తు
భోజనంపుగృహము బోధమఠము
నీదుమాటమయము నేఁజేతునెల్లను
విశ్రమింపనియ్య వినెడుదనుక॥

కావున, కృష్ణా, నీవుసంతోషమున నుండుము. ఏలనన, నా ప్రాణములైనఁ బోగొట్టుకొందును కాని నీపక్షము విడువను.

(పుళిందుడును ఉగ్రుడును దూరమునఁ బ్రవేశించుచున్నాడు.)

కమల.—అమ్మా, అరుగో, దేవరవారు వచ్చుచున్నారు.

కృష్ణు.—దేవీ, నేను సెలవు పుచ్చుకొనెదను.

సుశీల.—ఎందుకు? నీయెదుటనే మనవిఁజేసెదను. ఇచ్చటనేయుండుము.

కృష్ణు.—ఇప్పుడుకాదు, నామదిస్వస్థముగలేదు. నేనేకార్యముకైన నిప్పుడసమర్థుఁడను.

సుశీల.—మంచిది, నీయిష్టము.

(కృష్ణుడుపోవుచున్నాడు.)

(ఉగ్రుడు పుళిందుడు ప్రవేశించుచున్నారు.)

ఉగ్రు.—ఆ! నాకదే యిష్టములేదు.

పుళిం.—ఏమిచెప్పుచుంటివి ?

ఉగ్ర.—అబ్బే! ఏమియును లేదు. స్వామీ! అయినప్పటికి—నాకేమియుఁ దెలియదు.

పుళిం.—ఇప్పుడు నా భార్య దగ్గరనుండి బోయినది కృష్ణుడు కాదా?

ఉగ్ర.—కృష్ణుడా! దేవా? నిజముగా కృష్ణుడేనా? నేననుకోను. అతడైన నట్లు మీరు వచ్చుచుండఁ జూచి దొంగతనముగఁ బారిపోవునా?

పుళిం.—అతఁడేయనుకొనెదను.

సుశీ.—నాధా దయసేయుడు.

క॥ తమయాగ్రహమున నాధా
కమలిన యొకమనుజు కష్టగణముల విందుఁ

పుళిం.—ఎవరాతఁడు?

సుశీ.—అతనిని మీ రెరుగరా? మనయువసేనాని కృష్ణుడు, ప్రాణనాధా.

ఉ॥ ఏను గరంప మీ హృదయ మిందుకు పాత్రముఁ గానె? మీకు నా
పైనఁ బ్రియంబు గల్గినను పాపము! వాని యవజ్ఞసైపు మ
జ్ఞానము చేతఁ గాని యొక కల్మష మాత డెరుంగడంచు నా
బూనిన నోము తేటయె సుబోధ యొనర్చెడు నమ్మకుందుమే? ॥

మనోహరా, అతఁడిప్పుడు పోవుచున్నాడు, నా మనవి నంగీకరించి యతని రమ్మని బిలువుము.

పుళిం.—ఆతడిప్పు డిక్కడనుండి వెడలెనా?

సుశీ.—ఆ. ఉ॥ దీనతఖిన్నుడై సగము దైన్యము వాకడ డించిపోయె నె
య్యానభరింపుమన్న గతి నాతని నో ప్రియ బిల్వనంపుమా.॥

పుళిం.—మనోహారిణీ, ఇప్పుడు కాదు. మరియొకప్పుడు బిలిపించెదను.

సుశీ.—త్వరలో బిలిపించెదరా?

పుళిం.—సాధ్యమైనంత త్వరలో ప్రేయసీ.

సుశీ.—నేటి రాత్రి భోజన సమయమునఁ బిలిపించెవురా?

పుళిం.—ఈ రాత్రి కాదు.

సుశీ.—లేక పోయిన రేపు మధ్యాహ్న భోజనకాలమందా?

పుళిం.—రేపు నేను గృహంబున భోజనము సేయను. యోధుల నందరిని కోటలో గలిసికొందుము.

సుశీ.— అటులనుఁ గాని యెడల,



ఉ॥ రేపటి రాత్రియో పగలో రేపటి కావలి నాడో నాపయిన్
మాపో దినంబునందో పరమావధి మూడు దినంబులంతకున్
బాపడఁ గూడ దెప్డామిముఁ బ్రార్థనఁ జేసెద నిశ్చయింపుడీ
పాపము! తప్పుడయ్యెనికఁ బాలన సేయక నుంట న్యాయమే?॥

యుద్ధమునం దాజ్ఞాతిక్రమణంబుఁ జేసిన వారిలో పెద్దవాని నొకని తక్కిన వారందరకు బుద్ధివచ్చుట కుదాహరణంబుగ శిక్షించుట ధర్మమనుటయే తప్ప నింకొక విధంబుగ సామాన్య విచారణలో నతండు శిక్షార్హుండు గాడు. అతఁ డెప్పుడు వచ్చునో చెప్పరా? మీ రేదైన నన్నడిగిన మీవలెనట్లు మౌనముఁ దాల్చి యుపేక్షఁ జూచు చుండగలనా! ఏమీ! మీరు నన్ను వరింపవచ్చినపు డనేక సారులు మీతో గూడ వచ్చుచుండెడు వాఁడు కాదా? మిముఁ గూర్చి నే నుపేక్షఁ బలికినప్పుడు మీపక్షమున నతఁడు వాదించుచుండెడువాఁడు కాదా? ఆ కృష్ణుడు కాదా యితఁడు? అతని కొరకు నేనింత ప్రార్థింప వలెనా?

పుళిం.—ప్రియసఖీ! ఇకఁ జెప్పనక్కరలేదు. అత నిష్టము వచ్చినపుడు రానిమ్ము. నీవు కోరినదేదియు నేను లేదనను.

సుశీల.—ఏమి! ఇది యొక వరమా? మీ యొడలారోగ్యంబున నుంచుకొనుఁడనియు, మీ శ్రేయంబునకుఁ గావలసిన వెల్లనుఁ జేయవలయుననియు నేను చెప్పుదానివంటిదే యిది యొకటి. నే నేమైన నిజముగ నామీది ప్రేమ కొరకుఁ జేయుమని కోరనెడ నదియింతకంటె కఠినమై యుపద్రవకరమై యుండును సుండీ.

పుళి.—మధురవాణీ, నీకేమియు నడ్డుఁ జెప్పను. కాని నన్ను మాత్రము క్షణకాలమొంటరిగ నుండనిమ్ము.

సుశీ.—మహాప్రసాదము. అటులనే జేసెదను. సెలవిండు, పోయివచ్చెదను.

పుళిం.—ప్రియసఖీ, మంచిది. పోయిరమ్ము. నే నిప్పుడే వచ్చెదను.

సుశీల.—కమలా, రమ్ము.—మీ చిత్తము వచ్చినట్లుండుడు. నేను మాత్రము మీయాజ్ఞ నుల్లంఘింప. (కమలతో వెడలిపోవుచున్నది.)

పుళిందు.—ఓ కామనీమణీ! నీయెడఁ బ్రేమ పోయిన నాకధోగతియే గదా!

ఉగ్ర.—మహాప్రభూ,—

పుళిం.—ఉగ్రా, నీ వేమి చెప్పెదవు?

ఉగ్ర.—తమకును దేవిగారికిని జరిగిన రహస్యానురాగంబంతయుఁ గృష్ణుం డెరింగి యుండెనా?

పులిం.—దాని యాద్యంతంబంతయు నతం డెఱుంగును. నీవల్లేల యడుగుచున్నావు?

ఉగ్ర.—నా సందేహము నివారణఁ జేసికొనుటకే. అంతకంటె నప్రదవమేమియు లేదు.

పులిం.—ఉగ్రా, ఇప్పు డా ఆలోచనేల?

ఉగ్ర.—ఏమియు లేదు. అతఁడా మెకు పరిచయుఁడని నే ననుకొనలేదు.

పులిం.—ఔను, మా యన్యోన్యాను రాగంబునకు రాయబారి యాతఁడే.

ఉగ్ర.—నిజముగా!

పులిం.—నిజముగా! ఔను నిజముగా. అందు తప్పేమిగలదు? అతఁడు మంచివాఁడు కాఁడా?

ఉగ్ర.—మంచివాఁడా! మహాప్రభూ!

పులిం.—మంచివాఁడా! ఔను మంచివాఁడు.

ఉగ్ర.—నాకు తెలిసినంతవరకు మంచివాఁడే..

పులిం.—నీ వేమనుకొనెదవు?

ఉగ్ర.—ఏమనుకొనెదను, మహాప్రభూ?

పులిం.—ఏమనుకొనెదను మహాప్రభూ!

క॥ నామాటకు ప్రతిధ్వనిగను
మోమోటము లేకఁ బలుకు మోటుగనితఁ
డేమో ఘోరము మనమున
క్షేమంబుగ దాచినటుల చిత్రముగాఁగన్॥

నీ వేమో మనస్సునఁ దలంచుచున్నావు. నీవిప్పుడే 'నాకదే యిష్టము లేదు' అని చెప్పితివి. అతఁడు నా వివాహముయొక్క రహస్యము నందున్నవాఁడని చెప్పినపుడు 'నిజముగా!' 'నిజముగా!' నని నీ మొగము చిట్లించుకొని నీమనమునందేమో రాక్షసకృత్యమును దాచియుంచినటులఁ బల్కితివి. నీవు నన్ను ప్రేమించిన యెడల నీహృదయగతంబైన భావంబేమో దెలియఁ జెప్పుము.

ఉగ్ర.—దేవా, మీయెడ నాకు విశ్వాసము గలదని మీ రెఱుంగుదురు గదా!

పులిం.—నేనటులనే దలంచెదను. నీవు ప్రతిమాటయు తూచి గాని పల్కవు. అందువలననే నీయనుమానములు నాకు మరింత భయకారణములుగ నున్నవి—టక్కరియు, దోసకారియునైన దుర్మార్గునం దీలక్షణములు సామాన్యమైనప్పటికిని యదార్థవాది యందియ్యవియే ప్రేమావేశంబుచే లోపలనిలువఁజాలక బయలువెడలు రహస్యములై యుండును.



ఉగ్ర.—కృష్ణుని విషయములో నతఁడు మంచివాఁడనియే నా యదార్థమైన యభిప్రాయము.

పులిం.—నేనుఁగూడ నట్లే తలంచెదను.

ఉగ్ర.—మనుష్యులు వారు పైకి గనుపడిన రీతిగనే యదార్థముగ నుండవలెను. లేనిచో పైకేవిధముగనుఁ దోచకుండ నుంటయే శ్రేయము.

పులిం.—నిజము, పైకి కనుపడినటులనే మనుష్యులు నిజముగ నుండవలెను.

ఉగ్ర.—అటులైన కృష్ణుఁడు మంచివాఁడనియే నా నమ్మకము.

పులిం.—కాదు, ఇందింకేమియో యున్నది. నీయభిప్రాయములను స్పష్టముగఁ జెప్పనేఁ బ్రార్థించెదను. ఎట్టిదుర్భావములైనను తగిన దుర్భాషలతో వానిఁ దెలియఁబఱచవలయును.

ఉగ్ర.—మహాప్రభూ! నన్ను మన్నింపుఁడు.

ఉ॥ సేవకుఁడైన నేను పలుసేవలఁ జేతునుగాని మీకు నా
భావముమాత్రముం దెలుప. బానిసఁగూడ స్వతంత్రుఁడౌ మనో
భావము దాచియుంచుకొన. బాగుగనున్నది! వారువీరు దు
ర్భావమనోవికల్పులని వాకొననేల? మహాపవిత్ర సౌ
ధావధులందు నొక్కెడఁ బథంబునుఁ దప్పి నికృష్ట సంతతుల్
బోవకయుండు నేమిగల పూతచరిత్రయనంగఁ జెల్లు సం
భావన కర్హమైన కడుభాసురమానస ముండునయ్య? దు
ర్భావవిశేషముల్ గొలది భాగమునైన మనస్సునందు స
ద్భావసమూహముల్ సరస దామును యోలగ ముండకుండునే?

పులిం.—ఉగ్రా, నీవు నాయెడల నపరాధముఁ గావించునటులఁ దలంచి, నీ భావముల నుండి నన్ను దూరునిం జేసినయెడల నాకు ద్రోహముఁ జేసినవాఁడవగుచున్నావని నే నెంచెదను సుమీ!

ఉగ్ర.—అయ్యా, మిమ్ముల వేఁడుకొనెదను. నా యూహయందు నే పాపాత్ముఁడనౌదు గాన—ఏలనన, పరులయొక్క లోపములను వెదకుట నాదు స్వభావము, నాయనుమానమునకు లేనిదోషములుకూడ పొడగట్టును.—నాకవ్యక్తముగ నేర్పడిన యభిప్రాయములను మీ వివేక మంతగా పాటింపకుండుఁ గాక! మీ శాంతమునకుఁ గాని, మీ మేలునకుఁ గాని, నా పౌరుషమునకుఁ గాని, నా యదార్థమునకుఁ గాని, నా వివేకమునకుఁ గాని, దెలియఁబర్చుట అంతయు క్షేమంబు గాదు

పుళిం.—ఏమి? నీయుద్దేశమేమి?

ఉగ్ర.—ఆ. వె॥ మనుజునందుఁ గాని మానవతికిఁ గాని
సద్యశస్సు గాదె చక్కనౌభూషణ
తస్కరుండుగొనిన ధనమును నేనెప్డు
చెత్తగానుఁదలతు చిత్తమందు
నాది నేడు రేపు నలువుర కడకేగఁ
బరగ దాసియగును పదివేలమందికి.
మానధనముఁగొనిన మహిమీదిచోరుండు
ధనికుడగుటలేదు తాను నన్ను
నిశ్చయముగఁజేయు నిరుపేద నట్టి
వానియెడలనాకు. భయముఁగలుగు.॥

పుళిం.—దేవునియాన! నీహృదయాగతంబైన రహస్యమును నేను తెలిసికొని తీరెదను.

ఉగ్ర.—క॥ నాహృదయము మీచేతికి
దీసిచ్చినఁ దెలియరెంత ధీమతులైనన్
నాహృదయము నా వశమున
వాసింపగఁదెలియనగునె భావముమీకున్?॥

పుళిం.—ఆ! ఏమీ?

ఉగ్ర.—అయ్యా, అనుమాన భూతంబునుండి మీరు భద్రంబుగ నుందురుగాక!

క॥ అనుమానమె పెనుభూతము
మనఃహావహమైన పచ్చమయముగఁజేయున్
తినుదాని వెక్కరించును
ఘనరూపముఁదాల్పఁజేయుఁ గాంచిన దెల్లన్॥

క॥ తనకర్మగతియె తథ్యం
బనుకొని ప్రేమంబు వీడు నధముడు సౌఖ్యం
బున నుండును ప్రేమించుచు
ననుమానించుచుమనియెడు నతడేమగునో!॥

పుళిం—ఓగ్రహాచారమా!

ఉగ్ర.— ఆ. వె.॥ పేదతనము తృప్తి పెన్మిభాగ్యంబౌను
తృప్తిలేని యట్టి దూగులక్ష్మి



పేదనగుదు నంచు భీతిఁ జెందెడు వాని
కెంతఁ గలిగియున్న సుంతె యగును,

ఓ పరమేశ్వరా! తోడి మానవుల నందఱి నను మానమునుండి భద్రంబుగఁ గాపాడుము.

పుళిందు.—ఏమది? ఏమది? నీవట్లుఁ దలంచుచున్నావా!

క.॥ అనుమానపు జీవితమును
మని యుండుదె నేను, చంద్రమానము దిరుగగ
ననుమానము లెక్కించుచు
కను దెరచుక మరల మరల గాంతునె దానిన్?॥

కాదుకాదు. ఒక మాటనుమానముఁ దగిలె నేని, నిశ్చయముఁ జేసికొనవలెను. కాని లేనిపోని యూహలచే మరల మరలచింతించుచుండుననని మాత్రము దలంపవద్దు. నాభార్య,రూపవతి, కలభాషిణి, గజగామిని గానప్రియ యని చెప్పిన నం దనుమాన కారణమేమున్నది! సుగుణంబులు గలచోట నివి మరింత సుగుణంబులై ప్రకాశించు. నాయొక్క యవలక్షణంబులవలన నామె తిరుగబాటుఁ జేసినదని చెప్పుట కవకాశము లేదు. ఏలనన, నామె కండ్లుతెరచి నన్నువరించినది. ఉగ్రా, నే ననుమానింపక పూర్వ మాలోచించెదను. అటుపిమ్మట తగిన నిదర్శనముఁ జూతును. నిర్ధారణ యైనచో ప్రేమయో ననుమానమో యొకటి పోవలెను.

ఉగ్ర.—నా కిప్పు డానందముగ నున్నది. మీయెడల నాకుఁగల భక్తి యనురాగంబుల ధారాళంబుగఁ జూప కొంత హేతు వగుపడుచున్నది. కావున మీ యెడల బద్ధానురాగంబున నే దెలియపరచి నటుల నేనే జెప్పు సంగతులనుఁ గూడ మీరు బద్ధానురాగంబునఁ గైకొందురని నే వేడెదను. నే నప్పుడె నిదర్శనములనుఁ గూర్చి చెప్పను. మీ భార్యను పరీక్షగఁ జూచుచుండుడు. కృష్ణునియెడల నామె చర్యలను గమనింపుడు. ఒక కన్నామె మీదనుంచి పరీక్షింపుచుండుడు. అనుమానము గఁ గనుపడకుడు. అజాగ్రతగ నుండకుడు. మీవంటి నిష్కపట విశాల హృదయులు నిష్కారణముగ మోసగింపబడుట నే సహింపజాల. జాగ్రత్త, మా దేశీయుల స్వభావము నాకు చక్కగ దెలియును.

క॥ తమముగలకుఁ జూపింపరు
తమదైవముఁ జూడనిచ్చు తగని యవజ్ఞల్
తమ దోషంబుల దాచురె
తమశీలముగాని మానదేఁపరు వానిన్॥

పులిం.—నీవట్లు దలంచెదవా ?

ఉగ్ర.—క॥ మీరూపు వికారంబుల
గారాబుగఁ జూచిపైకి గడగడవడకుచు
నారీతి కపటవర్తనమున
సారంబుగఁ దండ్రికండ్ల జక్కఁగమూసెన్ ॥

పులిం.—ఔను, అదినిజమే.

ఉగ్ర.—ఆ. వె॥ చిన్నతనమునందె తండ్రిఁ జీకుఁ జేసె
వయసుమీరినపుడు వలెనెఁ జెప్ప
కపటవర్తనమునుఁ గాంచి యీముదుసలి
మాయమంత్రమంచు మదినిఁదలచె ॥

అయ్యా, నేనుఁగడునపరాధిని. మిమ్ము విస్తారము ప్రేమించి నందుకు క్షమింప నతివినయంబుతో వేడుకొనుచున్నాను:

పులి.—నేను నీ కెప్పటికిని కృతిజ్ఞుడనై యుందును.

ఉగ్ర.—ఇందువలన మీ మనోధైర్యము కొంచెము వీడినట్లున్నది.

పులిం.—లేదు లేదు. ఎంతమాత్రము లేదు.

ఉగ్ర.—నామాట నమ్మండి, మీధైర్యము కొంచెము తగ్గినది. నే చెప్పినదంతయు నా ప్రేమనుండి జనించినదని దలంతురని నేననమ్మెదను. కాని మీమనస్సు మాత్రము చలించినట్లు గనుపడుచున్నది! నావచనంబులకు విశేషార్థముఁదీసి అనుమానమున కతిశయించిమాత్రముఁ దలపవలదని నా వినయపూర్వకమైన ప్రార్థన.

పులిం.—లేదు, లేదు, నేనట్లు చేయను.

ఉగ్ర.—నా వచనంబులకు విపరీతార్థమును మీరు దీసితిరేని, నాయుద్దేశములో లేని ఫలితంబున కది దారిజూపును. కృష్ణుండు నా ప్రియమిత్రుండు.—దేవా, మీ ధైర్యము చలించుచున్నట్లు గన్పించుచున్నది!

పులిం.—లేదు లేదు. చలింపలేదు. సుశీల యుత్తమురాలనియే తప్ప నాయభిప్రాయమింకొక విధముగమారలేదు.

ఉగ్ర.—ఆమె చిరకాల మట్లుండుగాక! మీ రట్లనే దలచుచు దీర్ఘాయుష్మంతులై యుందురుగాక!

పులిం.—అయిన నెట్టి స్వభావవిరుద్ధంబు జరుగుచున్నది!

ఉగ్ర.—ఆ! అదుగో అచ్చటనేయున్నది! మీతో నిర్భయముగఁ జెప్పినయెడల,



సీ॥ తనదేశజవ్వనుల్ ధనవంతులగువారి మేలికొలమువాండ్రశీలమతుల
నవమన్మథాకార నాళీకపత్రాక్షు లగువారినొల్లక వెగటుఁజూపె
సహజరుచులుపోయె చవులిట్లు చెడిపోయె మనసుతత్వమిటుల మారిపోయె
బుద్ధిజాడ్యమిందు పొడసూపదేమీకు ? వికలాత్మదుర్గంధవితతిగనరె?
ఆమెనుగూర్చి స్పష్టముగ నేను చెప్పనుగాని నన్ను క్షమింపుడు.

ఆ. వె॥ ఆమెబుద్ధి కొంచెమటుపైన కుదిరిక
బడినయెడలను పొరపాటుదిద్దు
కొనుచుమరల తనదుకొలమువారిసెగోరు
ననుచు నేను భయముఁగొనెడువాడ॥

పులిం.—పొమ్మికపొమ్ము, నీవింకనుఁ జూచిన యెడల నాకుఁదెలియజేయుము. జాగ్రతగకనిపెట్టి చూచుటకు నీభార్యను నియోగింపుము. ఉగ్రా, నన్నిక విడచిపెట్టి పొమ్ము.

ఉగ్ర.—మహాప్రభూ, సెలవు పుచ్చుకొనెదను (అనిపోవుచున్నాడు)

పులిం.—నేనీయువతి నేలఁ బెండ్లాడితిని. ఈసత్యసంధుడుఁదాను జెప్పెడు దానికంటె నెక్కుడెరుంగును.

ఉగ్ర.—(తిరిగివచ్చి) మహాప్రభూ! ఈవిషయమునుగూర్చి మీరింక శోధింపవలదని మీఘనమును ప్రార్థించుచున్నాను. కాలక్రమంబున నంతయు విశదపడఁగలదు. కృష్ణుండు తనయుద్ధాస్థానంబున కర్హుండైనను నిశ్చయముగ నతఁడు మిగులసామర్థ్యముతో నిర్వహింపగలడు-అయిన నతని కొన్నిదినంబుల వఱకు దూరంబుగ నుంచితిరేని యతనిప్రయత్నంబులవలనను మీభార్య యతనినిఁ బ్రవేశఁబెట్టుటకుఁ జేయుబలాత్కారంబుల వలనను మీరు చాలగ్రహింపగలరు. అంతవఱకు నే నామెను నిర్దోషురాలుగాఁ దలచినట్లే మీరు భావింపవలయునని నావిజ్ఞాపన.

పులిం.—నాయాత్మ నిగ్రహమునుఁగూర్చి నీవేమియుఁ భయపడనక్కరలేదు.

ఉగ్ర.—చిత్తము నేను మరల సెలవుఁగైకొనెదను.

(అనిపోవుచున్నాడు.)

పులిం.—ఆహా! ఇతడెంత సత్యసంధుడు! ఎంతకుశాగ్రబుద్ధితో మానవ స్వభావమును పరీక్షించి యున్నాడు!

ఆ. వె॥ అడవిసాళువంబు దుడుకుబుద్ధియఁటంచుఁ
దగిన రుజావుమదికిఁ దగిలినేని

దానిబంధనములుదగిలి యున్నను గాలి
వాలుజూచి విడతు నీలవేణి॥

బహుశః నేను రూపసిని కాకపోవుటవలననో, విటునికాయంబున కుండవల సిన సరససల్లాపవచనా చాతుర్యంబులు లేకఁబోవుట వలననో, లేక బహుశః వృద్ధాప్యమునకు దిగుచున్నందువలననో. అయిన నదిమాత్ర మెంత? ఆయురాత్మురాలు నన్ను మోసఁపుచ్చినది. ఇక నామె నసహ్యించుచే నామనశ్శాంతి. హా! వివాహశాపమెట్టిది?

క॥ ఈసుకుమారశరీరల
బేసుగమనవారనుకొను పిచ్చియదేలా ?
వాసిగతమ కామునకుఁ
జేసికొనిన సాధనలని చింతింపఁదగుꣳ॥

తే. గీ॥ అంధకార బంధురముగు కంధరమున
విషపుపురుగైన యగుదును వెసమదీయ
ప్రియసఖియటంచు నొక తెకుఁబేరువెట్టి
పరులకొరకును భరియించువాఁడఁగాను

అనుగో! ఆమెవచ్చుచున్నది ఆసౌందర్యరాశియే దుర్మార్గురాలయ్యేనేనినిక బ్రహ్మసృష్టియే వికారముగదా ? నాకు నమ్మకములేదు.

(సుశీలయు కమలయు ప్రవేశించుచున్నారు.)

సుశీ.—జయము జయము ప్రాణనాయకా! మీభోజనము సిద్ధముగనున్నది. మహారధులగు ద్వీపవాసులందరను తమ రాకకై యెదురుజూచుచున్నారు

పుళిం.—నేనుఁగడు నపరాధిని.

సుశీ.—ఏల మీరంత దీనస్వరముతోఁ బల్కుచున్నారు? మీదేహమునం దస్వస్థతిలేదుగదా ?

పుళిం.—ఇక్కడ నుదురంతయు నొప్పియెత్తుచున్నది.

సుశీ.—విస్తారము మేల్కొని యుండుటచే నది కలిగియుండవచ్చును. అది యిప్పుడే క్షణములో పోగలదు. ఈరుమాలుతో గట్టిగఁ గట్టనిండు. త్వరలోనంతయు సద్దుకొనును.

పుళిం.—ఈ రుమాలు మిక్కిలి చిన్నది, చాలదు (రుమాలును ప్రక్కకు త్రోసివేయుచున్నాడు. ఆమె జారవిడుచుచున్నది.)

పోనీ, రమ్ము మనమిద్దరమును బోవుదము.



సుశీ.—మీ కస్వస్థతగ నున్నదని నాకెంతయు విచారముగనున్నది.

(పుళిందుడును సుశీలయు బోవుచున్నారు.)

(కమల రుమాలునుఁ దీసికొనుచున్నది.)

కమల.—ఈ రుమాలు దొరకినందుకు నాకెంతయు సంతోషముగనున్నది. చిత్రవిచిత్రమైన కోరికలుగల నా మగ డనేకసారులు నన్నీ రుమాలునెట్లైన దొంగిలింపుమని కోరియున్నాడు. పాపము! మాదేవిమాత్ర మీ రుమాలు నెంతో ప్రేమతో భద్రపరచుకొనును. ఆమె మగఁడు దీనిని జాగ్రతగఁ గాపాడుమని యనేకసారులు గట్టిగ జెప్పెను. అందువలన నామె మరింత ప్రేమతో నీరుమాలును ముద్దుబెట్టుకొనుచు పలుమారేకాంతంబున దానితో ముచ్చటగ సంభాషించుచుండును. దీనిపైనున్న యల్లికనుదీసి నామగనికిచ్చెదను గాక! అతఁడేమిచేయునో నాకు తెలియదు. దైవమునకెఱుక. అతని ప్రియంబునుఁ దీర్పనే నీపనినిఁ జేయుచున్నాను.

(ఉగ్రుడు ప్రవేశించుచున్నాడు.)

ఉగ్రు.—ఓహో! నీవిక్కడొక్కదానవేమి చేయుచున్నావు ?

కమల.—(రుమాలును చేతిలో వెనుకఁ బెట్టుకొని) నన్ను కోపపడవలదు. మీకొక మంచివస్తువు నిచ్చెదను, మంచిది !

ఉగ్రు.—ఏమి మంచి దిచ్చెదవు ? మంచిది! ఏమున్నది ?

కమల.—ఆ! అట్లాగనా ?

ఉగ్రు.—నీమొగము ? తెలివితక్కువ పెండ్లాము నిచ్చెదవా ?

కమల.—ఆ! అంతేనా ? ఆరుమాలు నిచ్చిన నాకేమిచ్చెదరు ?

ఉగ్రు.—ఏరుమాలు ?

కమ.—ఏరుమాలా ? ఏమి ? పుళిందుడు సుశీలకు మొట్టమొదట ఇచ్చినది. దానిని దొంగిలించి తీసికొనిరమ్మని నాకనేకసారులు చెప్పలేదా ?

ఉగ్రు.—ఏమి? దొంగిలించితివా యేమి ?

కమల.—లేదు లేదు. ఆమెపొరపాటున జారవిడిచెను. ఆసమయములో నేనక్కడుండి తీసితిని. ఇదుగో!

ఉగ్రు.—నీవుమంచిపెండ్లాముపే! ఇటు తెమ్ము.

కమల.—దానిసంగ్రహింపవలసినదని అనేకసారులు చెప్పియున్నారు. మీరు దానితోనేమి చేయఁగలరు ?

ఉగ్ర.—అదంతయు నీకెందుకు? (అనిలాగుకొనుచున్నాఁడు)

కమల.—మీకేమియు నవసరమైన పనిలేకపోయిన దానిని తిరిగి నాకిచ్చివేయుఁడు. పాపము! సుశీలాదేవి యది లేనియెడల బహువ్యాకులపడును.

ఉగ్ర.—నీవు తీసితివని మరియెవ్వరితోడను చెప్పవద్దు. నాకు దానితోఁ బనియున్నది. నీవు నన్ను విడిచిపొమ్ము.

(కమల వెడలిపోవుచున్నది.)

ఈరుమాలు కృష్ణుని బసయందు పడవేసి వానికిదొరకునట్లు చేసెదను.

ఆ. వె॥ కల్లబొల్లికథలు గాఢానుమానికి
వేదవచనమట్లు విదితమగును.॥

ఇదికూడ కొంతపనిచేయును. మూ గప్పుడే నా విషముచే తత్త్వము మారిపోవుచున్నాఁడు.

ఆ. వె॥ చెడ్డయూహలెపుడు చెడువిషంబులుగావె?
మొదట తియ్యనుండి పిదపరక్త
మునకుఁ బ్రాకి దేహము నుదహింపఁగఁ జేయు
లాత్మగృహము లట్ల తీక్ష్ణముగ॥

అదుగో! వచ్చుచున్నాఁడు.

తే. గీ॥ భంగు మాదుము మరిమత్తు మందులెన్ని
పుడమిగలయట్టి సారాలు పొముప్రఁ జేసి
పుచ్చుకొనినను నీకునో పిచ్చివాఁడ!
నిన్నఁ బొందిన సుఖనిద్ర నేఁడు రాదు.॥

(పులిందుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

పులిం.—ఆ! ఆ! నన్నెంత మోసముఁ జేసితివే!

ఉగ్ర.—సేనానీ, ఇక దానిగూర్చి విస్తారము చింతింపకుము.

పులిం.—ఛీ, పొమ్ము, చింతింపకుమా!

సీ॥ చితిపేర్చి ననుఁ జేర్చి చిచ్చెట్టి దీపింప వెతఁ గుందకే నెట్లు బ్రతుకఁగలను?
కొంచెంబుఁ దెలసుక కించెనెందుటకంటె మోసంబునొందుటే ముదము గాదె?

ఉగ్ర.—మహాప్రభూ! ఏమనియెదరు?

పులిందు.—సీ॥ నాకేమి గ్రాహ్యమా నాఁటి గూఢరతుల్ దొంగసంశ్లేషముల్ ద్రోహ [మతులు



నాకంటఁబడలేదు నాయుహ దాకవు నాకేమి హానియు చేకురాదు.
మరునాఁడు నేనెంతొ మైమర్చి నిద్రించి సంతోషమున నెంతొ జరపియుంటి
కృష్ణుని ముద్దులు కొంచెమైనను నామె యధరోష్ఠమునను౦డ వానవాళ్లు
సొమ్ముపోయినవాని నిమ్ము తెలియకయుండ నపహృతుండతఁడు గాఁడదృష్ట [తముగ.

ఉగ్ర.—దీనినంతయు విన నాకెంతయో విచారముగనున్నది (అని చెవులుమూసుకొనుచున్నాఁడు.)

పులిం.—సీ॥ సంతోషమునఁ దేలు శాంతమానసలక్ష్మి! సెలవుగైకొనుమింక శీఘ్రగతిని
పటుప్రతాపముచాటు ప్రౌఢసంగ్రామ రంగములార! మీ చక్కఁగదలనింక
రణసముద్యద్దీక్షకరాకారమూర్తులౌ భటులార! మీకింక ప్రణుతి సేతు
రణరంగమునకాలు రాసి ఘోషించెడు నశ్వమా! నిన్నింక నంటఁబోను
రణకుతూహలమిచ్చు శ్రవణభేదినియైన రణభేరి! నిన్నింక విసను నేను
రాజలాంఛనములా యోజగర్వాటోప సంరంభవితతులా! జరగిపొండు
కారుమేఘములట్లు కార్చిచ్చుఁ గ్రక్కెడు మృత్యుయంత్రములార మిత్రు [విడుఁడు.

తే. గీ॥ మీకునాకును ఋణబంధమింతఁ దెగెను
తరలిపొండిక ననుఁగూర్చి తలపవలదు
చివరవందనమిద్దిగో! చేయుచుంటి
ఘనపులిందుని కార్యంబు కడకుఁ జేరె॥

ఉగ్ర.—మహాప్రభూ! ఇది న్యాయమా? ఇది సంభవమా?

పులిం.—అరే! దుష్టాత్మా, నా ప్రియసతి ద్రోహియని నీవు నిర్ధారణఁ జేయవలసియున్నదని తెలిసికొనుము. నీమనస్సు నిశ్చయపరచుకొనుము. నాకుతగిన ప్రత్యక్షనిదర్శనములఁ జూపింపుము. లేనియెడల నా యాగ్రహంబునకు పాలగుటకంటె కుక్కవై జన్మించిన వేయిమడుంగులు మేలని దలంచుకొనుము.

ఉగ్ర.—ఇంతవఱకు వచ్చినదా?

పులిం.—నాకుఁ జూపింపుము. లేనియెడల అధమము అనుమానమునకు తగిన యాధారములనైనఁ జూపింపుము. అటుగానిచో నీ ప్రాణములపై నింక నాశవిడుము.

ఉగ్ర.—అయ్యో మహాప్రభూ!

పులిం.—సీ॥ ఆమెనుదూషించి యీమెయిబాధించి పరితాపఁబడిన నిష్ఫలము సుమ్ము
ఘోరంబులకువైన ఘోరంబులెక్కించి పాపంబులను మేటి పడఁగనేసి
గగనాంగనామణి గార్చంగఁగన్నీరు భూదేవిఁజూచి యద్భుతపడంగ
నరకకూపమునందు చిరకాలముండంగ పాపమింకేలనో పాపనరుడ!

ఉగ్ర.—ఓధర్మదేవతా నన్నురక్షింపుము. నీవుమనిషివేనా? నీకుబుద్ధియున్నదా?—దైవమునిమ్ము సదాగాపాడుఁగాక! ఇదుగో, నాయుద్యోగమునకు నేటితో రాజీనామా!—ఓభ్రష్టా! యవివేకీ! నీయదార్థమువలన పాపమును మెడకు జుట్టుకొనుటకా బ్రతుకుచున్నావు? ఓదుష్టప్రపంచమా! చూడు చూడు! ఓలోకమా! సత్యమును యదార్థమును క్షేమఁకరములుగావు. నాకీబోధఁజేసినందుకు మీకనేక వందనములు. ఇకనుండి నేనేమిత్రునిఁ బ్రేమింపను. ఇక బుద్ధివచ్చినది (అనిచెంపలు వేసికొనుచున్నాడు) ప్రేమమున నేగదా యీయపరాధము తారసిల్లినది.

(అనిపోవుచున్నాడు)

పులిం.—కాదు కాదు. ఆగు, నీవుయదార్థముగ నుండవలెను.

ఉగ్ర.—కాదు కాదు! వివేకముగ నుండవలెను. యదార్థము తెలివితక్కువతనము. దానియుద్దేశము నే యది నెరవేర్పఁజాలదు.

పులిం.—హా! ఈలోకమాన!

సీ॥ నాభార్యగుణియందు నమ్మంగఁజాలను బాధించు మనము ద్విధంగి నెపుడు
నీమాటనిజమందు నిజముకాదందును నిశ్చయంబేమొకో యరుఁగజాల
చంద్రమండలమట్లు చక్కనౌనామోము నరకలోకంబట్లు నల్లవడియె
విషమైన నగ్నిన మసలెడునీరైన నుత్రితాడునైన నే నోర్వగలను॥
నేనుదీని సహింపఁజాల నాకుతృప్తికరముగఁ జూపింపవలయును.

ఉగ్ర.—అయ్యా, మీరు క్రోధావేశులైయున్నారు. నేనుమీకుఁ జెప్పినందుకు విచారపడుచున్నాను. మీకు తృప్తికరముగఁ జూపింపవలయునా?

పులిం.—చూపింపవలయునే గాదు. చూపించునట్లుచేసి తీరెదను.

ఉగ్ర.—అటులైనఁ జూడవచ్చును? ఎటులా? మీకెట్లుతృప్తిగలుగును? మహాప్రభూ, మీరీకండ్లు పెట్టుకొని చూచెదరా? ఏమనిచెప్పను? మీకు తృప్తియెక్కడికి? వారుమాత్రము ప్రత్యక్షముగఁజూడ నవకాశములేదు. వారు మృగప్రాయులైనను, క్రొవ్వి మదించి యొడలెరుంగకున్నను,మీకుఁ జూడలభ్యముగాదు. అయినను సత్య ద్వారమునొద్దకుఁ దీసికొనిపోగల సందర్భములు మీకుఁ తృప్తినిచ్చు జాడలమీకు నేనుఁజూపఁగలను.



పులిం.—ఆమె ద్రోహియని స్పష్టమైన నిదర్శనము నాకుఁజూపింపుము.

ఉగ్ర.—నాకీయుద్యోగమేమియు బాగుండలేదు. అయిన నా తెలివి తక్కువతనముచే నింతవఱకుఁ దెచ్చుకొంటినిఁగాన చేయఁగలిగినంతవఱకుఁ జేసెదను. ఈమధ్య నేను కృష్ణునితో నొకరాత్రి నిద్రించితిని. నాపన్నొకటి తీపుపెట్టుటచే నాకు నిద్రపట్టలేదు. కొందరు బుద్ధిహీనులు నిద్రలో తమ వ్యవహారముల నన్నిటి నేకరువు పెట్టుచుందురు. అట్టివారిలో కృష్ణుడొకఁడు. నిద్రలో యతడు 'ప్రియసఖీ, సుశీలా మనము బహుజాగ్రతగ నుండవలెను. మన ప్రేమరహస్యములను భద్రముగఁ గాపాడవలెను సుమీ!' అని పల్కెను. అటుపిమ్మట నతఁడు నా చేయిపట్టుకొని గట్టిగనొక్కుచు 'ఓ ప్రేయసీ' అని కేకపెట్టినన్నుగట్టిగ ముద్దుపెట్టుకొనెను. అటుపిమ్మట నా కాలుపై కాలువేసి నిట్టూర్పువుచ్చి మరల ముద్దుబెట్టికొని దుర్దైవంబు నిన్ను మూరునకిచ్చి వేసెనుగదా!' యని గద్గదికంబల్కెను.

పులిం.—హా! ఘోరము, ఘోరము!

ఉగ్ర.—కాదు, కాదు, ఇది అతని స్వప్నవృత్తాంతము.

పులిం.—ఔనుకాని యది పూర్వవిశేషములనుఁ దెలియఁజేయుచున్నది. అది కలయైన ననుమానమున కాస్పదంబేగదా!

ఉగ్ర.—అంతేకాక, ఇది తక్కిన స్వల్ప నిదర్శనములను బలపరచును.

పులిం.—ముక్కలు ముక్కలుగా సంహరించెదను.

ఉగ్ర.—ఇంకను మనము శాంతముగ విచారింపవలయును. మనమింక నేమియుఁజూచి యుండలేదు. ఆమె పతివ్రతయేయై యుండవచ్చును. అయితే నాకొకటి చెప్పుడు. మీ భార్యచేతిలో నప్పుడప్పుడు మీరొక చిత్రములల్లిన రుమాలునుఁ జూచి యుండలేదా?

పులిం.—నే నట్టిదానినొకటి యామెకిచ్చియున్నాను. నేను ప్రథమమున నిచ్చిన పారితోషిక మద్దియే.

ఉగ్ర.—అదేమో నాకు తెలియదు. అట్టి రుమాలొకటి, మీభార్యదనియే నా నమ్మకము.—కృష్ణునిచేతిలోనుండగా నేను నేడుచూచితిని.

పులిం.—అదే అయినయెడల.

ఉగ్ర.—అదే అయినను, లేక మరియేదైన నామెదైయునయెడల తక్కిన నిదర్శనములతోపాటు ఆమెకువ్యతిరేకముగ వాదించును.

పులిం.—హా!

తే. గీ॥ ప్రాణముల్ వేయి లేవాయెబానిసతను!
చాల దొక్కటి నాకసి శాంతపడగ

ఉగ్రా, నా కిప్పుడంతయు నిజముగా గన్పట్టుచున్నది—
ఇదిగో! యాకాసవీధికే యెగురునటుల
నాదుస్నేహంబు నంతను నూదుచుంటి॥

ఆ! పోయినది, ఇకను,

ఆ. వె॥ మత్సరమ్మ! లెమ్ము మను నేల రావమ్మ
కాలకూటవిషమ! గద్దెనెక్కు
ప్రేమ! మకుట మిచ్చి తొలగు మీ రాజ్యంబు
హృదయమా! విషంబు ద్రావుమింక॥

ఉగ్రు.—అయినప్పటికి మనస్సు నెట్లో సంతుష్టి పర్చుకొనుము.

పుళిం.—హా! రక్తము! రక్తము! రక్తము!

ఉగ్రా.—అయ్యా, శాంతింపుము, శాంతింపుము. బహుశః మీ మనస్సు మరల తిరుగ గలదు.

పుళిం.—ఉగ్రా, లేదులేదు. ఇక తిరుగదు ?

తే. గీ॥ భూరిబడబానలంబట్లు భుగభుగమను
సప్తసంద్రము లింకిన చల్లబడదు
వెనుక తిరుగదు శాంతింప దని యెరుంగు
తగిన పగనాగు సాధింప నగుదుదనుక॥

ఇదిగో, స్వచ్ఛంబగు నీ నీల నభోమండలము క్రింద ప్రతినఁ బట్టుచున్నాను.
(అని మోకాళ్లమీద వ్రాలుచున్నాడు.)

ఉగ్రు,—అయ్యా, అప్పుడే లేవవద్దు (అని తానును మోకాళ్లపై బడుచున్నాడు.)

సీ॥ నిత్యంబు మండెడు నింగితారకలార! సతతంబు మాకర్మసాక్షులార!
మాచుట్టువర్తించు పంచభూతములార! మముగాచి రక్షించు మాన్యులార!
ఉగ్రుండు తనయొక్క యూహయు తెలివియు ప్రాణము భక్తియు బలముమనము
యొగ్గవడినయట్టి యీపుళిందుని సేవకర్పించు సాక్షులుమీరలెల్ల

ఆ. వె॥ నతనియాజ్ఞవచ్చు టాలస్యమే గాని
శిరసున ధరియింప సిద్ధమైతి
నెట్టిఘోరమైన నెంతపాపంబైన
నెంతరక్తకలితమైనగాని॥ (లేచుచున్నారు.)



పుళిం.—నీప్రేమను శుష్కనమస్కారములచేఁగాక గొప్పయుపకారములచే నభినందింతును. ఇకమూడు దినములలో కృష్ణుండు చచ్చెనని వార్తఁదెలుపుము.

ఉగ్రు.—తమయాజ్ఞచొప్పున నామిత్రుండు చచ్చెను. కాని యామెనుమాత్రము బ్రతుకనిమ్ము.

పుళిం.—ఛీ! దురాత్మురాలు, ఆమెకధోగతియే! నాతోడరమ్ము. ఆ సుందరపిశాచమున కట్టి చావునుఁ గల్పింపవలయునో విచారింతము. నీవిప్పుడు నిజముగా నా యువసేనానివి.

ఉగ్రు.—నేను సర్వదా తమదాసుఁడను.

## రంగము IV

(సుశీలయు కమలయు విదూషకుడును ప్రవేశించుచున్నారు.)

సుశీల.—వయస్యా, యువసేనానియగు కృష్ణుండెచ్చటున్నాడో తెలియునా ?

విదూ.—నేనేమిగూఢచారుడనా ఆసంగతిని తెలిసికొనుటకు. ఒకవేళ తెలిసిన నతఁడొక చోటనున్నాడని చెప్పగలనా ?

సుశీ.—ఏమి ?

విదూ.—ఏమి! అతడు మనిషి కాడా ?

సుశీ.—అయిననేమి ?

విదూ.—కాళ్లులేవా ?

సుశీ.—నీమాట లర్థమగుటలేదు స్పష్టముగఁ జెప్పుము.

విదూ.—ఒకచోటనుండి, మరియొకచోటకు, మరియొకచోటనుండి యింకొకచోటకు, ఇంకొకచోటనుండి వేరొకచోటకు నడిచి పోవుచుండునుఁగాన నెక్కడచోట నుండునని నేను చెప్పగలనా ?

సుశీ.—ఛీ, ఛీ, ఆయనెచ్చట బసచేసియున్నాడో నీవుచెప్పెదవా ?

విదూ.—ఊహూ! చెప్పను.

సుశీ.—ఏల చెప్పననుచున్నావు ?

విదూ.—నాకు తెలియదు గనుక.

సుశీ.—అటులైనఁబోయి కనుగొనిరమ్ము.

విదూ.—ఆహా, ప్రపంచమంతను సాటింపుచేయించెదను. కృష్ణుఁడెచ్చటనున్నాడో తెలిసికొనివచ్చి చెప్పెదను. (అని పోవుచున్నాడు.)

సుశీ.—కమలా, నా రుమాలెచ్చట పోయియుండవచ్చును?

కమల.—దేవీ! నాకుఁ దెలియదమ్మా.

సుశీ.—కమల్కా, నామాటనమ్ము. వేనవేలుగల వగహాల మూటబోయినఁ నాకంత వంత గలగదుసుమా! కాని.

ఆ. వె॥ నాథుడెంతో దలప నయవర్తనము వాఁడు
స్వచ్ఛమతనిమనసు శాంతమూర్తి
అలతిజనుఁబోలె ననుమానమునఁబోఁడు
కానిమదినికొంత కలఁతఁబడును॥

కమల.—ఆయ ననుమాన స్వభావము గలవాఁడుకాఁడా?

సుశీ.—ఎవరు? ఆయనా! ఆయన జన్మదేశమునంగలి సహస్రకిగణాండట్టి కిల్బిషంబుల నెల్ల హరించెను సుమా!

కమల.—అదిగో! వచ్చుచున్నారు.

సుశీ.—కృష్ణుండు మరల యుద్యోగంబునందుంచ బడువఁ కాయనను నే వదిలిపెట్టను.

(పుళిందుడు ప్రవేశించుచున్నాడు.)

సుశీ.—నాథా, మీకు స్వస్థముగనున్నదా?

పుళిం.—ప్రియసఖీ, బాగుగ నేయున్నది. (స్వగతము) నటించుటెంత కష్టముగనున్నది సుశీలా, క్షేమముగనుంటివా?

సుశీల.—ప్రియనాథా, క్షేమము.

పుళిం.—నీచేయినిటు దెమ్ము, నీచేయి బహుచల్లగనున్నది.

సుశీ.—ఈచేయి వృద్ధాప్యమును గాని దుఃఖమును గాని యింక నెరుంగదే, స్వామీ!

పుళిం.—ఈచేయి నీహృదయముయొక్క చల్లదనమును ఔదార్యమును, దెలియజేయుచున్నది. వేడిమియు చల్లదనమునుఁగూడ నున్నవి. తపంబు, జపంబు, నీమంబు, ఉపవాసంబు, జాగరంబునీచేయి నీకుబోధించుచున్నది. ధర్మంబును ధిక్కరించు పెనుభూతమిం దప్పుడప్పు డాశ్రయించుచుండును. మంచిచేయి, ఔదార్యము గలచేయి.

సుశీ.—మీరట్లు నిశ్చయముగఁ జెప్పవచ్చును. ఆచేయియేగదా నా హృదయమును తమకు సమర్పించినది.

పుళిం.—మిక్కిలి ఔదార్యము గలచేయి. పూర్వకాలమందు హృదయపూర్వకంబుగ పాణిగ్రహణంబులయ్యెడివి. నేడు కేవల పాణిగ్రహణంబులే గాని హృదయంబుల కిందేమియు సంబంధము లేదు.



సుశీల.—మీ మాటలు నా కర్థమగుటలేదు. రండి, మీ వాగ్దానము మాటేమిచేసినారు?

పుళిం.—ఏవాగ్దానము ప్రియా?

సుశీ.—మీతోఁబోయి మాట్లాడవలసినదని నేనుకృష్ణునకు కబురు పంపించితిని.

పుళిం.—నాకు జలుబుచేసి శిరోభారముగనున్నది. నీ రుమాలొక్కసారి యిటు తెమ్ము

సుశీ—ఇదుగో! తీసికొనుఁడు.

పుళిం.—ఇదికాదు, నేను పూర్వమొకసారి నీకిచ్చినది.

సుశీ.—అదా? ఇక్కడ లేదు.

పుళిం.—లేదా?

సుశీ,—లేదు. నిజముగ లేదు స్వామీ!

పుళిం.—హా! గొప్పదురదృష్టము! ఆ రుమాలు నొక ఐగుప్తదేశ వాసురాలు మాతల్లి కిచ్చినది. ఆమె గొప్ప మంత్రవేత్త. జనులయొక్క మనోభావములను గ్రహింప గలిగిన దివ్యదృష్టి యామెకుఁగలదు. ఆమె మాతల్లికిచ్చినపుడు ఆరుమాలును దగ్గర నుంచుకొనినయెడల నామె నాతండ్రికి ప్రేమపదమై యాయనను వశపర్చుకొను నట్లు చేయఁగలదని చెప్పెను. అమె దానిని పోగొట్టుకొనినను లేక మరియొవరికైన నిచ్చినను నాతండ్రియామె నసహ్యించుకొనుచు చంచలమనస్కుఁడయ్యెడివాడు. ఆమె చనిపోవునపుడు దానిని నాకిచ్చి నేను పత్నీసహితుఁడనై నపుడు నాభార్య కిమ్మని బోధించెను. నేనట్లనే చేసితిని. కావున నద్దాని నీ కనుపాపవలె భద్రంబుగఁ గాపాడుము. పోగొట్టినఁ గాని పరులకిచ్చినఁ గాని అనుపమానమైన యధోగతి ప్రాపించును.

సుశీ.—నిజముగ నట్లు సంభవమేనా?

పుళిం.—నిజము నిజము!

చ॥ పదపడి దానితంతువులు పావనమైనవి, మంత్రపూత మా
పదిలపు నేత, భూతలము భానునిచుట్టి చనంగ నెన్నియో
పదిపది వత్సరంబులను బాగుగఁజూచిన మంత్రకర్తె నె
మ్మది వివశంబు నొంద కడుమంజుల చిత్రమునల్లె పట్టునం
బొదివిన పుర్వులున్ మడివి,పుణ్యజలంబుల మున్గియారె సం
పదలకు నెల్ల కేతనము భాసురదివ్యప్రభావ వాసమున్॥

సుశీల.— నిశ్చయముగ నిదినిజమేనా ?

పుళిం.—ముమ్మాటికిని నిజము. కావున జాగ్రతగ దాని వెదుకుము.

సుశీ.—అటులైన నయ్యో! దైవమట్టి దాసిని నాకెందుకిచ్చె!

పుళిం.—ఏమి! ఎందుచేత?

సుశీ.—ఏలమీరింత భీకరముగ మాట్లాడుచున్నారు?

పుళిం.—పోయినదాయేమి? పోయినదీ! ఏమిచెప్పుచున్నావు? కనుపడలేదా?

సుశీ.—దైవము గాపాడుగాక! దైవము రక్షించుఁగాక!

పుళిం.—ఏమైనది చెప్పుము.

సుశీ.—పోలేదుకాని పోయిననేమి?

పుళిం.—ఏలాగు పోయినది?

సుశీ.—నేను పోలేదని చెప్పుచున్నాను.

పుళిం.—అటులైన తీసికొనిరమ్ము. నన్ను జూడనిమ్ము.

సుశీ.—ఏమి? తీసికొనిరాగలనుకాని యిప్పుడు తీసుకొనిరాను. నా విన్నపము నావల ద్రోసివేయుట కీ పన్నుగడ యని నాకు తెలియును. కృష్ణుని మరల నుద్యోగమున ప్రవేశ పెట్టు టెప్పుడు? నా ప్రార్థన విని సెలవిండు.

పుళి.—రుమాలు పోయి తీసికొనిరమ్ము: నా హృదయము తల్లడ పడుచున్నది.

సుశీల.—చాలు చాలు! అట్టి సమర్థుడు మరి మీ కెక్కడను దొరకఁడు.

పుళిం.—రుమాలు!

సుశీల.—నామనవి వినుడు. కృష్ణుని సంగతిఁ జెప్పుడు.

పుళి.—ఆ రుమాలు!

సుశీ.—మీ ప్రేమయందే తనయదృష్టమునుఁ జూచుకొని మీ యాపలందు భాగము పంచుకొనువాఁడు.

పుళిం.—రుమాలు!

సుశీ.—నిజముగా మీదే తప్పు.

పుళిం.—పో, పొమ్ము. (అని వెడలి పోవుచున్నాడు)

కమల.—ఈ తఁ డనుమాన మనస్కుఁడు కాడందురా?

సుశీల.—నే నిదివర కెన్నడు నిట్టిదిచూచియుండలేదు. తప్పక యా రుమాలునందు మహత్త్వ మేమైనాకలదు, పోయినందుకు నాకు కడు దుఃఖముగ నున్నది.



కమల.—తే.గీ.॥ ఒకటి రెండేండ్లు గాలేదు వికటమయ్యె
మగవలేతిండి యుదరముల్ మగలు మొదట
నాకలి కొలంది మెక్కుచు నంతయైన
కడుపు నిండిన త్రేన్తురు గాదె మనల॥

అదుగో! కృష్ణుండును నా నాథుండు నీలాగే వచ్చుచున్నారు.

(కృష్ణుడు ఉగ్రుడు ప్రవేశించుచున్నారు)

ఉగ్రు.—ఇంకొక మార్గములేదు. ఆమెయేచేయవలెను. అదుగో! ఆనందము! పోయి యామెను గట్టిగఁ బ్రార్థింపుము.

సుశీ.—ఏమి సౌజన్యనిధీ! కృష్ణా, విశేషములేమి?

కృష్ణ.—దేవీ, నాపూర్వవిజ్ఞాపనము. నే హృదయ పూర్వకమైన నుద్యోగధర్మపరత్వముతో గౌరవించు సేనానియొక్క ప్రేమకు మీ సుగుణ నికర సాధనంబులచేఁ బాత్రుడనగు నట్లుచేయ నేఁ బ్రార్థించుచున్నాను. నే నాలస్యంబు సహింపఁజాల కున్నాను. నా యపరాధ మంత యెక్కుడై నాపూర్వ సేవయు, ప్రస్తుతపరితాపంబును, భవిష్యత్ప్రవర్తనమును గూడ దాని బాగుఁ జేయఁజాలవేని, నా కా వార్తనైన స్పష్టముగఁ దెలిపినమేలని తలఁచెద. అట్లు తెలిసిన నే మనసు తృప్తిఁజేసికొని నా యదృష్టము జూపు మరియొక మార్గముఁ ద్రొక్కుకొందును.

సుశీల.—అకటా! సద్గుణధాముండవగు నో కృష్ణా, నా ప్రార్థన యేమియు పాటిరాకున్నది. నానాథుండు నా నాథుండుగాలేడు. అయన కోపావేశంబున మారినంతవరకు మనోతత్త్వమందును మారెనేమో నాకు తెలియదు. నీ పక్షమున నే జెప్పఁగలిగినంతయుఁ జెప్పి యాయన యాగ్రహంబునకుఁగూడ గురియైతిని. నీవు కొంత కాల మోపికతో నుండవలెను. నేఁజేయఁగలిగిన దంతయుఁ జేసెదను. నాకొరకు చేయగలిగినదానికంటె నెక్కువఁజేయ సాహసించెదను.

ఉగ్రు.—దేవరవా రాగ్రహముతో నున్నారా ?

కమల.—ఇప్పుడే ఇచ్చటనుండి వెళ్లిరి. ఆశ్చర్యముగ విహ్వాలమానసులై వెడలిరి.

ఉగ్రు.—అయ నాగ్రహమును పొందగలరా?

తే. గీ॥ ఇరుగడల ఫిరంగులుదాకి యితనిసేన
నెగురఁగొట్టంగ నావంతబిగువుచెడక
భూతమట్టులఁ బెనగి యద్భుతి నుకండె
శత్రువీరులనేఁజూడ చంపెనితడు॥

అట్టివాడాగ్రహంబునొందెనా? ఏదోగొప్పకారణముండును. నేపోయి కలిసికొనెదను. ఆతఁడు కోపమునొందినయెడల నేమోసంభవించియుండును.

సుశీ.—అట్లుచేయుము. నాప్రార్థనకూడ నదియే (ఉగ్రుడుపోవుచున్నాడు) తప్పక రాష్ట్రసంబంధమైన కారణమని తోఁచెడిని. వినీసుమండియో లేక యిక్కడనే యేదో కుట్రయో తెలియవచ్చియుండును. ఆయన నిర్మలమైన మనస్సున కేదియో కలతగల్గి యుండవచ్చును. అట్టి సందర్భములలో మనుజుల మనస్సుల వారిదృష్టి యందు గొప్పసంగతులుండినను స్వల్పవిషయంబులందు కలవరపడును. ఔను, అంతే నిజము.

తే. గీ॥ వ్రేలుపోటెత్త వేధించు వింతగతిని
తక్కినంగములనుకూడ దానివలెనె॥

వివాహాదినవర్తనము లెల్ల కాలముండుట యనువుకాదుగదా! కమలా, నే నాయన నిర్దయను గురించి ఖండించియుంటినిగాని యిప్పుడాయన నధర్మముగ నిందించితినని తలంచెదను.

కమల.—మీరు దలఁచినటుల రాష్ట్రవ్యవహారములే యాయనమనస్సును కలతనొందించెనుగాని మిమ్మనుగూర్చి కాకుండుగాక యనినేను దైవమును ప్రార్థించెదను.

సుశీ.—నేనాయన కాగ్రహ కారణంబైన కార్యంబు నేమియుఁజేసి యుండలేదే!

కమల.—అనుమానమనుజుల కా విచారణక్కరలేదు. కారణమువలన వా రనుమానము నొందరు. వా రనుమాన స్వభావులు గనుక నే యనుమానముగల వారగుదురు. ఆ అనుమానభూతము దానిమీద నే పుట్టి దాని నే తిని దానిమీద నే పెరుగును.

సుశీ.—అట్టి భూతము నా నాథుమనంబు నాశ్రయింపకుండుగాక!

కమ.—దేవీ, తథాస్తు!

సుశీ.—కృష్ణుడా, నేపోయి యాయన నరసెదను. నీ వీచుట్టుప్రక్కలనే యుండుము. వీలయినయెడల నాసాధ్యమైనంతవఱకు నీసంగతిని మనవిచేసెదను.

కృష్ణు.—దేవీ, మీకు సవినయంబుగ మ్రొక్కుచున్నాను.

(సుశీల, కమల పోవుచున్నారు.)

(సీమంతిని ప్రవేశించుచున్నది.)

సీమం.—సఖుడా సుఖముగనున్నావా?

కృష్ణు.—నీ వేపని మీద నిల్లు వెడలివచ్చితివీ? సుందరీ, సీమంతినీ ప్రియసఖీ, విశేషము లేమి? నీయింటికే వచ్చుచున్నాను.



సీమం.—కృష్ణుడా, నేను నీ బసకే పోవుచుంటిని. ఏమిది? మీరు కనుపడి వారము దినములైనది. వారము పగళ్లు వారము రాత్రులు. నూటఅరువది ఎనిమిది గంటలు ప్రియునెడబాసిన గంటలు! ఘడియారములనందుకంటె దీర్ఘములై యుండునుగదా! లెక్కచూడ వశమా?

కృష్ణు.—సీమంతినీ, క్షమింపుము. నేనిప్పుడు భారమైన విచారమున మున్గియుంటిని. కొంత మనశ్శాంతి కలిగిన పిమ్మట యీయపరాధమునుఁ దీర్చుకొనెదను. సఖీ, (సీమంతినికిచ్చుచు) నాకీరుమాలుమీఁది యల్లికను దీసియిమ్ము.

సీమ.—ఆ! కృష్ణుడా, ఇదెక్కడ నుండి వచ్చినది? మరియొక క్రొత్తప్రియురాలిచ్చిన బహుమతిగానోపు. నా దగ్గఱకిన్నాళ్లు రాకఁబోవుటకు కారణము తెలిసినది. ఇంతవరకు వచ్చినదా! మంచిది. మంచిది.

కృష్ణుడు.—ఛీ, ఛీ, నీ దురూహలు చాలింపుము. నాకింకెవరో స్త్రీ యిచ్చినదని నీ వన్యాయముగ భ్రమపడుచున్నావు. సీమంతినీ, నాకెవ్వరును దీని నియ్యలేదు నిజము.

సీమ.—అటులైన నిది యెక్కడిది?

కృష్ణు.—ఏవరిదో నాకు తెలియదు. నా గదియం దిది పడియున్నది. దీనిమీఁద నున్న యల్లిక యెంతయు శృంగారముగనున్నది. దీనినెవ్వరును మరల నడుగక పూర్వమే ఆ అల్లికను దెలిసికొనిన నెంతయు బాగుండును. త్వరితముగఁ దీసిపెట్టుము. కొంతకాలము నన్ను విడిచి పొమ్ము.

సీమం.—ఎందుకు విడిచిపెట్టిపోవలెను?

కృష్ణు.—నే నిక్కడ సేనాని కొరకు వేచియున్నాను. నేనిట్లు స్త్రీసమేతుండనై యుండ నాయన చూచుటంత గౌరవముగా నేనెంచుకొనను. నాకోరికయుఁగాదు.

సీమం.—నాకొక్క సంగతిఁ జెప్పినఁ బోయెదను. నేటిరాత్రి తమరుదయచేసెదరేమో తెలియఁ జేయఁగోరుచున్నాను.

కృష్ణు.—నే నిక్కడ వేచియుండవలెను. తరువాత త్వరలోనే వచ్చికలిసికొనెదను.

సీమంతిని.—మంచిది. నేను స్థితిగతుల ననుసరించి నడువవలెను.

---

## చతుర్థాంకము.

---

### రంగము I. భవనము నెదుట.

పులిందుడును, ఉగ్రుడును ప్రవేశించుచున్నారు.)

ఉగ్రు.—మీ రట్లు దలంచెదరా ?

పులిం.—ఉగ్రా, అట్లనే తలంచెదను.

ఉగ్రు.—ఏమి? రహస్యముగ ముద్దుఁబెట్టుకొనుటయా !

పులిం.—అధికారములేని ముద్దు.

ఉగ్రు.—నేను నా భార్యకొక రుమాలిచ్చిన,—

పులిం.—ఇచ్చిన ?

ఉగ్రు.—ఏమీ? అది ఆమెదే యగును. ఆమెదేగాన అమె మరియెవ్వరికైన నియ్య వచ్చును.

పులిం.—ఆమె తన మానమునకుఁగూడ నధికారిగాన దానినికూడ బోగొట్టుకొన వచ్చునా ?

ఉగ్రు.—అమె మానము కంటికి గన్పించునదికాదు. లోకములో ననేకమంది లేని వారి కది యున్నట్లు గాన్పించును. కాని రుమాలు విషయములో,—

పులిం.—ఓ దైవమా! నేను దాని మరచిపోయిన సంతోషించెదను.

తే. గీ॥ మృత్యు గృహముపై తీతువ మ్రోగినట్లు
నా స్మరణ కదివచ్చువినాశమునకు ॥

వాని చేతికి నా రుమాలు వచ్చినది !

ఉగ్రు.—ఆ! అంతటితో నేమైనది ?

పులిం.—ఇంకేమి గలదు ?

ఉగ్రు.—అతఁడు మీ కపరాధమొనర్చుచుండఁగ నే చూచితిననిగాని లేక దానిఁగూర్చి చెప్పుచుండఁగ నే వింటిననిగాని చెప్పిన నేమగును? కొందరు తుచ్ఛులు తమరంకు తనములనుఁ గూర్చి ప్రతాపములు గొట్టుచుందురుగదా!

పులిం.—అతడేమైన నట్లు చెప్పెనా యేమి ?

ఉగ్రు.—మహాప్రభూ, చెప్పెనుగాని ఇప్పుడు ప్రమాణముమీద లేదనిచెప్పుటకు మించి యేమియుచెప్పలేదు.



పులిం.—అతడేమి చెప్పెను ?

ఉగ్రు.—అతడంతయు చెప్పెను, చేసినదెంతవఱకో నాకు తెలియదు.

పులిం.—ఏమి ! ఏమి !

రుమాలు,—ఒప్పుదల,—రుమాలు,—ఒప్పుకొనిన తరువాత పడినకష్టమునకు శిరచ్ఛేదము; మొదట శిరచ్ఛేదము తరువాత ఒప్పుకొనుట :—నాయొడలు కంపమెత్తు చున్నది. తగినకారణముండక నాహృదయ మిట్లావేశమునొందదు. మాటలా నన్నిట్లు చలింపజేయుచున్నవి? ఛీ! పాపిష్టి చెవులు ముక్కులు కండ్లు.—సంభవమేనా ? ఒప్పు దల—రుమాలు! ఓపిశాచమా !

(అని మూర్ఛపోవుచున్నాడు.)

ఉగ్రు.—హా! హా!

తే. గీ॥ విషమ! తలకెక్కు మద్దియే విధము, బాగు !
పుడమి యవివేకు లీరీతి బొందవడరె ?
శుద్ధచరితలు విమల విశుద్ధ మతులు
పాపమెఱుగ కపయశస్సు పాలుఁగారె ?

దేవా, మహాప్రభో! లెమ్ము లెమ్ము.

(కృష్ణుఁడు ప్రవేశించుచున్నాడు.)

ఏమి, కృష్ణా, యిట్లు వచ్చుచున్నావు ?

కృష్ణు.—ఇది యేమి ?

ఉగ్రు.—సేనాని మూర్ఛవచ్చి పడిపోయెను. ఇదిరెండవసారి. నిన్ననొకసారి వచ్చినది.

కృష్ణు.—కణతలదగ్గిర గట్టిగ రాయుము.

ఉగ్రు.—కాదుండు. ఈరోగము క్రమముగ సద్దుకొనవలెను. మనము తొందర కలుగఁజేసినయెడల, నోటనురుగులుగ్రక్కి పిచ్చికేకలువేసి మరింత యెక్కువ బాధపడును. నీవు కొంచెము దూరముగఁ దొలగుము. ఆయనకుస్మారకమువచ్చును. ఆయన వెడలిపోయిన తరువాత నీతో కొన్ని ముఖ్యాంశములనుగూర్చి మాట్లాడవలసియున్నది. (కృష్ణుఁడు వెడలిపోవుచున్నాడు.)

సేనానీ, ఎట్టులున్నది ? మీతలకేమైన దెబ్బతగిలినదా ?

పులిం. —ఓరీ, నన్నాక్షేపించుచున్నావా ?

ఉగ్రు.—మిము నాక్షేపణా ! దైవమాన ! లేదు లేదు. మీయదృష్టమును పౌరుషముతో సహించుకొనవలెనని నా కోరిక.

పుళిం.—కొమ్ములున్న పురుషుడు మనిషియా పశువా ?

ఉగ్ర.—అట్లైన ప్రపంచములో మీవంటి పశువులెంతమంది లేరు ?

పుళిం.—అతడంతయు నొప్పుకొనెనా ?

ఉగ్ర.—అయ్యా, పౌరుషమువీడి మీరిట్లు వర్తింపకుడు.

ఉ॥ మీసము గడ్డముం గల్గి మీవలెకాడి ధరించు నెల్లరున్
మీసరి లాగుచుందురని మీరుదలంపుడు స్వాంతమందు సం
తోస మనన్య మబ్బురము! తొయ్యలి సౌఖ్యమటంచు మెచ్చుచున్
మోసమెరుంగలేక కడు మోదము నొందుచు తుచ్ఛతల్పముల్
డాసి చరించుచున్ మిగుల ధన్యులమంచును విఱ్ఱవీగు నా
వీసము సిగ్గులేని యవివేకు లనేకులఁ జూచుచుండమే ?॥

మీ యదృష్టము వలన నట్టివారికంటె మీరు మంచిస్థితియందున్నారు. ఏలనన, మీరొక్క యదార్థస్థితిని దెలిసికొని అట్టి దుర్భ్రమ పాలుఁ గాక యుంటిరి.

ఉ॥ దయ్యపు వెక్కిరింత పరదానవు హేళన లోకహాస్యమున్
నెయ్యపు పత్నియంచు గమనించి సుఖించుట గాదె జారిణిన్॥

కావున మన మేదో యొక నిశ్చయము చేసికొనినందు వలన మనకంత విచారముండ నేరదు.

పుళిం.—నీవు చెప్పినది లెస్సగనున్నది. నిశ్చయము.

ఉగ్రా.—మీరు కొంచెము దూరముగా నిలిచియుండుడు. శాంతము నవలంబించియుండుడు. మీరిచ్చట, మీవంటివారికి తగని దుఃఖములో మున్గియుండగ, కృష్ణుండు వచ్చియున్నాడు. మీ యావేశమున కేదియో కారణమును చెప్పివేసి అతని నవతలకుఁ బంపివేసితిని. మరల నాతోడ వచ్చి మాట్లాడవలసినదని చెప్పితిని. అతడందులకియ్యకొనెను. మీరీ చాటున దాగియుండి అతని ముఖమునందుఁ గనుపడు పరిహాసములను తిరస్కారములను మీరు కనిపెట్టుడు. అతనిచే నాకథ నంతను మీయెదుట మరల చెప్పించెదను. ఎప్పుడు, ఏలాగు, ఎంతకాలము క్రింద మీ భార్య నాతఁడు కలిసికొనెనో మరల నెప్పుడు కలిసికొనఁగలఁడో చెప్పించెదను. అతని యభినయముల నన్నియు మీరు కనిపెట్టుచుండుడు. మీరు బహు శాంతులై యుండవలెను. లేనియెడల కార్యభంగమగును.

పుళిం.—ఉగ్రా, నాశాంతమునం దతి చమత్కారముగ నుందు. అయితే విను, రక్త కలితము !



ఉగ్ర.—మేలు మేలు! అయితే ప్రతిదానికిని సమయ మున్నది. కొంచెము దూరముగ నుండుడు.

(పుళిందుడు పోవుచున్నాడు.)

నేనిప్పుడు కృష్ణునితో సీమంతినిఁగూర్చి ప్రశంసించెదను. అతఁడు దానిని గూర్చి వినినతోడనే సంతోషము నాపుకొనలేడు. అదుగో, అతఁడు వచ్చుచున్నాడు. అతఁడు సంతోషపడిన కొలదిని పుళిందుడు విషాదపడును. అతని పిచ్చియనుమానము కృష్ణుని యభినయముల నన్నిటిని వేరువిధముగఁ దలంచును.

(కృష్ణుడు మరల ప్రవేశించుచున్నాడు.)

యువసేనానీ, కుశలమా ?

కృష్ణ.—నీవు పిలుచుచున్న బిరుదు లేమిచే మరింత విచారము గలుగుచున్నది.

ఉగ్ర.—సుశీలను వదలిపెట్టవద్దు. ఆమె వలననే నీ కార్యము సుష్టుపడఁగలదు (మెల్లగా) ఈ కార్యము సీమంతిని చేతిలోనున్న నెంత సులభముగ గట్టెక్కెడిది !

కృష్ణ.—అయ్యో! పాపము పిచ్చిది.

పుళిం.—(స్వగతము) అప్పుడే ఎట్లు నవ్వుచున్నాడో !

ఉగ్ర.—ఏ స్త్రీయు పురుషునట్లు ప్రేమించియుండగా నే చూడలేదు.

కృష్ణ.—పాపము వెర్రిది ! నిజముగ నన్ను బాగుగ ప్రేమించునని దలంచెదను.

పుళిం.—(స్వ) అదుగో! కొంచెములేదని చెప్పుచు నవ్వుచున్నాడు.

ఉగ్ర.—కృష్ణా, వినుచున్నావా?

పుళిం.—(స్వ) మరలఁ జెప్పుమని యడుగుచున్నాడు. బాగుగఁ జెప్పితివి. బాగుగఁ జెప్పితివి.

ఉగ్ర.—నీ వామెను వివాహము చేసికొందువని చెప్పుచున్నారు. నిజమేనా ?

కృష్ణ.—హాహా! హా!

పుళిం.—(స్వ) అటులనే చెప్పించు.

కృష్ణ.—నే నామెను వివాహమా! నా బుద్ధికి కొంచెము గౌరవమిమ్ము. అంత అన్యాయముగ మారిపోలేదు. హా! హా! హా!

పుళిం.—(స్వ) అలాగే! అలాగే అలాగే! గెలిచిన వారాలాగే సంతోషించెదరు.

ఉగ్ర.—నీ వామెను వివాహమును జేసికొందువని వాడుక పడినది.

కృష్ణ.—నా ప్రార్థన మన్నించి నిజముఁ జెప్పుము.

కృష్ణ.—లేనియెడల నన్ను దుష్టాత్ముఁడని పిలువుము.

పుళిం.—(స్వ) నన్ను తీసి పారవేసితివా ? మంచిది.

కృష్ణ.—అది ఆ పిచ్చిది వేసిన వాఁడుక కోని మరియొకటికాదు. ఆమెకు నాయెడఁగల ప్రేమచే నట్లు మనస్సులోఁ దలంచి యుండవచ్చునుగాని నేను వాగ్దానముచేసి యుండలేదు.

పుళిం.—(స్వ) ఉగ్రుఁడు నాకు సైగఁజేయుచున్నాడు ఇప్పుడు. కథఁజెప్ప ప్రారంభించు చున్నాడు.

కృష్ణ.—ఆమె యిప్పుడిక్కడకే వచ్చినది. ప్రతిచోటను నావెంటబడి వచ్చుచుం డును. సముద్రతీరమున నేను కొందఱు వినీసు వాసులతో మాట్లాడుచుండఁగ నీ కొంటె యచ్చటకు వచ్చి నామెడ పట్టుకొని నన్నాలింగనము చేసికొన్నది.

పుళిం.—(స్వ)ఓ ప్రియకృష్ణా! ఓ ప్రియకృష్ణా!యని కాబోలు. ఆ అభినయమట్లు దెలియఁ జేయుచున్నది.

కృష్ణ.—నా మెడపట్టుకొని వ్రేలాడి హర్షాశ్రువులొలుక నేడ్చినది. హా! హా! హా!

పుళిం.—(స్వ) ఇప్పుడు తనను నా గదిలోని కెట్లుతీసికొనిపోయినదో చెప్పును కా బోలు. ఆ! దుష్టాత్మా! నీతలకనుపడుచున్నదిగాని, తలఁగొట్టి తినిపించుటకు కుక్క లునక్కలు గానరాకున్నవిరా!

కృష్ణ.—మంచిది, ఇక నామె సహవాసమును విడిచివేయవలెను.

ఉగ్రు.—అదుగో! చూడు మిటు వచ్చుచున్నది.

(సీమంతినిప్రవేశించుచున్నది)

కృష్ణ.—నావెంట నంటి వేధించు చుంటివేమి ?

సీమ.—దయ్యములు పిశాచములు నీవెంటఁబడి వేధించు గాక ! నీ విప్పు డిచ్చిన రుమాలుయొక్క యర్థమేమి ? తీసికొనుటకే నెంత తెలివితక్కువ దానను ! నేనాయల్లికనుఁ దీయవలెనా ? ఎక్కడి నుండి వచ్చెనో తెలియక నీ గదిలో నున్నదనుటకు నమ్మ దగిన వస్తువే యిది ! ఇదెవరో ప్రియురాలిచ్చినదై యుండి తీరవలెను. నే నీయల్లికను దీయవలెనా ? నీ కెవరిచ్చిరో వారి నే దీయుమని యడుగుము. నే నీ పనిని చేయను.

కృష్ణ.—సీమంతినీ, ప్రియసఖి సీమంతినీ, ఏమిది! ఏమిది!

పుళిం.—(స్వ) సత్యము సత్యము. ఆరుమాలు నాదియే.



సీమం.—ఈ రాత్రి భోజనమునకు వచ్చిన రావచ్చును. లేనియెడల మీ యిష్టమైనపుడు రావచ్చును. (పోవుచున్నది.

ఉగ్రు.—వెంట నంటి పొమ్ము.

కృష్ణ.—నిజముగా వెళ్లవలెను. లేనియెడల వీధినిఁ బడి యల్లరి చేయును.

ఉగ్రు.—నీ వచ్చట సాయంకాలము భోజనము చేసెదవా ?

కృష్ణ.—చేయ నుద్దేశించితిని.

ఉగ్రు.—మంచిది. నేను నిన్ను మరలఁ గలసికొందును. నీతో కొంత మాట్లాడవలసి యున్నది.

కృష్ణ.—తప్పక రమ్మని ప్రార్థించెదను.

ఉగ్రు.—పొమ్మువచ్చెదను. (కృష్ణుడు పోవుచున్నాడు.

పుళిం.—(ముందుకువచ్చి) ఉగ్రా, వీనినెట్లు సంహరించవలెను ?

ఉగ్రు.—తన పాపకార్యమునుఁగూర్చి ఎట్లునవ్వెనో చూచితిరా ?

పుళిం.—ఓ ఉగ్రా !

ఉగ్రు.—మీ రా రుమాలును చూచితిరా ?

పుళిం.—నాదేనా ?

ఉగ్రు.—సందేహమేమి ? మీదే! మీభార్యనుగూర్చి ఎంతలక్ష్యముగ మాట్లాడెనో వింటిరా ! దాని నామె యతనికిచ్చెను. అతఁడు దాని తనఁటకత్తెకిచ్చెను.

పుళిం.—ఆ! వానిని రోజుకొక్క ముక్క క్రిందకోసి పదేండ్లుచంపినను నా కసితీరదు హా! రూపవతి! సుందరవతి ! లావణ్యవతి !

ఉగ్రు.—ఇఁక మీరు దానినంతయు మఱచిపోవలెను.

పుళిం.—ఔనౌను. ఆమె నేడురాత్రిచచ్చి కుళ్లి నాశనమగుగాక !ఇక బ్రతుకదు. నేఁడు నాగుండె రాయిస్థమైనది. కొట్టుకొనిన చేయినొచ్చుచున్నది. హా! ప్రపంచ మందిఁకనట్టి సతియుండఁబోదు! చక్రవర్తి పజ్జనలంకరించి యతని నాజ్ఞాపింప తగినది.

ఉగ్రు.—మీరాత్రోవ నిఁక త్రొక్కఁగూడదు.

పుళిం.—చంపివేసెదను. ఆమె యెట్టిదైయుండెనో చెప్పితిని. సూదులతో నెట్టి యల్లిక ల్లును. గానకళయందెంత నిపుణురాలు! హా! భల్లూకంబునైన సాధించు గాంధ ర్వవిద్యాధురణురాలు ! ఏమిశక్తి చాతుర్యములు !

ఉగ్రు.—అందువలననే మరింత యసహ్యకరమైనది

పుళిం.—ఔను, వేయి రెట్లసహ్యాము! వేయి రెట్లసహ్యాము! అటుపైన నెంత సౌజన్య మెంత వినయము!

ఉగ్ర.—ఆ. అతివినయము.

పుళిం.—నిశ్చయము నిశ్చయము. ఉగ్రా, ఆ కరుణ! ఆజాలి! హా! ఉగ్రా!

ఉగ్ర.—ఆమె పాపకర్మములు మీకంత మధురముగనున్న యెడల మీ రామె యపరాధమున కనుజ్ఞనిండు. ఏమన, మీకే కష్టములేకున్న యెడల మరియెవరికిఁ గలదు?

పుళిం.—లేదా? ముక్కలు ముక్కలుగా నరకివేసెదను. నన్నా మోసము చేయుట!

ఉగ్ర.—హేయము.

పుళిం.—నా యుద్యోగస్థునితోనా!

ఉగ్ర.—మఱింత హేయము.

పుళిం.—ఉగ్రా, నాకు కొంచెము విషము తెచ్చియిమ్ము. ఈ రాత్రి నే నామెతో చర్చింపను. ఆమె సౌందర్యము నా మనస్సు కరంచివేయును. ఈరాత్రి ఉగ్రా!

ఉగ్ర.—విషమువద్దు. ఆమె పాడుచేసిన పాన్పునందే యామె నురిఁదీయుము.

పుళిం.—మంచిది, మంచిది. ఆశిక్షయొక్క ధర్మమెంతయును యుక్తముగనున్నది. మంచిది.

ఉగ్ర.—ఇక కృష్ణునికి నే తలవరి నయ్యెద. ఈయర్ధ రాత్రమున కంతయును వినెదరు.

పుళిం.—బహు బాగున్నది.

(భేరి వినవచ్చుచున్నది.)

ఆభేరి యెవ్వరిది?

ఉగ్ర.—వినీసునుండి యెవరో వచ్చియుండవచ్చును. రాజువద్దనుండి రఘుపతి వచ్చియున్నాడు. అదుగో! మీభార్యయతనిఁ జూడఁ బోవుచున్నది.

(రఘుపతియు సుశీలయు సేవకులును ప్రవేశించుచున్నారు)

రఘు.—సేనానీ, నీకు జయము జయము.

పుళిం.—అయ్యా, నమస్కారములు.

రఘు.—రాజును సభ్యులును మి మ్మాశీర్వదించుచున్నారు.

(ఒక లేఖను పుళిందునికిచ్చుచున్నాడు.)

సుశీల.—సోదరవర్యా, రఘుపతీ వినీసునందు విశేషములేమి?

ఉగ్ర.—ఆర్యా, మిమ్మను జూచుటకు నా కెంతయు నానందముగనున్నది. అయ్యా, మీకు స్వాగతము.



రఘు.—అయ్యావందనములు. యువసేనాని కృష్ణునకుఁ గుశలమేనా?

ఉగ్ర.—అయ్యా, జీవించియున్నాడు.

సుశీ.—సోదరా, నానాధునకును అతనికిని కొంచెము మనస్పర్థసంభవించినది. మీరు వారిని సంధిఁజేసెదరని నమ్ముచున్నాను.

పుళిం.—నీకు నిశ్చయమేనా?

సుశీ.—నాధా!

పుళిం.—(లేఖను చదువుచు) "ఇది మీరు తప్పకఁ జేయుదురని నమ్ముచు నిట్లు"

రఘు.—ఆయన పిలువలేదు. లేఖను చదువుచున్నారు. సేనానికిని కృష్ణునకును విరోధము గల్గెనా?

సుశీ.—బహు విషాదకరమైన వైషమ్యము. కృష్ణుని యెడల ప్రేమకై నెంతైన వగచుచున్నాను.

పుళిం.—అగ్ని, గంధకము!

సుశీల.—నాధా!

పుళిం.—నీకు వివేకమున్నదా?

సుశీల.—ఏమి! ఆయనకు కోపముగ నున్నదా యేమి?

రఘుపతి.—అయియుండవచ్చును. ఆయుత్తర మాయన మనస్సును కలంచి యుండవచ్చును. కృష్ణునకు సైన్యాధిపత్యమిచ్చి యాయన నింటికి మరలుడని వారాజ్ఞాపించియున్నారు.

సుశీల.—నామాట నమ్ముడు. నాకు సంతోషముగనున్నది.

పుళిం.—నిజముగా!

సుశీ.—నాధా!

పుళిం.—నీపిచ్చిఁజూడ నాకును సంతోషముగనున్నది.

సుశీ.—ప్రియసఖా! ఎటులో?

పుళిం.—ఓపిశాచీ (అని కొట్టుచున్నాడు.)

సుశీల.—నేనీయాదరణ కర్హురాలను కాను. (ఏడ్చుచున్నది.

రఘు.—సేనానీ, నేనీసంగతిని చూచితినని ప్రమాణము చేసినను వినీసునందు నమ్మరు. మీరు చేసినపని బాగుగనుండలేదు. ఆమె యేడ్చుచున్నది. పోయి యోదార్పుము.

పులిం.—ఓ దయ్యమా, ఓపిశాచమా!

తే. గీ॥ పొలతి కన్నీరు భూమిపై బొదుగఁ బడిన
నామె రాల్చెడు ప్రతి బిందు వవని మీద
మొసలి యగునది తథ్యంబు మోసమద్ది
ఛీ! వెడలిపొమ్ము సముఖమ్ము చెంతనుండి. ॥

సుశీ.—నే నిచ్చటనుండి మీ మనస్సు నొప్పింప నొల్ల (అనిపోవుచున్నది)

రఘుపతి.—నిక్కముగ నెంత వినయవిధేయతలు గలది! మరల బిలువుమని నేను మిమ్ము ప్రార్థించెదను.

పులిం.—ఓ యువతీ!

సుశీ.—ప్రాణనాథా?

పులిం.—అయ్యా మీ క్కామెతో నేమి పనియున్నది?

రఘు.—ఎవరకి నాకా!

పులిం.—ఔను. ఆమెను తిరిగి రప్పింపమని మీరుకోరినారుగదా! ఆమె తిరుగఁ గలదు. ఇంకను తిరుగఁగలదు. దిమ్మ తిరుగునట్లు తిరుగఁగలదు. ఏడువగలదు. ఇంక నేడువఁగలదు. విధేయురాలు! విధేయురాలు! అతి విధేయురాలు! ఆహా! ఎంత చక్కని వేషము! ఏమి నటన! నన్ను దేశమునకు తిరిగిరమ్మని యాజ్ఞాపించినారు.—పో వెడలిపొమ్ము. నే నిప్పుడే నీ కొరకు కబురుపంపెదను.—అయ్యా, నే నాజ్ఞను శిరసావహించెదను. వినీసునకు వచ్చెదను.—ఛీ! లేచిపొమ్ము—(సుశీల పోవుచున్నది) కృష్ణుఁడు నా యుద్యోగమును స్వీకరించువాఁడు. మఱియు నీ రాత్రి మన మిద్దఱమును మా యింటి యందు భోజనము చేయుదము. మీకు సైప్రసులో స్వాగతము—కుక్కలు అడవిజంతువులు!

(పులిందుడు పోవుచున్నాడు.)

రఘు. ఉ॥ శాంతుడు దాంతుడంచు సభ చాలఁ బ్రశంస యొనర్చు మూరు డీ
స్వాంతమువాడె? మది చంచల మొందగఁ జేయ లేదు ర
వ్వంతయటంచు బల్కరె? సెబాసితఁడా! ధృఢసౌహృదంబు దు
ర్దాంతప్రమాద ఘూతమును దాకినఁగుంఠితు జేయదందురే! ॥

ఉగ్ర.—ఇతఁడు మిక్కిలి మారి పోయెను.

రఘు.—ఆయన బుద్ధి సరిగా నున్నదా? లేక మతి దప్పినదా?

ఉగ్ర.—ఉన్నదేమో యున్నాడు. నేను మాత్రము ఖండించి చెప్పఁజాలను. అత డుండ వలసి నట్లుండకఁ బోయినయెడల నట్లుండ వలెనని నేను దైవమును ప్రార్థించెదను.



రఘు.—ఏమిటి! భార్యను పదిమందిలో కొట్టుటా!

ఉగ్ర.—నిజముగ నది బాగుండలేదుగాని కార్యమంత కంటె చెడ కుండిన యెడల మేలే.

రఘు.—అతఁడు మామూలుగ నిట్లుండువాఁడా? లేక నేడువచ్చిన లేఖ క్రోధ కారణమైనదా?

ఉగ్ర.—అయ్యా! నేను జూచినదియు, విన్నదియు చెప్పుట ధర్మము కాదు. మీరు చూచిన యెడల ఆయన బుద్ధులు మీకే తేట పడఁగలవు. నే నా యాస పడు టెందుకు? ఆయన వెంటఁ బోయి పరికింపఁ గనిపెట్టి యుండుడు.

రఘు.—నేను నిక్కముగ నతనిని గూర్చి మోసపోయితిని.

రంగము II భవనములో నొకగది.

(పులిందుడును ~~సుశీల~~యు ప్రవేశించుచున్నారు)

పులిం.—నీ వేమియుఁ జూచి యుండలేదా?

కమల.—నే నెప్పుడు వినలేదు. అనుమానమైన పడలేదు.

పులిం.—ఔను. కృష్ణుడును ఆమెయు నుండగ నీవెప్పుడైనఁ జూచితివా?

కమల.—చూచితినిగాని యందేమి యుపద్రవ మున్నది? వారు మాట్లాడినప్రతి ముక్కయు నే విని యుంటిని.

పులిం.—వారెప్పుడును రహస్యముగ మాట్లాడలేదా?

కమల.—మహాప్రభూ! ఎప్పుడును లేదు.

పులిం.—నిన్నెప్పు డివతలకవతలకుఁ బంపలేదా?

కమల.—లేదు.

పులిం.—విసనకఱ్ఱ, రుమాలు, బట్ట, యేమైన తేవలసినదని పంపలేదా?

కమల.—ఎప్పుడును బంపలేదు.

పులిం.—ఆశ్చర్యముగ నున్నది!

కమల.—ఉ॥ ప్రాణమునైననొడ్డెదను పావనియాసతి, వేరుసేయ కే
డని దురాత్ముడప్పగిది హీనవిచారము బోధఁజేసినన్
దానిమనంబుఁ జేర్పకము దగ్గుడుఁగావు తనాఖలుండు! మీ
మానిని దుష్టయైననిఁక మానవుడెవ్వఁడుఁ జెప్పఁజాలు నా
మానిని సచ్చరిత్రయని మానినులందరు దోసపుంజముల్ ॥

పుళిం.—ఆమెనిటు రమ్మని పిలుచుకొనిరమ్ము. (కమలపోవుచున్నది) చాలినంతఁ జెప్పినది. ఇది దూతిక. ఇఁక నింతకంటె చెప్పదు. అదుగో! ఆ కపటజారిణి వచ్చుచున్నది. దుష్టగహాస్యములపెట్టె! ఇంకను మ్రొక్కి ప్రార్థనలఁగూడఁ జేయును.

(కమలయు సుశీలయు ప్రవేశించుచున్నారు.)

సుశీ.—నాథా, ఏమి సెలవు?

పుళిం.—సఖీ, ఇటురమ్ము.

సుశీ.—తమయభీష్టమేమి?

పుళిం.—ఏమీ? నీకండ్లనుఁ జూడనిమ్ము. నాముఖమునకేసి చూడు.

సుశీ.—ఈ భయంకరమగు కోరికేమి?

పుళిం.—(కమలతో) ఓజవ్వనీ, నీయుద్యోగమునుఁ జేయుము. ఎవరైన వచ్చినయెడల దగ్గిగాని తుమ్మిగాని తెలియఁజేయుము. పొమ్ము, నీమామూలు మంత్రాంగము కానిమ్ము.

సుశీ.—మీ మాటల కర్థంబు తెలియకున్నది. మీ భాషయందు భయంబు జూపట్టుచున్నదిగాని యర్థంబగుటలేదు.

పుళిం.—ఏమి? నీ వెవరు?

సుశీ.—నాథా, మీప్రియ సఖిని. మీ భార్యను, మీ సహ ధర్మిణిని.

పుళిం.—రమ్ము, ప్రమాణముచేయుము. నీధర్మవేషమునుఁ జూచి యమదూతలుగూడ దగ్గరరాశంకింతురు. అటులైన నీపాతకంబు ద్విగుణంబగును సుమీ! నీవు ధర్మము తప్పనిదానవని ప్రమాణము చేయుము.

సుశీ.—దైవంబు నిజంబెరుంగు.

పుళిం.—ఆ! దైవమెరుగును నీవు పాపాత్మురాలవని.

సుశీ.—నే నేపాపము చేసితిని? నేనెట్లు పాపాత్మురాలను.?

పుళిం.—హా! సుశీలా! పొమ్ము పొమ్ము.

సుశీ.—హా! దుర్దినమా! ఎలయేడ్చుచున్నారు?

ఉ॥ వీరకులావతంస! మదివేదురు బొందగనేల? మీదు క
న్నీరునకేను కారణమె? మీరుదలంతురె? నాదు తండ్రిచే
కూరెనటంచు నాజ్ఞ యిటుగుందుచు నింటికిఁ జేరనైన నా
భారపుదోషమిప్పుగిది భామిని నాపయిఁ ద్రోయ ధర్మమా?
తీరదు నాకు తండ్రికినిఁ దీరనయప్పుడె మీకువానికిన్ ॥



పుళిం.—ఉ॥ గాసిలఁ జేసినన్ను కడగండ్ల పరితప్తునొనర్ప దైవ మెం
తేసివ్రణంబులన్ రుజల తీరని బాముల గ్రుమ్మరించినన్,
జేసిన నన్ను బానిసగ చించిన కోరికలన్ దరిద్ర వా
రాశిని నోటిదాక పవరంబున ముంచిన నేమిచేసినన్
వీసముశాంతియైన మనవీధిని నుండదె యాత్మనెక్కడో॥

కాని హాహా!

ఉ॥ కాలము వ్రేలు సుస్థిరత గాదిలి జారిణి భర్తయంచు నే
కాలముఁ జూప హాస్యమునఁ గ్రాలెడు నిశ్చయ విగ్రహంబనై
ఫాలము నెత్తజాలని విపత్తున నుండెడు జన్మయెత్తితిన్
తాళుమనట్టులైన మరి తాళగ లేని యవస్థఁజిక్కితిన్॥

అని యెద్దియన,

ఉ॥ భావమునందు భాగ్యమని బంధురప్రేమల దాచి తెచ్చటో
జీవము, లేక నాశమని చేర్చితి నాయువు పట్టు లెచ్చటో
జీవప్రవాహనీగముల చెమ్మజనించి స్రవించుచుండు నా
తావిక నెండ పంకమునఁ దారెడు కుల్లుపురుంగులయ్యెనో!॥

తే. గీ॥ శాంతి! బింబోష్ఠి! పంకజ చారునేత్రి!
దేవతలచాన! వచ్చి యీదిక్కుమాకు
భీకరాకార మూర్తివై భీతిఁగొనము
పాపకూపమున కిచట కాపురంబు?

సుశీ.—ఉదాత్తమతియగు నా స్వామి నన్ను ధర్మంబుఁదప్పని దానిఁగఁ దలంతురని నమ్మెదను.

పుళిం.—ఔనౌను.

తే. గీ॥ జీర్ణపలలంబు పైగాలి చేరి వీవ
గానె యుదయించు పుర్వుల గతినిఁదలతు.॥

తే. గీ॥ కనుల పండువ గలుగంగఁ గలయఁ బూచి
ముఖము మొత్తంగ నాసిక మొద్దు వడగ
కమ్మతావుల వెదజల్లు కొమ్మనీవు
పుడమిఁబుట్టకున్నను శుభంబౌదవుగాదె!॥

సుశీ.—అకటా! నే నే పాపకర్మంబుఁ జేసితిని?

పుళిం.—ఉ॥ స్వచ్ఛపు పత్రమియ్యది ప్రశస్తపు పుస్తక మిందు బ్రహ్మదా నచ్చు
పడంగ వ్రాయఁజనునా? యిటు జారిణి యంచునయ్యయో!

ఉ॥ చేసితి నేమి యేమి యని సిగ్గుదొరంగగనడ్గె దీవు నీ
చేసిన దుష్కృతంబులను జెప్పఁగఁ బూనిన కొల్మలట్ల నే
చేసెద నాధుచెక్కులను సిగ్గులు బొగ్గులు గాఁగఁ గాల్చెదన్
గోసము వచ్చు నింకఁ జెడు తొయ్యలి నీ పను లెంచిచూచినన్.॥

ఏమి చేసితివా?

ఉ॥ స్వర్గము దారిమూతవడు చంద్రుఁడు పూర్తిగఁ జూడసొల్లడే
మార్గము నందుఁబోయినను మైలఁదలంపక ముద్దు వెట్టు వే
మార్గినురుత్తు భూమిహారమార్గముఁ జొచ్చు కనంగలేకదు
ర్మార్గము దేవతానికర మంతయు కన్నులు మూతురిప్పుడే.॥

సుశీల.—దైవమాన! నన్నధర్మముగ నిందించుచున్నారు.

పుళిం.—నీవు కులటవు గావా!

సుశీ.—కాను, ముమ్మాటికిని కాను.

తే. గీ॥ పరుల కిల్బిష పవనంబు పైనసోక
కుండ గాచుకొ కులట గా కుంట యేని
శుద్ధ నిర్మల పాత్ర మీ సుదతి మీకు
పలుక రా నట్టి భాషల పలుకవలదు॥

పుళిం.—ఏమీ? నీవు కులటవుగావా?

సుశీ.—కాను, దైవము నన్ను రక్షించును.

పుళిం.—ఇది నమ్మదగిన మాటయే నా?

సుశీ.—హా! దైవము నన్ను రక్షించుగాక!

పుళిం.—అటులైన ఈశ్వరుడు నిన్ను కృపతోఁజూచునుగాక! పుళిందుని వివాహ మాడిన టక్కరి వార నారిగా నిన్నుఁదలంచితిని.—ఓ జవ్వనీ, నరక ద్వార ముఁగాచు నోనాతీ! ఇటురమ్ము, నీవే, నీవే, నిన్నే, నిన్నే. మాపని యైనది. ఇదిగో, నీయుద్యోగమునకు బహుమానము. నీనోటికి తాళము వేసికొని మా రహస్యమును దాచి యుంచుము.

(అని వెడలిపోవుచున్నాడు.)

మల.—అయ్యో, ఈసజ్జనుని యభిప్రాయమేమి? దేవీ, ఏమిచేయుచున్నావు?



సుశీల.—చెలీ, సగము నిద్రలో నున్నాను.

కమల.—అమ్మా, మహారాజుగారి భావమేమి?

సుశీ.—ఎవరిభావము?

కమల.—ఏమీ? మనమహారాజుగారు.

సుశీ.—మనమహారాజెవరు?

కమల.— మీ మహారాజుగారే దేవీ!

సుశీ.—నాకెవరునులేరు. కమలా, నాతోమాటలాడవలదు. చెలీ, నే నేడువఁజాలకున్నాను. నీప్రశ్నకు నా కన్నీరుతప్ప వేరొక ప్రత్యుత్తరములేదు. ఈరాత్రి నా తల్పంబుపై నా వివాహమునాటి మధుపర్కంబులఁ బరువుము. జ్ఞాపకముంచుకొనుము. నీమగని నొక్కసారి యిటుతీసుకొనిరమ్ము.

కమల.—ఏమో గొప్ప యుపద్రవము సంభవించినది.

(అని వెడలిపోవుచున్నది.)

సుశీ.—నన్నెట్లాగరించినను నాకు విచారములేదు. కాని నేనెటుల ప్రవర్తించినందుకిట్టియనుమానంబునఁ జిక్కాను! అనుమానమునకుఁగూడ నాస్పదములేదే.

(కమలయు ఉగ్రుడును ప్రవేశించుచున్నారు.)

ఉగ్ర.—దేవీ, తమయభీష్టమేమి? మీ రేమిట్లున్నవారు?

సుశీ.—నే చెప్పఁజాలకున్నాను.

తే. గీ॥ చిన్నపిల్లల బుద్ధులు చెప్పునపుడు
మక్కువగఁబిల్చి దరిఁజేర్చి మంచి మంచి
మాటలనువారి పెద్దలు మందలింత్రు
నన్ను నారీతిఁజేయుటే న్యాయమగును॥

ఉగ్ర.—దేవీ, ఏమిజరిగెను.?

కమల.—అయ్యో!

తే. గీ॥ నాథ! యీరోజు మహారాజు నయమువిడిచి
దేవి వినరాని మాటలఁ దిట్టివేసె
కులటజారిణియంచును కోపగించె
మంచివారలు దీనిసహించు టెట్లు?॥

సుశీ.—ఉగ్రా, నేనద్దాననా?

ఉగ్ర.—దేవీ, ఎద్ది?

సుశీ.—ఇప్పుడు మహారాజుగారు నన్ను నిరని కమలచెప్పినది.

కమల.—ఆయన కులటయన్నారు.

తే. గీ॥ భిక్షుకుండైన మత్తెక్కి ప్రేలడట్టి
కఠిన వచనములను కులకాంత నెపుడు॥

ఉగ్ర.—అతడట్లేల బల్కెను.?

సుశీ.—నాకు తెలియదు. నేనుమాత్ర మట్టిదానను కానేరను.

ఉగ్ర.—అమ్మా! ఏడువవలదు. ఏడువవలదు. అయ్యో! ఎంతకష్ట మెంతకష్టము!

కమల.—తే. గీ॥ తండ్రి తెచ్చిన గొప్ప సంబంధములను
విడిచి చుట్టాల పక్కల వీడిపోయె
కులటజారిణియనిపించు కొనుటకొక్క
ఏలదుఃఖంబు రాకుండు శీలవతికి॥

సుశీల.—ఇదియంతయు నా దురదృష్టము!

ఉగ్ర.—అతనియెడ నిట్టిమార్పెల వచ్చియుండును! ఏమైయుండునో?

సుశీ.—దైవమునకు తెలియవలెను.

కమల.—తే. గీ॥ ఖలుడుదుర్జనుడత్యంత తులువయెవడో
కుట్రగల్పించి బోధించె క్రూరుడెవడో
తనకు నుద్యోగమెద్దియో దగులుకొరకు
బన్నె నీరీతియనియెంతు పాపియెవడో॥

ఉగ్ర.—ఛీ, ఛీ, అట్టివాఁడెవ్వఁడునులేడు. అసంభవము.

సుశీ.—అట్టివాడెవ్వఁడైన నుండినయెడ దైవము క్షమించుగాక!

కమ.—క్షమాపణా!

తే. గీ॥ మంచియుత్రాడు వానిక్షమించుగాత!
నరకమనిశంబు నరముల కొరుకుగాత!
దేవినీరీతిదూషింప భావ్యమగునె?
ఏమిసంభవమే ప్రొద్దుయేస్థలంబు?॥

మఱియు.

తే. గీ॥ మూరుమోసంబుఁజేసిన మోసగాని
దుష్టబుద్ధి క్రూరునధము స్పష్టముగను
దైవమా! దెల్పికొరడాల దెబ్బలెల్ల
సజ్జనులు మోదసెలవిమ్ము చచ్చువరకు॥



ఉగ్ర.—కేకలు వేయకు. నెమ్మదిగామాట్లాడుము.

కమల.—నెమ్మదిగమాట్లాడనేల? ఆదురాత్మున కే శిక్షయుచాలదు.

ఉగ్ర.—నీవు శుద్ధ అవివేకివిపొమ్ము.

సుశీ.—సజ్జనా, ఉగ్రా, నా నాథుని ప్రేమనుసంపాదించుటకునే నే మిచేయవలెను? మిత్రుఁడా, అతనియెడకుఁబోయి కనుఁగొని రమ్ము. నే నీశ్వరసముఖమునఁ జెప్పుచున్నాను.

ఆ. వె॥ అతనిప్రేమ కొక్కయడుగైన దాటిన
బుద్ధికర్మ వాక్కులందుగాని
యితరమనుజుల సుఖమెట్టి రూపమునైన
సోకియున్న ముందుసోకనున్న
ప్రేమకొఅతవడిన విడనాడిననుఁగూడ
దుఃఖమొదవుగాక! దురితనాకు॥

మరియు, తే. గీ॥ ప్రియుఁడు దయవీడ దరిలేదు వెతకునాకు
కాని నాప్రేమ యొక్కింతహీనమగునె?
జీవనంబతి ఘోరమై జిపకి జివికి
పోవుప్రాణముల్; ప్రేమంబు పోదు పోదు॥

తే. గీ॥ కులటయనుమాట నోటికిఁబలుకరాదు
పలుకుచుంటిని నేనిప్డు పలుకలేక
పాపమా! యెట్టులోనరింతు భారమెంత
యో! ప్రపంచదంభంబైన నెల్లనగునె?॥

ఉగ్ర.—అమ్మా, నేప్రార్థించెదను. ఊరకొనుఁడు. అది యే యావేశమువలననో గలిగినది. రాజకీయవ్యవహారములవలన మనస్సు కలతనొంది యుండవచ్చును. మరియొకటికాదు. ఆయన మిమ్ము మందలించియుండవచ్చును.

సుశీల.—ఇంకొకటి గాకుండును గాక!

ఉగ్ర.—అంతే యని నేను నిశ్చయముగఁ జెప్పెదను.

(తెరలో భేరీకాహళనాదములు.)

అదుగో! సాయంకాల భోజనమయినది. యోధులందరునువచ్చి యుండవచ్చును

(సుశీలయు కమలయుపోవుచున్నారు.

(రుధిరుడు ప్రవేశించుచున్నాడు.)

ఏమి రుధిరా యిట్లువచ్చుచున్నావు?

రుధిరు.—నీ వ్యవహారమేమియు ధర్మముగాఁ గనుపడుటలేదు.

ఉగ్ర.—ధర్మముగ లేకెట్లున్నది?

రుధిరు.—ప్రతిదినమును నీవేదో వంకఁజెప్పి దాటవేయుచున్నావు. అనగా, ఏమాత్రమును లాభములు లేకపోఁగా మరింతయనుకూలము లన్నియు దూరము చేయునట్లు నాకిప్పుడు గన్పించుచున్నది. నేనిఁక సహింపను. నేనీవఱకు తెలివితక్కువ తనముచే నష్టపడినదాని కూరుకొనుట కూడలేదు.

ఉగ్ర.—రుధిరా, నామాటేమైన వినెదవా?

రుధిరు.—విన్నాను, విన్నాను. నీమాటలకును నీచేష్టలకును బంధుత్వమేమియు లేదు.

ఉగ్ర.—నన్నక్రమముగ నిందించుచున్నావు.

రుధిరు.—అక్రమముగఁ గాదు. సక్రమముగనే నిందించుచున్నాను. నా ధన మంతయు ధారఁబోసితిని. సుశీల కిచ్చెదనని నీవు తీసి కొనిన నగలకు మహా పతివ్రత గూడ యీపాటికి లోబడి పోఁగలఁదు. ఆమె కిచ్చితి ననియు, ఆమె త్వరలో నాయెడ ననురాగములు చూపఁగలదనియు చెప్పియున్నావు. నాకేమియు నింతవఱకా చిహ్నములు కనుపడలేదు.

ఉగ్ర.—మంచిది. మంచిది. పోపొమ్ము.

రుధి.—మంచిది మంచిది, నీవుపొమ్ము. నే పోనోయి. ఇదంతయు బాగుగలేదు. ఇదంతా టక్కరువేషముగ నున్నది. నాకు మోసము గోచరమగుచున్నది.

ఉగ్ర.—మంచిది మంచిది.

రుధిరు.—ఇక మంచిది కాదని చెప్పుచున్నాను. తెలిసినదా? నేను సుశీల కొరింగించుకొనెదను. నా నగల తిరిగి యిచ్చిన నే నీ వ్యాపారమును వదలివేసి పశ్చాత్తాపపడి ఇంటికిఁ బోయెదను. లేని యెడల నీవు సమాధానము చెప్ప వలసియుండును.

ఉగ్ర.—చెప్పితి విక పొమ్ము.

రుధిరు.—ఔను. నేను నిజముగఁ జేయఁదలచికొనిన దానిని చెప్పితిని.

ఉగ్ర.—బాపురే! ఇప్పుడు గదా నీలో కొంచెము శౌర్య మున్నట్లు గనుపడినది. ఇక నుండి నిన్నుఁ గూర్చి మునుపటి కంటె మంచి యభిప్రాయమును గలిగి యుండెదను. రుధిరా, ఏదీ, నన్నొకసారి యాలింగనము చేసికొన నిమ్ము. మిత్రుఁడా! నీవు నన్నన్యాయముగ నిందించుచున్నావు. కాని నేను మాత్రమిందు ధారాళముగ వ్యవహరించితిని.



రుధిరు.—నా కట్లు కనుపడలేదు.

ఉగ్ర.—నిజము! అట్లు కనుబడని మాట వాస్తవము. నీ యనుమానమునకు తగిన హేతువు లేక పోలేదు. కాని, రుధిరా, నే నిప్పుడు నీలో కలదని నమ్ముటకెక్కువ హేతువు గన్పించినది, నీలో నిక్కముగ నున్న యెడల, అనగా మనోనిశ్చయము, ధైర్యము, సాహసము నీలోనున్న యెడల నేటి రాత్రి గనుపర్చుము. మరునాఁడు నీకు సుశీల దక్కని యెడల నన్ను దుర్మార్గునిగ నీలోకము నుండి దరిమివేయుము. నాకట్టి మరణ దండన నైన విధింపుము. సరియా?

రుధిరు.—మంచిది. అదియేమి? సాధ్యమైనదేనా?

ఉగ్ర.—అయ్యా, వినీసునుండి పుళిందుని స్థానంబున కృష్ణుని నియమించుచు నుత్తరువు వచ్చినది.

రుధి.—నిజమేనా? అట్లులైన పుళిందుడును సుశీల యును తిరిగి వినీసునకు పోవుదురా?

ఉగ్ర.—లేదు, లేదు. పుళిందుడు సుందరి సుశీలను మారిటేనియాకు దీసికొని పోవును. కావున నతఁడేమైన ప్రమాదమునఁ గాని యిచ్చట నాగఁడు. కృష్ణుని లేకుండఁ జేసిన నా ప్రయాణమాగి పోఁగలదు.

రుధిరు.—లేకుండఁజేయు టనగా నెటులా?

ఉగ్ర.—ఏమి? పుళిందుని యుద్యోగ మత డాక్రమించు కొన నసమర్థుడగు నట్లు చేయుటయే. అనగా శిరచ్ఛేదము.

రుధిరు.—దాని నన్నుఁ జేయమనెదవా యేమి?

ఉగ్ర.—ఔను. నీకార్యసాధనఁ జేసికొనుట కాసక్తి యున్న యెడలఁ జేయవలెను. అతఁడు తన విటురాలింటిలో నేడురాత్రి భోజనము చేయును. నేనచ్చటికి పోయి అతనినిఁ గలిసికొందును. అతని యదృష్టమింక నతఁడెరుఁగడు. అతఁడచ్చట నుండి సుమారు 12 ఘంటలు 1 ఘంటమధ్య బయలువెడలి నీ పాలఁబడునట్లు నే చేసెదను. నీ వీలును చూచుకొనవలెను. నేను నీ వెనుకనే యుండెద. మన యిద్దర మధ్యనతఁడు చచ్చు. రమ్ము. ఏమట్లు నిర్ఘాంతపడిచూచెదవు? నాతోడ రమ్ము. నీ వతనిఁజంపవలసిన యవసరమును నీ కింకను స్పష్టము చేసెదను. భోజనమునకు కాలాతీతమైనది. ప్రొద్దుపోవుచున్నది. మనపని చూచుకొందము రమ్ము.

రుధిరు.—ఇందు కింకను కారణ మరసెదను.

ఉగ్ర.—నే నిన్ను సంతుష్టి పరచెదను రమ్ము.

రంగము III. భవనమునం దింకొకగది.

(పులిందుడు, రఘుపతి, సుశీల, కమల, సేవకులు ప్రవేశించుచున్నారు.)

రఘుపతి.—సేనానీ, నే ప్రార్థించెదను. మీరింక శ్రమపుచ్చుకొనవద్దు.

పులిం.—క్షమింపుము. కొంచెము నడచిన నాకు మంచిది.

రఘు.—దేవీ, సెలవొసంగుము. నా వినయ పూర్వకమైన వందనముల నైకొమ్ము.

సుశీ.—మీకు హృదయ పూర్వకముగ నా స్వాగతము.

పులిం.—అయ్యా! మీరు వచ్చెదరా? ఓసుశీలా.

సుశీ.—నాథా

పులిం.—నీవు శయ్యాగారంబునకు బొమ్ము. నే నిప్పుడే వచ్చెదను. నీ సేవకురాలనుం బంపి వేయుము. నాయాజ్ఞ సేయుము.

సుశీ.—చిత్తము స్వామీ. [పులిందుడును రఘుపతియుం బోవుచున్నారు.

కమల.—ఏ విధముగ నున్నారు? మునుపటి కంటె కొంచెము శాంతుడై నట్లున్నాడు.

సుశీల.—ఇప్పుడే వచ్చెదనని చెప్పిపోయెను. నన్ను శయ్యాగారంబునకు బొమ్మనెను. నిన్నుం బంపి వేయు మనెను.

కమ.—నన్నుం బంపి వేయమనెనా ?

సుశీ.— ఆయ నాజ్ఞ అట్లు. కావున కమలా, నీవుపొమ్ము. ఆయన యిష్టమును మన్నింపవలెను.

కమ.—మీరాయనను చూడకుండిన మేలేమోయని తలచెద.

సుశీ.—నే నట్లు తలంపను.

ఆ. వె॥ నాదు ప్రేమ దలచు నయమంచు నాతని
మూర్ఖరోష కోప మూర్తులెల్ల
సుముఖ మగుచు నాకు చూపట్టు చుండును
సమ్మతంబు నగుచు సరస మగుచు. ॥

కమ.—దేవీ, మీరు వేయుమనిన వస్త్రములను పాన్పుపైంబరచితిని.

సుశీ.—కమలా, నా మనస్సున నెట్టి పిచ్చి భ్రాంతులు పుట్టుచున్నవి. నేను ముందు చచ్చిపోయిన యెడల ఆ వస్త్రములలో నొక దానిని నాపై కప్పుము,



కమల.—చాలు చాలు ; చావుమాట లెందుకు ?

సుశీ.—కమలా, నా తల్లికి సావిత్రియను నొక చెలికత్తె గలదు. ఆమె యొకని ప్రేమించెను. ఆ ప్రియుడు పిచ్చెత్తి యామెను విడనాడెను. ఆమె కొక కీర్తన గలదు. ఆమె యా కీర్తన పాడుచు చచ్చిపోయెను. నా కీ రాత్రి ఆకీర్తనయే మనస్సునందు దిరుగుచుండెను. పాప మా సావిత్రి వలెనే తలనొక వైపున కుంచి ఆ కీర్తన పాడెదను. నీ వింక పొమ్ము.

లాలి పాట.

పాప మా చిన్నదొక పాదపముం జేరి
నిట్టూర్పు పుచ్చుచు నించె కన్నీరు.
పాడవే, యోపచ్చ పాదపమ! పాడూ
ఓదార్పు మో కుజమ! యోదార్పుమమ్మ!
కరముంచె వక్షమున శిరముంచెతొడనూ
వలవల కన్నీరు వరదలై పడెనూ
పాడవే యోపచ్చ పాదపమ! పాడూ
ఓదార్పు మోకుజమ! యోదార్పుమమ్మ!
సరసబారెడు స్వచ్ఛ ఝురమొకటిచాలా
మరమరయనిశ్రుతి మరిమ్రోగుచుండె
వేడైన కన్నీరు వేవేగంబడిన
కరగించెరాలను కరగించెమనసు.

ఓ కమలా, ఆయనిప్పుడే వచ్చును. నీవుపొమ్ము.
పాడవే యోపచ్చ పాదపమ! పాడూ
ఓదార్పు మోకుజమ! యోదార్పుమమ్మా!
అతడునిందకు నేమి యర్హుండు గాడు
నే సమ్మతించెద నిందింపనతని.

కాదు దాని తరువాత చరణమది కాదు. ఏవరో తలుపుతట్టుచున్నారు.

కమల—గాలి. ఎవరు లేరు ?

సుశీ.—
ప్రియుని ప్రేమను నేను నయముకాదనిన
అతడేమిబల్కె నే యతివతానపుడు
పరస్త్రీల పలువుర పడతి నేగోర
పరపురుషులనునీవు పాపింతువనెను.

కావున కమలా, నీవుపొమ్ము. సెలవొసంగుము నాకండ్లు మంటబెట్టుచున్నవి. అది దుఃఖమును తెలియఁజేయుచున్నదా ?

కమల.—నాకేమియు నర్థమగుటలేదు.

సుశీ.—నేనట్లు చెప్పగావింటిని.—హా ఈపురుషు లీపురుషులు! కమలా, నీమనస్సాక్షి పూర్వకముగ చెప్పుము. భర్తలనంత అక్రమముగ మోసపుచ్చు స్త్రీలుందురా ?

కమల.—అట్టివారు కొందరుండవచ్చును. సందేహమేమి ?

సుశీ.—ఈ భూలోకమున కంతకైన నీవట్లు చేయుదువా ?

కమల.—ఏమి నీవు చేయవా ?

సుశీ.—చేయను. ఈ సూర్యచంద్రులేసాక్షి. నీవుమాత్ర మీ ప్రపంచము నంతకైన చేసెదవా ?

కమల.—ప్రపంచమనగా సామాన్యమా ! అంతచిన్నపాపమున కిది పెద్ద ప్రతిఫలము గాదా ?

సుశీ.—నిజముగ నీవట్లు చేయుదువని నే తలంచను.

కమ.—నిజముగ నేనుచేసి అటుతరువాత పరిహారముచేసికొనెదను. అయితే కాసునకు గాని, రూకకుగాని, రవికెకుగాని, చీరెకుగాని మరిసామాన్యమైన వానికిగాని నే చేయను. కాని ప్రపంచమనగా, తనమగని మహారాజును చేయుటకు నీపని నెవ్వరైనఁ జేయకుందురా? అటులైన నేను నరకమునకైన సాహసింతును.

సుశీ.—ఛీ, ఛీ, యావత్ప్రపంచమునకైన నేనట్టి పాపంబునుఁ జేయనొల్ల.

కమల.—ఆ పాపమీలోకములోనిదే గనుక, లోకమంతయు దొరకునపుడు, లోకములోని పాపమును లోకములో మాపుకొనవచ్చును.

సుశీల.—అట్టి స్త్రీయొక్కతె గూడనుండునని నే తలంచను.

కమల.—ఉన్నారు ఒకరుకాదు. పదిమందిగలరు. ప్రపంచలాభము కొరకింక నట్లు చేయువారికనంతమంది గలరు. కాని, భార్యలు చెడిపోయిన యెడల భర్తలదే తప్పని నేతలంచెదను. వారుతమధర్మములను సరిగా నిర్వర్తింపక మన ధనమును పరుల చేతులలో పోసెదరు. హేయమగు ననుమానములలో బడి మనల ననవసరమగు నిర్బంధములలో బెట్టిబాధింతురు. మనలను కొట్టుచుతిట్టుచు పరిభవించుచుందురు. మనకు మాత్రము రాగద్వేషములులేవా? కొంత సరసమున్నను మనకు మాత్రము మత్సరము లేకపోలేదు. కావునఁ భర్తలందరును తమ భార్యలకును తమకువలెనే తీపి పులుసు రుచులుగలవని యెరుంగుదురు గాక! మనలను విడిచి పరుల



నాశ్రయించు నపుడువారి యుద్దేశమేమి? ఆడేమో ఆటా? అయి యుండును. నిజమైన ప్రేమ యున్న యెడల నట్లు జరుగునా? జరుగదు. అది యేమి? గుణలోపమేనా? గుణలోపమే. మనకు మాత్రము ప్రేమలేదా? ఆట యం దిష్టములేదా? గుణలోపములు పురుషులవలె లేవా? కావున మనలను వారు తగురీతి నాదరింతురు గాక ! లేనియెడల మనము చేయు తప్పులకు వారు జేయు తప్పులే దారిఁజూపుచున్నవని వారు తెలిసి కొందురు గాక!

సుశీ.—కమలా, నాకు సెలవిమ్ము. సెలవిమ్ము. చెడ్డ నుండి చెడ్డను నేర్చుకొనక మంచిని గ్రహించునట్లు దైవము నన్ను రక్షించు గాక!

---

పంచమాంకము.

రంగము I —ఒకవీధి.

---

(ఉగ్రుడు రుధిరుడు ప్రవేశించుచున్నారు)

ఉగ్ర.—ఇదుగో, ఇచ్చట నీ గోడ వెనుక దాగియుండుము. అతడు సరాసరి వచ్చును. నీ ఖడ్గమును గట్టిగ బట్టు కొనుము. బలముగ పొడువ వలయును. వెంటనే, ఆలస్యము చేయఁగూడదు. భయపడ వలదు. నేను నీ ప్రక్కనే యుండెదను. మన జయాపజయములు దీనిపై నాధారపడి యున్నవి. బాగుగ నాలోచించుకొని మనస్సు దృఢము చేసికొనుము.

రుధి.—నీవు దగ్గిరనే యుండుము. దెబ్బ తప్పి పోవచ్చును.

ఉగ్ర.—ఇక్కడనే నీ వెనుకనే యుండెదను. ధైర్యముగ నిలువ బడుము.

(అని పోవుచున్నాడు)

రుధిరు.—నాకీ కృత్యమందు విస్తారమాసక్తిలేదు. అయిన నతడు తగినంత హేతువు చెప్పెను. ఒకమనిషి పోవుటయేగదా:—నా ఖడ్గముతో నొక్కవ్రేటు. వాడు చచ్చును. కానిమ్ము.

ఉగ్ర.—(స్వ) ఈ జవ్వన మూఢుని బాగుగ సానఁబట్టితిని. కోపము తెప్పించితిని, ఇప్పుడు కృష్ణుని నితడు చంపినను, నితని కృష్ణుఁడు చంపినను, ఒకరి నొకరు చంపుకొని యిద్దఱు వచ్చినను, ఏలాగైనను నాకు మంచిదే. రుధిరుండు బ్రతికిన సుశీలకు బహుమానము లని మోసపుచ్చి తీసికొనిన నగ సొమ్ములను దెమ్మని నన్ను పీడించును. కృష్ణుఁడు బ్రతికిన నతనిజీవితసౌందర్యము నన్ను సర్వదా

లంబున వికారముగ జూపుచుండును. అంతేకాక మూరుండు నా సంగతి నాతనికిఁదెలుప వచ్చును. నేను గొప్ప అపాయమునఁ జిక్కియున్నాను. కావున చావ వలసినదే. ఆట్లే కావలెను. కాలిసవ్వడి విన వచ్చుచున్నది. వచ్చుచున్నాడు.

(కృష్ణుడు ప్రవేశించుచున్నాడు.)

రుధిరుడు.—ఆనడ కతనిదే, అతఁడే,—అరేదుష్టాత్మా! చచ్చితివిరా (అని బయటకు వచ్చి ఖడ్గముతో వేయుచున్నాడు.

కృష్ణ.—ఆదెబ్బ నన్ను సంహరించెడిదే గాని నాకవచంబు నీవెరుంగవురా. ఇఁక నీ కవచంబును పరిశుచేసెదనురా, నీచా !

(అని కత్తిదూసి రుధిరుని గొటుచున్నాడు.)

రుధిరు.—హా! నేను చచ్చితినిరా !

(ఉగ్రుడు వెనుకనుండివచ్చి కృష్ణుని కాలిమీదఁగొట్టి పారిపోవుచున్నాడు.)

కృష్ణ.—హా! నాకాలు తెగిపోయినది. హా, రక్షింపుడు రక్షింపుడు, హా ఖూనీ! ఖూనీ!

(క్రిందపడుచున్నాడు.)

(పులిందుడు దూరమున ప్రవేశించుచున్నాడు.)

పులిం.—ఆది, కృష్ణుని కంఠధ్వనియే. ఉగ్రుఁడు తనమాట నిలుపుకొన్నాడు.

రుధి.—హా! నేనెంత దుర్మార్గుడను.

పులిం..—సత్యము.

కృష్ణ.—ఓ! రక్షింపుడు. ఒహో దీపము. వైద్యుడు.

పులిం.—వాడే—ఓఉగ్రా! నీవుశూరుడవు, యదార్థవాదివి. ధర్మాత్ముడవు. నీమిత్రుని యెగ్గుయెడల నెంత యౌదార్యబుద్ధి నీకుగలదు! నీవునాకు బుద్ధిఁగరపుచున్నావు: ఓవిటురాలా! నీవిటుడిటఁజచ్చె, నీదుర్గతి సమీపించుచున్నది. జారిణీ, వచ్చుచున్నాను.

సీ॥ నీనేత్రయుగళంపు నిండువెన్నెలనాదు
హృదయవీధినిమండి వెడలునింక
దుష్కామ పతితవౌ తుచ్ఛ తల్పంబింక
కామరక్తము చేతఁ గడుగఁబడును.

(అని వెడలుచున్నాడు



(రఘుపతియు వీరసేనుడును దూరమునఁ బ్రవేశించుచున్నారు.)

కృష్ణ.—ఓహో! కావలివారెవ్వరునులేరా? దగ్గర నెవ్వరు రాబోవుచుండుటలేదా? ఖూనీ! ఖూనీ!

వీరసే.—ఏదియో ప్రమాదము సంభవించినది. ఆరోదనము భయంకరముగ నున్నది.

కృష్ణ.—అయ్యా, రక్షింపుడు రక్షింపుడు.

రఘు.—అదుగో వినండి!

రుధి.—ఓరి దుష్టాత్మా!

రఘు.—ఇద్దరు ముగ్గురు మూల్గుచున్నారు.—చీకటి భయంకరముగ నున్నది. ఇది మోసముగావచ్చును. ఇంకను మనుష్యుల సహాయములేకుండ పోవుట క్షేమము గాదు.

రుధి.—ఎవ్వరులేరా! నే చచ్చిపోవుచున్నాను.

రఘు.—అదుగో వినండి!

(ఉగ్రుఁడు దీపముతో ప్రవేశించుచున్నాడు.)

వీరసేను.—ఇదుగో నిచ్చటెవరో దీపము నాయుధములను బట్టుకొని వచ్చుచున్నారు.

ఉగ్ర.—ఎవరచ్చట? ఆ ఖూనీ ఖూనీయని యరచువారెవ్వరు?

రఘు.—మాకు తెలియదు.

ఉగ్ర.—మీరు కేకలు వినలేదా!

కృష్ణ.—ఇచ్చటిచట, దయఁదలచి నన్ను రక్షింపుడు.

ఉగ్ర.—విశేష మేమి?

వీర.—ఆతఁడు పులిందుని యనుచరుడని తోచుచున్నది.

రఘు.—ఔను, నిజముగ నతఁడు మంచి ధైర్యశాలి.

ఉగ్ర.—ఎవరచ్చటంత యాక్రందనంబుఁ జేయువారు?

కృష్ణ.—ఓ ఉగ్రా, నన్నెవరో ఖలులు ద్రోహంబు సేసిరి. నన్ను రక్షింపుము.

ఉగ్రా.—ఓ నీవా! యువసేనానీ! ఏదుర్మార్గులీయపకృతిఁ జేసిరి?

కృష్ణ.—అందొకడు చుట్టు ప్రక్కల నేయుండును. పారిపోఁజాలడు.

ఉగ్ర.—ఆహా! ఎట్టిద్రోహులు!

(రఘురతిని వీరసేనుని చూచి) ఎవరచ్చట? ఇటువచ్చి కొంచెము సహాయముఁ జేయుడు.

రుధి.—ఓ! నన్ను రక్షింపుడు నన్ను రక్షింపుడు.

కృష్ణు.—అదుగో! ఒకడచ్చటనున్నాడు.

ఉగ్ర.—అరే దుర్మార్గుడా! నీచుడా! (రుధిరుని పొడుచుచున్నాడు

రుధి.—అరెరే! దుర్మార్గుడా, ఉగ్రా! క్రూరవ్యాఘ్రిమా?

ఉగ్ర.—చీకటిలో మనుష్యులను చంపెదవా? ఈదురాత్ము లెచ్చట నుండి వచ్చిరి? పట్టణమెంత నిశ్శబ్దముగనున్నది! హా! ఖూనీ! ఖూనీ! మీరెవరయ్యా! మంచి వారలా? చెడ్డవారలా?

రఘు.—ఉగ్రా, మేము.

ఉగ్ర.—సభ్యులగు రఘుపతి వీరసేనులా? అయ్యా క్షమింపుడు. ఇక్కడ నామిత్రుడగు కృష్ణుడు దుర్మార్గులవలన కొట్టఁబడెను.

వీర.—కృష్ణుడా?

ఉగ్ర.—సోదరా ఎట్లున్నది?

కృష్ణు.—నాకాలు తెగిపోయినది.

ఉగ్ర.—భయములేదు. దైవమురక్షించుఁగాక! సజ్జనులగా, ఈ దీపమును పట్టుకొనుడు. నే నీ రుమాలుతో కట్టుకట్టెదను.

(సీమంతిని ప్రవేశించుచున్నది)

సీమం.—హా! ఏమిజరిగినది? అకేకలు వేసిన దెవరు!

ఉగ్ర.—ఆ కేకలు వేసినదెవరా?

సీమం.—ఓ నా ప్రియ సఖా, కృష్ణా, నా ప్రియుడా! కృష్ణా, కృష్ణా, కృష్ణా!

ఉగ్ర.—ఓ చతురా! జారిణీ! కృష్ణా, నిన్నిట్లు గొట్టిన దెవ్వరో యనుమానము చెప్పఁగలవా?

కృష్ణు.—చెప్పలేను.

వీర.—ఈయవస్థను జూచుట కెంతయు విచారముగనున్నది. మీ కొరకు మేము వెదకుకొనుచు వచ్చితిమి.

ఉగ్ర.—ఎవరైన గడ్డపేలికనిండు. ఒక సవారిని దెచ్చి వీనిని దీసికొని పొండు.

సీమం.—అయ్యో! ఆయన మూర్ఛపోవుచున్నాడు. ఓ కృష్ణా, కృష్ణా, కృష్ణా,



ఉగ్ర.—సజ్జనులరా, ఈముట్టలో నీ మనిషి యున్నట్లు నా కనుమానముగనున్నది. కృష్ణా! కొంచెము శాంతింపుము. ఇటురండి రండి. దీపము తెండి. ఈముఖము నెరుగుదుమా? లేదా? ఆహా! నా స్నేహితుడును మనదేశీయుడునైన రుధిరుడు! కాదు;—ఔను నిజమే ఆహా! రుధిరుడే!

వీర.—వినీసీయుడా?

ఉగ్ర.—ఔను అతఁడే. మీ రెరుంగుదురా?

వీర.—ఎరుగుదును.

ఉగ్ర.—కృష్ణుడా, ఎట్లున్నది? ఓ సవారీ! సవారీ!

వీర.—రుధిరుడా!

ఉగ్ర.—ఎవరైన పుణ్యాత్ములితనిని భద్రముగఁ దీసికొనిపొండు. నేను సేనానియొక్క శస్త్రవైద్యునిఁ దీసికొనివచ్చెదను.

(సీమంతినితో) ఓయువతీ, నీవేమియు శ్రమపడ నక్కరలేదు. ఇక్కడ దెబ్బ తగిలి పడియున్న కృష్ణుడు నామిత్రుడు. మీకేమివిరోధమున్నది?

కృష్ణు.—ఏమియులేదు. నే నతని నెరుగనే యెరుగను.

ఉగ్ర.—(సీమంతినితో) ఏమి? తెల్లఁబోయి చూచుచున్నావు? అతనిని భద్రముగఁ దీసికొనిపొండు.

(కృష్ణుడును రుధిరుడును తీసికొని పోబడిరి.)

సజ్జనులారా, ఒక్క నిముషముండుడు. ఆమె ముఖములో భయమును చూడుడు. కాదుకాదు ఓజవ్వనీ, అట్లు విభ్రాంతలై చూచినయెడల మీకింకను తెలియవలసినదుండును. పరీక్షగఁ జూడుడు. ఆమె దిక్కు చూడుడు. సజ్జనులారా? చూచితిరా? నోరు కదలకపోయి నప్పటికి దొంగతనము ముఖములో భాషించుచున్నది.

(కమల ప్రవేశించుచున్నది.)

కమల.—అయ్యో! ఏమిది? ప్రియనాథా ఏమిది?

ఉగ్ర.—కృష్ణుడిక్కడ రుధిరునివలనను, మరికొందరు హంతకులవలనను చీకటిలో ముట్టడింపఁబడెను. అతనుప్రాణాపాయమునను న్నాడు. రుధిరుండు చచ్చెను.

కమల.—అయ్యో! పాపము! సజ్జనుడు కృష్ణుడు. అయ్యో పాపము!

ఉగ్ర.—ఇది వ్యభిచారదోషము వలన ఫలితము. కమలా, నీవుపోయి కృష్ణుడు రాత్రి యెచ్చటభోజనముచేసెనో కనుఁగొనిరమ్ము. ఏమి? నీవు జంకుచున్నావు?

సీమం.—ఆయన నా యింటిలో భోజనము చేసెను. అయిన నే జంకను

ఉగ్ర.—ఓహో! అటులనా? అటులైన నా వెంటరమ్ము.

కమల.—ఛీ, ఛీ; దుర్మార్గురాలా జారిణీ.

సీమం.—ఓ! నేను జారిణి గాను. మీరెంత సన్మార్గవర్తనులో నేను నంతే.

కమ.—నాయంతా? ఛీ, ఛీ, పొమ్ము.

ఉగ్ర.—సజ్జనులారా, మనము కృష్ణునియొక్క దేహస్థితి నరయుదమురండు. ఓ జవ్వనీ, నీకథ సరిగాఁ జెప్పవలెను. కమలా, నీవు కోటలోనికి పరువెత్తి దేవితోడను సేనానితోడ నీవార్తఁదెలుపుము. నీవుముందుగాబొమ్ము. (స్వగతము) ఈరాత్రితో నాపనియేదో యొకవిధముగా తేలవలె.

(అని వెడలి పోవుచున్నాడు)

రంగము II శయ్యాగారము,

(సుశీల శయ్యపై నిద్రించుచుండును. దీపము వెలుగుచుండును)

పులిందుడు ప్రవేశించుచున్నాడు.

పులిం. మ॥ అదియే కారణ మద్దియే నిజముఁ నీ వార్తింపకోయాత్మ! పో
లదు దెల్పంగను మీకుకారణము శుభ్రాత్మ్యంబులో తారలా
రదియేకారణమైన జంపుదునె? యారక్తంబుమైఁగార్చియా
మృదుహేమాంగము పాడుసేయగలనా? మోసంబుసేయంగ నో
పుదువింకెందరినోగదా! గనుక నే పుణ్యంబగుఁగా జంపినన్ ॥

ఆదీపమార్పి, అటుతరువాత,—ఈదీపమారపవలె

క॥ ఓ దీపమ! నిన్నారప
సందీపితఁ జేయురాణి! సంతాపము నే
బొందిన వెలిగింతుఁగదే
యీదీపము మాటయేమి? యేమగునయ్యో!॥

తే. గీ॥ బ్రహ్మతేజస్సుచే వెల్గుప్రాణదీప
మీవుబోయినదెచ్చుట కేరితరము?
చతుర రచితంబు పావకసారసార
మమరు లమృతంబు వైకుంఠమారుతంబు॥



క॥ ఓ కమలమ! నినుఁ దెరికినఁ
జీవదువుగ! మరల నియ్యజీవముఁ జాలన్
శ్రీకరముగ నెదుగవు గను
కాకుజము నెతావిఁ జూతునతివరో వినుమా।

ఓ మృదుపవనమా, యమధర్మునికూడ తన కోలదండంబును దూరంబుగఁ బారవేయమని బోధించుచున్నావుగదా! ఇంకొకటి, ఇంకొకటి.

(అని ముద్దుపెట్టుకొను చున్నాడు.)

నీవు చచ్చినపిమ్మటఁగూడ నిట్లుండరాదా! అటులైన నినుఁజంపి, తరువాత ప్రేమించెదను. ఇంకొకటి. ఇదియేకడపటిది. ఇంతమధురమైన ముద్దెప్పుడు నింత యుపద్రవంబుగా నేరదే! హా!

తే. గీ॥ దుఃఖమయ్యెడు కన్నీరు దొరగుచుండె
క్రూరబాష్పముల్ జాలికి దూరమయ్యె
దుఃఖమిచ్చోట దివ్యంపు దుఃఖమయ్యె
ప్రేమయెచ్చట నచ్చటే ప్రేటుగొనెడు॥

అదుగో, లేచుచున్నది.

సుశీ.—ఎవరక్కడ? ప్రియనాథా!

పులిం.—సుశీలా,

సుశీ.—శయనింప వచ్చితిరా?

పులిం.—సుశీలా, నేటిరాత్రి ప్రార్థనఁ జేసితివా?

సుశీ.—స్వామీ, చేసితిని

పులిం.—నీవుచేసిన పాపమేదైన దైవమింకను క్షమింపనియెడల మరల నింకొకసారి ప్రార్థించుకొనుము

సుశీ.—అయ్యో! నాథా, మీయభిప్రాయమేమి?

పులిం.—మంచిది. శీఘ్రముగఁ జేసికొనుము. సంగ్రహముగ. నేనిచ్చట నంతవరకును తిరుగుచుండెదను. నీ అసంసిద్ధమగు నాత్మను నే జంపను. దైవమురక్షించుగాక! నీయాత్మను నేవధింపను.

సుశీ.—చంపుటను గూర్చి మాట్లాడుచుంటిరా?

పులిం.—ఔనౌను.

సుశీ.—అటులైన దైవము రక్షించుగాక!

పుళిం.—నామనః పూర్వకముగ తథాస్తు.

సుశీ.—అటులఁ జెప్పినయెడల మీరు చంపరని తలంచెదను.

పుళి.—హుం !

సుశీ.—అయిన నాకు భయమగుచున్నది. మీకండ్లక్రౌర్యము భీకరముగానుండ నాకు భయమెత్తుచున్నది. నేనేల భయపడవలెనో తెలియకున్నది. నేనే పాపమెఱుంగను. కాని నాకు భయము వేయుచున్నది.

పుళిం—నీ పాపములనుఁ దలంచుకొనుము.

సుశీ.—అవి మీయెడ ప్రేమలే!

పుళిం.—అందుకే చచ్చెదవు.

సుశీ.—ప్రేమకు చావువిరుద్ధము. అయ్యో! మీ పండ్లట్లు గొరికెదరేల? మీరేదో క్రోధావేశమునఁ జిక్కితిరి. ఇవియన్నియు నా చిహ్నములు. అయిన నవి యన్నియు నాదిక్కుఁ జూపుచున్నవని దలంపను.

పుళిం.—నిశ్శబ్దముగా నుండు.

సుశీ.—అటులనే యుండెదను. కారణమేమి ?

పుళిం.—నిన్ను ప్రేమించి యిచ్చిన రుమాలు నీవు కృష్ణున కిచ్చితివి.

సుశీ.—నా ప్రాణమాన! నే నియ్యలేదు. అతని పిలిపించి కనుఁగొనుడు.

పుళిం.—జాగ్రత, జాగ్రత. అప్రమాణమువలదు. మృత్యుతల్పము మీదనున్నావు.

సుశీ.—ఔను. అప్పుడే చచ్చెదనా.

పుళిం.—ఔను, శీఘ్రముగ. కావున నీ పాపము నెల్లనొప్పుకొనుము. ప్రమాణముమీద నబద్ధములు చెప్పుటవలన నా నిశ్చయమే మాత్రము మారదు. నీవు చావనున్నావు.

సుశీ.—దైవము నాయెడల కరుణించును గాక!

పుళిం.—ఆ, తథాస్తు.

సుశీ.—మీరు కరుణగలదా! నేను మీయెడల నపరాధమేమియుఁ జేసియుండలేదు. కృష్ణుని నేను ధర్మానుకూలంబుగ నెంతవరకు ప్రేమింపవచ్చునో యంతవరకే ప్రేమించితిని. నేనే ప్రేమచిహ్నము నిచ్చియుండలేదు.

పుళిం.—నే నా రుమాలు నతని చేతిలోఁ జూచితిని. ఓ యప్రమాణికురాలా, నా గుండెరాయి చేయుచున్నావు. నేను యజ్ఞమని దలచి చేయుచున్న దానిని హత్యగా జెప్పింపఁజూచెదవా? నేను రుమాలు చూచితిని.



సుశీ.—అతనికి దొరకి యుండవచ్చును. నే నియ్యలేదు. అతని నిక్కడకుఁ బిలిపించి! నిజముఁ జెప్పింపుడు.

పుళిం.—అతడొప్పుకొన్నాడు.

సుశీ.—ఏమని?

పుళిం.—నీతో సంబంధమున్నదని.

సుశీ.—అధర్మముగనా?

పుళిం.—ఔను.

సుశీ.—ఎట్లు చెప్పఁగలడు?

పుళిం.—ఇకఁ జెప్పఁజాలడు. అతని నోరు మూయబడినది. ధర్మాత్ముండగు నుగ్రుండు అందు కర్తయ్యెఁగొన్నాడు.

సుశీ.—హా! నాభయము నిజమైనది. ఏమి చచ్చెనా ?

పుళిం.—అతని తలవెంట్రుక లన్నియు ప్రాణములైన నా పగకు వాని నన్నిటిని హరించుకొనుటకు జఠరాగ్ని గలదు.

సుశీల.—అయ్యో! మోసము జరిగినది !

పుళిం.—ఛీ! జారిణీ అతనికొరకు నా యెదుట నేడ్చెదవా!

సుశీల.—హా! నన్ను ప్రవాసమునకైనఁ బంపుడు. చంపవలదు.

పుళిం.—చావు! జారిణీ!

సుశీల.—రేపు చంపుము. ఈ రాత్రి బ్రతుక నిమ్ము

పుళిం.—ఇంకను బ్రతుకఁ బ్రయత్నించెదవా ?

సుశీల.—ఒక అరగడియ!

పుళిం.—చేసిన తరువాత నాగుటలేదు.

సుశీల.—నే నొక ప్రార్థనఁ జేసికొనువరకు.

పుళిం.—కాలము మించినది.

(అని నలుగఁగొట్టుచున్నాడు.)

కమల.—(తెరలో) మహాప్రభూ, మహాప్రభూ! అయ్యో మహాప్రభూ! మహాప్రభూ

పుళిం.—ఏమిధ్వని? ఇంకచావలేదా? ఇంకను బాగాచావలేదా ? క్రూరుడనైన నాకింకను జాలిగలదు. బాధపడుచు నిన్నుండనియ్యజాల—అటులా అటులా.

కమల.—(తెరలో) ఓ మహాప్రభూ! మీతో నొక్క మనవియున్నది.

పులిం.—ఔను:—అదికమల:—మంచిది మంచిది. చచ్చినది. కృష్ణుని చావు వార్త దెచ్చియుండవచ్చును:—వీధిలో ధ్వని హెచ్చుచున్నది. ఆ! ఇక కదలవద్దు. స్మశానవాటికవలె నిశ్శబ్దముగనున్నది. లోపలకు రానిత్తునా? మంచిదేనా? అదిగో! మరలఁ గదలుచున్నట్లున్నది. లేదు లేదు. ఏమిచేసినబాగుండును? :—ఆమె లోనికివచ్చినయెడల నాభార్యతో మాట్లాడుదును. నాభార్యా! నాభార్యా! హా! ఇంకను నాభార్య యెక్కడ? హా! నిర్భరము! ఓ భారకాలమా! సూర్యచంద్రగ్రహణంబు లొక్కసారిగ వచ్చినట్లున్నది. భయోత్పాతంబులచే భూమికదలి పోవుచున్నట్లున్నది.

కమల.—(తెరలో) ఓ మహాప్రభో! నేనొక్కమాటచెప్పవలెను. తలుపు తియ్యమని ప్రార్థించుచున్నాను.

పులిం.—ఆ, మరచితిని. కమలా, లోపలికిరమ్ము. కొంచెముండుః. పరదాలు లాగనిమ్ము ఏమివిశేషములేమి?

(కమల ప్రవేశించుచున్నది.)

కమల.—ఓ మహాప్రభో? అక్కడ దూరమున నొకఘోరహత్య జరిగినది.

పులిం.—ఎప్పుడు? ఇప్పుడేనా?

కమల.—ఇప్పుడే, మహాప్రభో!

పులిం.—దుష్టగ్రహంబులు భూమికి దగ్గర పడినవి. మనుష్యులకు పిచ్చియెత్తుచున్నది.

కమల.—మహాప్రభూ, కృష్ణుడు రుధిరుండను నొకవినీసీయునిఁ జంపెను.

పులిం.—రుధిరుండు జచ్చెనా! కృష్ణుడు చచ్చెనా?

కమల.—లేదు. కృష్ణుడు చావలేదు.

పులిం.—కృష్ణుడు చావలేదా? అటులైన హత్యతప్పజరిగినది. తియ్యని పగయింకను తీరలేదు.

సుశీ.—ఓ! అక్రమముగ నధర్మముగఁ జంపఁబడితిని.

కమల.—అయ్యో! అ యేడుపెవరిది?

పులిం.—అదా! ఏది?

కమల.—అదియే, అయ్యో! అది నాదేవికంఠధ్వని. హా! రక్షింపుడు రక్షింపుడు! ఓ దేవీ మరలఁబల్కుము. ప్రియసుశీలా! ఓ మహాదేవీ! మరలఁ బలుకుము.

సుశీ.—నే నన్యాయపుచావు చచ్చుచున్నాను.

కమల.—ఆపని చేసినవారెవ్వరు?



సుశీ.—ఎవరులేరు; నేనేచేసికొంటిని. సెలవిమ్ము. నాప్రియసఖుని దయకు నన్నుబోధింపుము. సెలవిమ్ము.

(చచ్చుచున్నది.)

పులిం.—ఏమి? ఆమె యెట్లు చంపబడినది?

కమల.—అయ్యో! ఎవరెరుగుదురు?

పులిం.—ఆమెయేచెప్పగా నీవు వింటివిగదా! నేనుకాదు చంపినది.

కమల.— ఆమె అట్లు చెప్పినది. కాని, నేనుమాత్రము నిజముచెప్పవలెను.

పులిం.—నరకకూపంబున కసత్యంబు బల్కుచుఁబోయినది! ఆమెను చంపినది నేను.

కమల.—అటులైన నామె మరింత గొప్పదేవత! నీవుమరంత దుర్మార్గుడవు!

పులిం.—ఆమె పాపాత్మురాలు. జారిణి.

కమల.—నీ వసత్యంబుఁ జెప్పుచున్నావు. నీ వొక దయ్యము! పిశాచము!

పులిం.—ఆమె పాపి.

కమల.—నీవు పరమకోపి ; యామెను పాపియనుచున్నావు. ఆమె పరమపావని.

పులిం.—నే నెట్టి యదార్థకారణంబులేక నింత దురాగతంబున కొడిఁగట్టి నరక పాతాళంబున కురుకుదునా? నీమగని కంతయుయుఁ దెలియును.

కమల.—నా మగనికా?

పులిం.—నీ మగనికే.

కమల.—ఆమె పాతివ్రత్యంబు దప్పెననియా?

పులిం.—ఔను, కృష్ణునితో. లేక పతివ్రతయైనచో, బ్రహ్మదేవుం డింకొక స్వర్గంబు నిర్మించి నా కొసంగిన నామెను విడుతునా?

కమల.—నామగడా!

పులిం.—ఔను. అతడే ముందు నాకుచెప్పెను. అతడు ధర్మము నందాసక్తిగలవాడు. ఇట్టి కల్మషంబుల సహింపడు.

కమల.—నామగడా?

పులిం.—ఎందుకట్లు మరల మరల ప్రశ్నించెదవు. ఓజాణా! నీమగడు.

౦.—ఓ దేవీ! దౌర్జన్యమిట్లు ప్రేమతో నెక సక్కెములాడుచున్నది. నామగడామె పాతివ్రత్యము దప్పెనని చెప్పెనా?

పులిం.—అతడే, ఓయువతీ! యతడే, నీమగడేనని చెప్పుచున్నాను. మాటకర్థమైనదా? నామిత్రుడు, నీమగడు, యదార్థవాది, సత్యసంధుడు, ఉగ్రుడు.

కమల.—అతడట్లు చెప్పినయెడల నతని దుష్టాత్మ దినదినంబొక్క యణువుచొప్పున కుళ్లి నశించుగాక! అతడు చెప్పినది శుద్ధయబద్ధము. ఆమె అప్రయోజకుండగు నీ వరునిపై నమిత ప్రేమనిల్పినది.

పులిం.—హుం (కొట్టంబోవుచున్నాడు.)

కమల.—నీచేతనైనది చేయుము. నివెంతయామె కర్హుడవో, నీకార్యము స్వర్గమున కంత అర్హమైనది.

పులిం.—చాలు చాలు చాలంపుము.

కమల.—నీవుహానిచేయుట కున్నశక్తికంటె నాకు హానికి నిలువబడు శక్తిపదిరెట్లుగలదు ఓ మూరుడా, ఓ మూర్ఖుడా! ఓ మందబుద్ధీ! నీవెట్టికార్యమును జేసితివి? నీఖడ్గమునకు నేజడియను. నీ సంగతి చాటించెదను. నాకిట్టిప్రాణము లిరునదిపోయినను లక్ష్యము లేదు. హా! రక్షింపుడు రక్షింపుడు. పులిందుడు మాదేవిని జంపెను. ఖూనీ! ఖూనీ!

(మదనుడు వీరసేనుడు ఉగ్రుడు ప్రవేశించుచున్నారు.)

మదనుడు.—ఏమీ కలవరము? సేనానీ, ఏమిది?

కమల.—ఓ వచ్చినావా, నాధా? బాగుగ చేసితిరి. అరిదరును హత్యలుచేసి మీనెత్తి మీదవేయుచున్నారు.

వీర.—ఏమది?

కమల.—నీవు పౌరుషము గలవాడవైన నీఖలునకు బుద్ధిచెప్పుము. ఆతనిభార్య ద్రోహి యని నీవుచెప్పితివట. నీవుచెప్పియుండవని నానమ్మకము. నీవట్టిదుర్మార్గుడవుకావు; మాట్లాడుము. దుఃఖముతో నాకడుపు పగిలిపోవుచున్నది.

ఉగ్రు.—నాయూహకు తోచినది చెప్పితిని. ఆయనంతట ఆయనే యదార్థమని స్వయముగఁ దెలిసికొనినదానినే నేనును చెప్పితిని.

కమల.—అయిన నీవెప్పుడైన యామెను ద్రోహియని చెప్పితివా?

ఉగ్రు.—చెప్పితిని.

కమల.—నీ వబద్ధము చెప్పితివి! దుర్భరమును పాపమునగు నబద్ధమును చెప్పితివి. నా ప్రాణమాన! అసత్యము ఘోర అసత్యము, ఆమె కృష్ణునితోనా? కృష్ణునితో ననిరేనా నీవు చెప్పితివి?

ఉగ్రు.—కృష్ణునితోనే పొమ్ము, నోరుమూసుకొని పొమ్ము.



కమల.—నేను నోరు మూసుకొనను, నాకు మాటలాడుహక్కు గలదు. మా దేవి యచ్చట చచ్చిపాన్పుపై పడియున్నది.

అందరు.— హా! హా! దైవము రక్షించుగాక!

కమల.—నీ వాదము లాహత్యను పురికొల్పినవా?

పులిం.—సజ్జనులరా, విస్మితులై చూడవలదు. నిజము, నిశ్చయము.

వీర.—ఆశ్చర్యము! సత్యము.

మద.—అతి ఘోరము!

కమల.—మోసము! దుర్భాగ్యము! కుత్సితము! నాకు తేటపడుచున్నది. నాకు వాసన గొట్టుచున్నది. నే నప్పుడే భయపడితిని. నేనుదుఃఖముతో చచ్చిపోయెదను. హా మోసము మోసము!

ఉగ్రు.—ఏమి నీకు మతిపోయినదా? ఇంటికి పొమ్మని యాజ్ఞాపించుచున్నాను.

కమల.—సజ్జనులారా, నన్ను మాటలాడ నిండు; నే నతని యాజ్ఞ ననుసరింప వలసిన దేగాని యిప్పుడు గాదు. బహుశః ఉగ్రా, నేనిక నింటికిఁబోను.

పులిం.—హా! హా! హా (అని పక్కపైపడుచున్నాడు).

కమ.—కాదు, క్రింద పడి మొత్తుకొనుము. ప్రపంచమున కన్నుదెరచిన వారిలోనెల్ల పరమపావనిని చంపుకొన్నావు.

పులిం.—(లేచి) ఓ! పాపాత్మురాలు!—మామా, మిమ్మును చూడలేదు. మీ అన్నకూతు రదుగో! పడియున్నది. ఆప్రాణవాయువుల నీచేతు లిప్పుడే బంధించినవి. ఈ కృత్య మతి ఘోరమని నాకు దెలియును.

వీర.—హా! సుశీలా! నీ తండ్రి పరలోకగతుడైనందుకు నాకు సంతోషముగ నున్నది నీ వివాహ మాతనికి గర్భ నిర్భేదమాయెను. దుర్భర దుఃఖ మాతని ప్రాచీనజీవిత తంతువును ద్రెంపివేసెను. ఆయన బ్రతికి యుండి యీదురవస్థఁ జూచిన యెడల నేమయ్యెడివాడో.

పులిం.—ఇది కరుణాకరము! కాని, యామె కృష్ణునితో నవమానంబుగ ననేకసారులు వర్తించినదని ఉగ్రుడెరుంగును. కృష్ణుడొప్పుకొన్నాడు. అతని యొడఁగల ననురాగబంధంబులవలన నేను మొదట ప్రేమించియొసంగిన చిహ్నంబు నతనికిచ్చెను. నే నాతని చేతిలోఁ జూచితిని. నా తండ్రి నాతల్లి కిచ్చిన యనుపమాన యనురాగ చిహ్నమైన యుమాలు!

కమల.—హా దైవమా! ఓ యష్టదిక్పాలవరులారా కావరే!

ఉగ్ర.—ఛీ ఛీ, నోరు మూసుకొనుము.

కమల.—ఆగదు, ఆగదు.—నేనోరు మూసుకొనజాలను. అయ్యో, మూసుకొనజాలను! పశ్చిమ మారుతంబువలె విసరికొట్టెదను. దేవమనుష్య పిశాచగణంబులెల్ల వీగ్గని చెప్పనిమ్ము. నే మాటలాడి తీరెదను.

ఉగ్ర.—వివేకము తెచ్చుకొని యింటికిఁబొమ్ము.

కమల.—నే పోను. (ఉగ్రుడు భార్యను చంపబోవుచున్నాడు.)

వీర.—ఇస్సీ! నీఖడ్గము స్త్రీమీదనా?

కమల.—ఓ మూఢపుళిందా! నీవు జెప్పెడురుమాలు నాకుదొరకెను. నా మగఁడనేక సారులు నన్ను ప్రార్థింపనే నాతని కిచ్చితిని. అంతేకాక నన్ను దొంగిలింపమనికూడ నతడుకోరెను.

ఉగ్ర.—దుష్టచారిణీ!

కమల.—ఆమె కృష్ణుని కిచ్చినదా! లేదులేదు. అయ్యో! నాకుదొరకెను. నేను నా మగని కిచ్చితిని.

ఉగ్ర.—పాపాత్మురాలా, అసత్యంబు బల్కెదవా?

కమల.—దైవమాన! నే నసత్యముచెప్పుటలేదు. సజ్జనులారా, అసత్యము చెప్పుటలేదు. ఓనరహంతకా! పాపీ! అంత చక్కనిభార్య నాయవివేకి యేమిచేయ గలదు?

(ఉగ్రుడు కమలను పొడిచిపారిపోవుచున్నాడు.

పుళిం.—హా! పిడుగులకు గాక నింకపనికివచ్చు రాళ్లేమియు నాకాశమునలేదా? అపూర్వదురాత్మా!

వీర.—పడిపోవుచున్నది! నిజముగ నాతడు భార్యను చంపివేసినాడు.

కమల.—హా! హా! నన్ను మాదేవిప్రక్కను పడుండఁబెట్టుడు.

వీర.—వాడు పారిపోయెను. భార్యచావనున్నది.

మద.—ప్రసిద్ధికెక్కిన దురాత్ముడు. మీరుదగ్గరనుండి నేనులాగుకొనిన యీ యాయుధమును తీసుకొని ద్వారమును గాచియుండుడు. వెలుపలికి పోనియ్యవద్దు. సాహసించిన చంపివేయుము. నే నాదురాత్ముని బోయి పట్టుకొనెదను.

(అనిపోవుచున్నాడు.)



పుళిం.—నా శౌర్య మెచ్చట కగినది! ప్రతిసామాన్యుడుగూడ నాచేతిలోని కత్తిని తీసి కొనుచున్నాడు. ధర్మము తప్పిపోయిన తరువాత శౌర్యమేలయుండునో? పోనిమ్ము అన్నియు బోనిమ్ము.

కమల.—దేవీ! నీవు పాడిన కీర్తనేమి సూచించినది? అమ్మా, విను, వినఁగలవా? నేను గూడ హంసవలె పాడుచూ చచ్చిపోయెదను. (పాడుచున్నది.)

పాడవేయోపచ్చ పాదపమ! పాడూ!

ఓమూరుడా, ఆమె పతివ్రత; క్రూరకర్ముడా! నిన్నామె ప్రేమించెను. నేను నిజముఁబల్కుచున్నాను గనుక నాకుస్వర్గము లభించుఁగాక! హా నాప్రాణము పోవుచున్నది (చచ్చిపోవుచున్నది.)

పుళిం.—ఈ గదిలో నింకొక ఖడ్గమున్నది. అదిగో—నన్ను బయటకుపోనిమ్ము.

ర.—నీవట్లు ప్రయత్నించిన హానికల్గును. నీవునిరాయుధుండవుగాన పడియుండుము

ళిం.—నా దిక్కుచూచి మాటాడుము. నేను నిరాయుధుడనైనను నిన్ను కొట్టఁగలను

ర.—ఏమి?

పుళిం.—చూడు ఆయుధమిదుగో. ఏవీరభటుని యిట్టి ఆయుధ మలంకరించదు. నా చిన్న భుజముతో నీఖడ్గముతో నీవంటియడ్డములను వేయింటిని గ్రోసినదినములు గలవు కాని యాప్రగల్భమిప్పుడేల? ఈ లిఖితమునెవ్వరు తప్పింపగలరు? ఇప్పుడెట్లుంటిని? నా ఆయుధమునుఁజూచి భయపడవలదు. నాప్రయాణమింతటితో సాక్షికైనది. నారోడ దిబ్బెక్కినది. భీతిచే వెనుకకుపోవలదు. పుళిందుడు త్రోసిన పడిపోవును! ఇక పుళిందుడెచ్చటికి పోవలసినది. ఓదురదృష్టపు నారీరత్నమా! ఎట్లుంటివి? నినుగప్పిన వసనంబట్లు నీవును వెలవెల బోవుచున్నావా? మనము వైతరిణీ తీరంబున గలిసికొనునపుడు నీ చూపు నన్నధోలోకంబులకుఁ ద్రోసి యమకింకరుల కప్పగింపదే! హా! పాతివ్రత్య మెట్లు చల్లఁబడి పోయినది! ఓ దురాత్మా! దురాత్మా! బానిసా! ఓ పిశాచములారా, నన్ను స్వర్గతుల్యమగు సతీమణిం జూడకుండ చావమోదుడు. ఓ మారుతములారా, నన్నెగరఁగొట్టుకొని పొండు. ఓ యగ్నులారా, మీకీలల నన్ను దహింపుడు. ఓ సుశీలా పోయితే సుశీలా, పోయితే పోయితే!

రఘుపతి, మదనుడు, కృష్ణుడు (మనుష్యులచే మోయబడుచు) ఉద్యోగస్థులు; ఉగ్రుడు (ఖైదిగను) వచ్చుచున్నారు.

రఘు.—ఆ క్రోధావేశుండును దురదృష్టుండునగు వాడెచ్చటనున్నాడు?

—వాడు పుళిందుడు! ఇదుగో ఇచ్చట నున్నాడు.

రఘు.—ఆ విషసర్పమెచ్చటనున్నాడు ? ఆదురాత్ముని ముందుకు తీసుకొనిరండు.

పుళిం.—పిశాచములకు పాదములు వెనుక నుందు వందురు, నీపాదములు సరిగా నేమి యున్నవి. నీ వింకొక పిశాచమైన చంపఁజాలనురా! (ఉగ్రుని పొడుచుచున్నాడు.

రఘు.—ఖడ్గము నతనిచేతినుండి లాగుకొనుము.

ఉగ్ర.—నాకు దెబ్బ తగిలినది గాని చావలేదు.

పుళిం.—నాకు విచారములేదు. నీవు బ్రతికి యుండుటే నా యిష్టము. నామతమున బ్రతుకు కంటె చావే సుఖము.

రఘు.—ఓ పుళిందా, మహానుభావా! ఈ దుష్టమాయావి వలలలోఁ బడి యిట్లయితివి. నే న్నేమనగలము ?

పుళిం.—ఏమి? ఏమైనఁ ననవచ్చును, ~~గౌరవ హంతకు~~డని చెప్పుడు. నేను క్రోధంబు కొరకు గాక గౌరవంబునకే చేసితివి.

రఘు.—ఈ దురాత్ముడు తన దుర్మార్గమును కొంతవరకొప్పుకొని యున్నాడు. మీరును వాడును కృష్ణుని హత్యకియ్యకొంటిరా?

పుళిం.—ఔను.

కృష్ణు.—ప్రియసేనానీ, నేనే యపకారంబుఁ జేసితిని?

పుళిం.—నీమాట నమ్మెదను. నీ క్షమాపణ వేడుచున్నాను. కాని యీమానవపిశాచము నా యిహ పరంబుల నల్లేల వంచించెనో కనుఁగొనుడు.

ఉగ్ర.—నన్నేమియు నడుగ వద్దు. మీకు తెలిసిన దేమో తెలిసినది. ఇకనుండి నే నొక్క మాటయైన బల్కను.

రఘు.—ఏమి దైవప్రార్థనకుఁగూడ మాటాడవా ?

వీర.—బాధలు నీ నోరు తెరిపించును.

పుళిం.—మంచిది. ఆలాగు చేయుము.

రఘు.—అయ్యా, సంభవించినదేమో తెలియ జెప్పెదను. మీకు తెలియనిదను కొనెదను చచ్చిపోయిన రుధిరుని జేబులో రెండు-త్తరములు దొరకినవి. అందొకటి రుధిరుడు కృష్ణుని జంపుటకు నిర్వహించినటులఁ దెలియ జేయుచున్నది.

పుళిం.—ఓరి దురాత్మా!

కృష్ణు.—అవమాన కరము! ఘోరము!



రఘు.—ఇదిగో రెండవది. రుధిరుడే దురాత్మునికి బంపవలెని యుద్దేశించినది. ఇందులో ఉగ్రుడు వాని నొడంబరచెను.

పుళిం.—ఓరిదుష్టబానిసా !—కృష్ణా, నాభార్యయొక్క రుమాలు నీ కెట్లువచ్చినది ?

కృష్ణు.—నాగదిలో దొరకినది. ఆదురాత్ముడు తానేయొక కార్యార్థంబున నచ్చటఁ బడవేసితినని యొప్పుకొన్నాడు.

పుళిం.—ఓ అవివేకీ! అవివేకీ! అవివేకీ !

కృష్ణు.—ఇంతేకాక రుధిరుని యుత్తరములో కావలియందు నాతో పోరాడవలెనని బోధించినందుకు తిట్టుచున్న మాటలు కూడకలవు. అటుపైన చాలవరకు చచ్చినట్లు పడియుండి—ఉగ్రుడే ప్రేరేపించెను. ఉగ్రుడే తనను కొట్టెనని వాడు చెప్పెను.

రఘు.—మీరీగదివిడిచి మాతోరావలయును. మీఅధికారమును ఉద్యోగమును తొలగింపబడినవి. కృష్ణుడు సైప్రసులో పరిపాలించును. ఈదుర్మార్గున కెట్టి శిక్ష నియ్యవలెనో యట్టిదానిని విచారించెదము. వినీసురాష్ట్రమునకు మీయపరాధమునుగూర్చి తెలుపఁబడువరకు నాఖైదిగా నుండవలెను, రండి. అతని తీసుకొనిరండు.

పుళిం.—అయ్యా, కొంచెము శాంతిఁపుడు. మీరుపోవుటకు పూర్వమొకటి రెండు మాటలుచెప్పవలసియున్నవి. నేను రాష్ట్రమునకు కొంత సేవఁ జేసితిని. వారెరుంగుదురు. దానినిప్పుడు చెప్పనవసరములేదు. ఈదురదృష్టపు కార్యములను మీ యుత్తరములోఁ దెలియపరచినపుడు, ననుఁగూర్చి ఉన్నదున్నట్లు ప్రశంసచేసినపుడు నాదోషంబు నల్పంబుజేయవద్దు. రోషంబున నధికంబుగలుపవద్దు. అవివేకంబుగనైన నతిశయంబుగ ప్రేమించినవానిని గను, సామాన్యంబుగ ననుమానంబునఁబడక మనంబు చెదిరిపోయి యిట్లుపడినట్లు చేయబడిన వానిగను, కోయవానిరీతి తనజాతియంతకంటె ప్రశస్తమైన యమూల్యరత్నంబును బారవేసికొనిన వానినిగను, హృదయకాఠిన్యంబు గల్గియు సముద్రంబువలె కన్నీరుఁగార్చిన వానినిగను తెలియఁజేయుడు. ఇంతేకాక అలిప్పోలో నొకసారి తురుష్కుండొక వీనీసీయునిఁజంపి, రాష్ట్రంబునుదూషించినపుడు, నాసోదరుడైన యాదురాత్ముని గొంతుపట్టి యిట్లు పొడిచితిని. (అని పొడుచుకొనుచున్నాడు.)

రఘు.—ఏమిఘోరమైన అంతము!

వీర.—చెప్పినదంతయు చెడిపోయినది గదా !

పుళిం.—నేనుచంపుటకు పూర్వము ముద్దుబెట్టుకొంటిని. ఆ ముద్దుపైబడి నేచచ్చెదను. (సుశీలమీద పడుచున్నాడు.)

కృష్ణ.—నేనిట్లు జరుగునని భయపడితిని. అతడు దాత్తహృదయుడు కాని ఆయుధము లేదనుకొంటిని.

రఘు.—(ఉగ్రునితో) ఓ క్రూరసర్పమామా! ఈఘోర తల్పభారంబు మాడు! ఇదినీక గ్గ! చూడదుర్భరము కప్పివేయుడు. వీరసేనా, ఈమూరుయొక్క ఆస్తి నీకు వచ్చును. కాపాడుకొనుము. ఈఖలుని శిక్షించుటనీపని యో సేనానీ. ఈసంతోషము నేను రాష్ట్రమువారికిఁ దెలియచేసెదను.

(నిష్క్రమించుచున్నారు.





